మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి

త్రైమాసపత్రిక

ఏప్రిల్ - జూన్, 2012



మార్చి 8,
అంతర్జాతీయ మహిళా దినోత్సవం
సందర్భంగా వివిధ జిల్లాల్లో జరిగిన
కార్యక్రమాల దృశ్యమాలిక



గుంటూరు





విశాఖ



అనంతపురం


రంగారెడ్డి


పశ్చిమగోదావరి



చైతన్య మానవి

సంపాదకీయం...

# బతుకు బండి దుర్భరం

మధ్య తరగతి, సామాన్యుడి గుండెల్లో భయం భయం. కొత్త ఆర్థిక సంవత్సరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తయారు చేసిన "పన్నుల బడిత" చేతబట్టి తరుముకుంటూ వచ్చింది. సేవా పన్ను, వ్యాట్, అధిక ధరలు, ఆస్తిపన్ను, మంచినీరు, విద్యుత్ చార్జీలు, పెట్రో ధరలు పేరు ఏదైనా అన్ని పన్నులు ఆమ్ ఆద్మీ నడ్డి విరుస్తున్నాయి. వేసవి ఉక్క నుంచి కాసేపు సేదతీరేందుకు ఫ్యాన్ వేసుకుందామన్నా కరెంటు మీటర్ ఎర్రగీత తిరుగుళ్ళను జాగ్రత్తగా చూడక తప్పదు.

ఎడాపెడా పన్నుల మోతలు, కరెంటు చార్జీల వాతలు, గ్యాస్, ధరల పెంపుతోపాటు ఉప్పు, పప్పు, బియ్యం, పాలు ఏది ముట్టుకుందామన్నా, చింతనిప్పుల్లా మండిపోతున్నాయి. కూర "గాయాల" ధరల ధాటికి చతికిలబడిన సామాన్యుడి బడ్జెట్ బండి మరింత భారం కానుంది. మరోవైపు చమురు కంపెనీలు పెట్రో ధరలు మరింత పెంచడానికి సన్నాహాలు చేస్తున్నాయి. లీటర్ ధరపై మళ్ళీ 5 రూపాయలు పెరుగుతాయి. పెట్రో ధరలు కొండెక్కితే, ఆ మేరకు చార్జీలు పెరిగి నిత్యావసరాల ధరలన్నీ ఇంకా అందకుండా పోతాయి.

2012-13 సంవత్సర కేంద్ర బడ్జెట్ వల్ల ప్రజలపై సేవా, ఎక్సైజ్ తదితర పన్నుల రూపంలో రూ॥46 వేల కోట్ల భారం పడనుంది. వివిధ సేవలపై వసూలు చేస్తున్న సేవా పన్ను కొత్త బడ్జెట్‌లో 10 నుండి 12 శాతం పెరగడంతో సేవలు మరింత ప్రియం కానున్నాయి. కస్టమ్స్, ఎక్సైజ్ దిగుమతి సుంకాలు పెంచడంతో బంగారం ధరలు కూడా పెరగనున్నాయి.

ఇవి చాలవన్నట్లుగా రాష్ట్ర ప్రభుత్వం భారీగా విద్యుత్ చార్జీలు పెంచి 4,441 కోట్ల రూపాయల భారం వినియోగదారులపై మోపింది. అన్ని వర్గాల వారు దిమ్మెరపోయేలా కరెంటు షాక్ ఇచ్చింది. కనెక్టడ్‌లోడ్, కాంట్రాక్ట్‌లోడ్ అనే పేర్లతో రెండుగా విభజించి మనకు తెలియకుండానే చార్జీలు పెంచి, కోటి కుటుంబాలను దిగ్భ్రాంతికి గురిచేసింది. కరెంటు చార్జీల పెరుగుదల సమాజంలో సగభాగమైన మహిళలకు మరింత భారం కానుంది. ఇంటా, బయటా ద్విపాత్రాభినయం చేస్తూ, పనుల భారంతో సతమతమవుతున్న ఉద్యోగినులు పనికాలాన్ని, శ్రమను తగ్గించుకునేందుకు నేడు అనివార్యంగా మిక్సీ, గ్రైండర్, వాషింగ్ మెషిన్, రైస్ కుక్కర్, ఓవెన్, ఫ్రిజ్, వ్యాక్యూమ్ క్లీనర్ తదితర ఎలక్ట్రానిక్ పరికరాలపై ఆధారపడుతున్నారు. మోయలేని కరెంట్ చార్జీలతో ఈ వస్తువులన్నీ మూలనపడి మహిళల పనిభారాన్ని మరింత పెంచనున్నాయి. ఇప్పటికే పెరిగిన నిత్యావసరాల ధరల వల్ల కుటుంబంలో అందరికీ పెట్టాక మిగిలిన తిండితో మహిళలు సరిపెట్టుకుంటున్నారు. పేద మహిళలలో నూటికి 80 శాతం మంది రక్తహీనతతో, పోషకాహారలేమితో బాధపడుతున్నారు. దీనికి తోడుగా రాష్ట్రంలో మద్యం ఏరులై పారుతూ కుటుంబాల్ని విచ్ఛిన్నం చేస్తోంది. పెరిగిన పన్నుల భారాలు వీటికి తోడై మహిళలను అధోగతి పాల్జేస్తున్నాయి.

విద్య, వైద్యం, రోడ్లు, పార్కులు పారిశుధ్యం అన్ని సేవలూ ప్రైవేటు సంస్థలకు, కాంట్రాక్టర్లకు అప్పజెప్పే చర్యలు వేగవంతం అయ్యాయి. చెత్తపన్ను, ఆస్తిపన్ను, యూజర్ చార్జీలు వంటి అన్ని రకాల చార్జీల పెంపుదల ప్రపంచ బ్యాంకు కనుసన్నలలోనే నడుస్తున్నవి. ప్రపంచ బ్యాంకు అడుగులకు మడుగులొత్తుతూ, అది విధించే అన్ని షరతులకు "జీ హుజూర్" అంటున్నది మన ప్రభుత్వం.

అటు కేంద్రం, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలు వేసిన రకరకాల భారాలతో నడుం విరిగిన ప్రజలను ఈ విద్యుత్ చార్జీలు మరింత కుంగదీస్తాయి. అధికార కుమ్ములాటలలో ఆద్యంతం కూరుకుపోయిన పాలకులకు ఇవేవీ పట్టడం లేదు. ఆమ్ ఆద్మీ పేరు చెప్పుకుని కేంద్రంలో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ నేతృత్వంలోని యు.పి.ఎ ప్రభుత్వం, ఇటు అభివృద్ధి "కిరణాల" పేరుతో పన్నులతో బాదుతూ రాష్ట్ర ప్రభుత్వం జన జీవనాన్ని చిమ్మ చీకటి చేస్తున్నవి.

గతకొద్ది సంవత్సరాలుగా 2జి స్పెక్ట్రమ్ వంటి అతి పెద్ద కుంభకోణాలు, ప్రభుత్వ పథకాల్లో అంతులేని అవినీతి, ప్రజలకు చెందాల్సిన సహజ వనరులు ప్రజాప్రతినిధులు, అధికారులు పప్పు బెల్లాల్లా పంచుకోవడం, విదేశాలలో మూలుగుతున్న కోటాను కోట్ల నల్లధనం ఇవేవీ కళ్ళుండి చూడలేని ఈ గాంధార ప్రభుత్వానికి పట్టవా? వాటిని బొక్కిన వారి నుండి కొంత మొత్తాన్ని వసూలు చేసినా కొన్ని సంవత్సరాల వరకైనా ప్రజలపై ఎటువంటి భారాలు మోపనక్కరలేదు.

ప్రజాభీష్టాన్ని ఇప్పటికైనా గ్రహించి పెంచిన భారాలను తగ్గించేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పూనుకోవడం అవసరం. లేకుంటే 2004వ సంవత్సర సార్వత్రిక ఎన్నికలలో ప్రజా విద్రోహ ప్రభుత్వాన్ని మట్టుబెట్టినట్టే, ఈ ప్రభుత్వాన్నీ ప్రజలు తుదముట్టిస్తారు. ఇది సత్యం.

# చైతన్య మానవి

ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.

సంపాదకులు
**ఎస్. పుణ్యవతి**

మేనేజర్
**ఎం. సుధ**

సంపాదక వర్గం
మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

విరాళం రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.


**సూక్తి**

ప్రతి వంటగత్తె ఒక రాజకీయవేత్త కావాలి.

- లెనిన్

## విచ్చుకత్తుల బోను

వివాహమనే విచ్చుకత్తుల
బోనులో నిల్చోబెట్టి
బంగారపు బొమ్మ అంటూ
నిజంగా చైతన్యం లేనిబొమ్మను చేసి
మైనపు ముద్దలా వారి పిడికిళ్ళల్లో నిన్ను మలచుకుని
సప్తపదుల మంగళ తోరణాలు
బాజా భజంత్రీల హోరులో
వేద మంత్రాల ఉచ్చారణలో
నీ కంఠానికి పసుపుతాడనే
ఉరితాడును బిగియించి
పెద్దల నిర్ణయాలకీ నిబంధనలకీ
నిన్ను బలిపశువును చేశారు
నీ మనసును తెలిసికొనే మగవాడే
నీకు తోడుగా లేకపోయాడు
సహనమూర్తివి కాబట్టే సంతసంతో
తల్లి పదవిని పొందాలనుకొన్నావు
అక్కడా నీకు ఎదురు దెబ్బే తగిలింది
కంటే వంశోద్ధారకున్నే కనాలనే ఆంక్షతో
నీ మనసులో అలజడిరేపారు
'అమ్మా' అనే మాధుర్యపు పిలుపును
పిలిచే గొంతు ఆడైతేమి మగైతేమీ?
అనుకొన్న నీమాతృత్వపు మాధుర్యాన్ని
మంటల్లో కలిపేశారు
గర్భంలో ఆడపిల్ల అని తెలిసిన మరుక్షణం
నీ గర్భాన్ని తొలగించి
నీ అమ్మతనాన్ని అంతం
చేయాలని చూస్తున్నారు
ఇకనైన కళ్ళు తెరిచి
నీలోని చైతన్య శక్తికి జీవంపోసి
నీ జాతిని నీవు కాపాడుకోవడానికి
నడుం కట్టి నారీ లోకానికి
శంఖారావాన్ని పూరించు
విచ్చు కత్తుల బోనులో
విలవిల్లాడిపోకుండా
చిచ్చుబుడ్డిలా వెలుగులు విరజిమ్మే
నీ చైతన్యకాంతులతో
లోకం లోని చీకటిని తొలగించు
నీ జాతిని నీవే సంరక్షించు.

- డా॥ సి. హెచ్. కళావతి.

# పారిస్ కమ్యూన్ విప్లవం-వర్గ పోరాటంలో మహిళలు

-భారతీసాగర్

దోపిడీ వర్గపు విషపు కోరల్లో నుంచి తప్పించుకోవటానికి చరిత్రలో జరిగిన మొదటి కార్మిక పోరాటంగా పారిస్ కమ్యూన్ విప్లవాన్ని చెప్పుకోవచ్చు. ఈ పోరాటం నియంతృత్వ పాలననుంచి పెట్టుబడిదారీ వ్యవస్థ లోకి అడుగిడుతున్న దశలో, పేదలకు, ధనికులకు మధ్య తీవ్రమైన ఆర్థిక, సామాజిక అంతరాలున్న స్థితిలో రాజ్యం యొక్క దుష్పరిపాలనను బద్దలుకొట్టడానికై పారిస్ కార్మికులు ప్రారంభించిన మొదటి యుద్ధం. ఈ పోరాట సమయంలోనే రెండు ముఖ్య సంఘాలు ఏర్పడినాయి. ఒకటి ప్రపంచ కార్మికుల సమాఖ్య. రెండు పారిస్ కమ్యూన్ రక్షణ కొరకు, యుద్ధంలో గాయపడినవారికి సాయం చేయడంకొరకు ఏర్పడిన మహిళా సమాఖ్య (women's union for the defence of paris and for Aid to the wounded). ఇది మొదటి 'ఇంటర్నేషనల్' ఫ్రెంచి మహిళా శాఖ.

ఈ విప్లవోద్యమంలో పురుష కార్మికులతో ఏర్పడిన జాతీయ రక్షక దళంతోపాటు స్త్రీలు కూడా పాల్గొన్నారు. ఈ ఉద్యమం స్వేచ్ఛకోసం, దోపిడీని కూలదోయటం కొరకే కాక, స్త్రీ పురుష సమానత్వం కోసం కూడా జరిగిన తొలి పోరాటం. దీనిని శ్రామిక మహిళల అత్యంత వీరోచితమైన పోరాటంగా పేర్కొనవచ్చు.

**రాజకీయ నేపథ్యం:**

1870 వేసవిలో జర్మనీ ఛాన్సలర్ ఆటోవాన్ బిస్మార్క్‌కు, ఫ్రెంచి నియంత మూడవ నెపోలియన్‌కు మధ్య యుద్ధం జరుగుతుంది. ఈ యుద్ధం ఫలితంగా ఫ్రాన్స్‌లో మూడవ నెపోలియన్ సామ్రాజ్యం కూలిపోతుంది. ఈ యుద్ధం ఫ్రాన్స్‌కు విలయంగా మారుతుంది. నెపోలియన్ చక్రవర్తిని ప్రష్యన్ (జర్మనీ) సేనలు యుద్ధఖైదీగా పట్టుకుంటారు. ఈ రాజకీయ గందరగోళ పరిస్థితులలో కార్మిక వర్గం చొరవతో ఎన్నికలు జరిగి ఫ్రెంచి రిపబ్లిక్‌గా అవతరిస్తుంది. అడాల్ఫ్ థేర్స్ నాయకత్వంలో జాతీయ ప్రభుత్వం వెర్సయిల్స్‌లో ఏర్పాటవుతుంది. ప్రష్యా రాజ్య పాలకుడైన బిస్మార్క్ జర్మనీని ఏకీకరణ చేసి ఫ్రెంచి భూభాగంలోని ఆల్సస్, లొరైన్ ప్రాంతాలను కూడా వశపరుచుకుంటాడు. థేర్స్ నాయకత్వంలోని ఫ్రెంచి ప్రభుత్వం బిస్మార్క్‌కు సలాం కొడుతుంది. చివరికి



పారిస్‌ను బిస్మార్క్‌కు అప్పగించటానికి సిద్ధపడుతుంది.

ఈ లొంగుబాటును వ్యతిరేకిస్తూ కార్మికులతో ఏర్పడిన ఫ్రెంచి జాతీయ రక్షక దళం ఫ్రాన్స్ సంరక్షణకు పూనుకొని 1871 మార్చి 18న థేర్స్ ప్రభుత్వంపైన తిరుగుబాటు జరిపింది. అడాల్ఫ్‌థేర్స్, ప్రభుత్వ సిబ్బంది వెర్సయిల్స్ నగరానికి పారిపోతారు. ఈ పోరాట ఫలితంగా పారిస్ పట్టణం ప్రజల చేతుల్లోకి వచ్చి హోటల్-డీ-విల్లేపైన ఎర్రజెండా ఎగిరింది. ఈ విప్లవం ఫలితంగా ప్రపంచ చరిత్రలో మొదటిదైన కార్మిక వర్గ ప్రభుత్వం ఏర్పాటయింది. ఈ ప్రభుత్వం పేరే 'పారిస్ కమ్యూన్'. ఇందులోని సభ్యులనే 'కమ్యూనార్డులు' అంటారు. కమ్యూన్ 1971 మార్చి 18 నుంచి 28 మే మాసం వరకే ఉనికిలో ఉంది. 72 రోజుల పాలనలోనే కమ్యూన్ కొన్ని చారిత్రాత్మక నిర్ణయాలను చేసింది. దీని వైఫల్యం నుంచి వచ్చిన గుణపాఠాలను విశ్లేషించిన తరువాతనే విప్లవాలు విజయవంతం అయ్యాయి.

కార్మికులతోకూడిన జాతీయ రక్షక దళం (నేషనల్ గార్డ్స్) 25 మంది సభ్యులతోకూడిన కేంద్ర కమిటీని ఎన్నుకుంది. ఇదే తాత్కాలిక ప్రభుత్వంగా అధికారం చేపట్టింది.

**సామాజిక నేపథ్యం:**

నిరంకుశ మూడవ నెపోలియన్ చక్రవర్తి పాలనలో పేదలకు ధనికులకు మధ్య ఆహారం, నివాసం, పారిశుధ్యం, విద్య, ఆరోగ్య సంరక్షణ వంటి విషయాలలో తీవ్రమైన అంతరాలుండేవి. చక్రవర్తి పాలన కూలిపోయి రిపబ్లిక్ ఏర్పడిన తరువాత కూడా ఈ అంతరాలు తొలగలేదు.

ఆనాటి సమాజంలో కార్మికులను బానిసలుగా, అత్యంత హీనంగా చూసేవారు. ఆ బానిసలకు బానిసగా స్త్రీ చూడబడేది. మూర్తీభవించిన పితృస్వామిక, ప్యూడలిస్టు భావజాలమున్న పురుషులతో నిండిన సమాజముండేది. కొంతమంది కార్మిక నాయకులకు కూడా స్త్రీలంటే దురభిప్రాయమే ఉండేది. కార్మిక వర్గ నాయకులలో ఒక ప్రముఖుడైన ప్రొడన్ అనేవ్యక్తి భావాలు స్త్రీలను, వారి శక్తి యుక్తులను ఇంకా కించపరిచేవిగా ఉండేవి. అతడి అభిప్రాయంలో స్త్రీలకు మేధాశక్తి, శారీరకశక్తి లేదు. స్త్రీ కేవలం పునరుత్పత్తికి సంబంధించిన ఒక యంత్రం మాత్రమే.

**కమ్యూన్ అంతర్యుద్ధంలో మహిళల పాత్ర:**

పారిస్ కమ్యూన్ ప్రభుత్వం మహిళా సంక్షేమం కోసమై చేసిన చట్టాల కారణంగా, సామాజిక సంక్షేమం కొరకు కమ్యూన్ చేపడుతున్న చర్యలను గమనించి స్త్రీలు కమ్యూన్ ప్రభుత్వ రక్షణ కొరకు నడుం

బిగించారు.

ఈ సమయంలోనే మొదటి మహిళా విప్లవ సంఘం ఏర్పడింది, అదే పారిస్ రక్షణ మరియు యుద్ధంలో గాయపడిన వారికి సహాయం చేయు మహిళా సంఘం. ( Womens union for the defence of paris and for Aid to the wounded ) ఇది మొదటి 'ఇంటర్నేషనల్' యొక్క ఫ్రెంచి విభాగానికి చెందిన మహిళా శాఖ. ఇది ఏప్రిల్ 1971లో ఎలిజెబెత్ డిమెట్రిఫ్ ద్వారా ఏర్పాటు చేయబడింది. ఈ సంఘంలోని సభ్యులు అందరూ కార్మిక వర్గానికి చెందిన స్త్రీలు,అన్ని వృత్తులకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఇందులో స్కూలు టీచర్లు, కుట్టుపనివారు, బూట్లు కుట్టేవారు, టోపీలు తయారుచేసేవారు, బట్టలుతికేవారు, ఆభరణాలు తయారుచేసేవారు ఉండేవారు. వీరందరూ కేంద్ర కమిటీ నుంచి వచ్చే సూచనలను, ఆజ్ఞలను, పగలైనా, రాత్రైనా ఎప్పటికప్పుడు అమలు చేసేవారు. కమ్యూన్ ఏర్పాటు చేసిన కమిటీలన్నీ కూడా మహిళలతో కూడి శక్తివంతంగా ఉండేవి.

ఈ మహిళా విప్లవ సంఘం యొక్క అంతిమ లక్ష్యం సంపూర్ణ సామాజిక విప్లవం. అప్పటి వరకూ ఉన్న సామాజిక, రాజకీయ చట్టాలను వేళ్ళతోసహా కూల్చివేసి శ్రామిక వర్గంచే ఏర్పడే పరిపాలన. సంక్షిప్తంగా చెప్పాలంటే "శ్రామిక సంక్షేమం కోసం శ్రామిక వర్గ పాలన".

**కార్యాచరణ:**

కమ్యూన్ రక్షణకు అవసరమైన ఆయుధాల తయారీలో మహిళలు కీలక పాత్ర వహించారు. సుమారు 3000 మంది మహిళలు కాట్రిజ్జ్‌ల తయారీలో, 1500 మంది బారికేడ్స్ కట్టడానికి కావలసిన ఇసుక సంచుల తయారీలో పాల్గొన్నారు. వీరందరినీ సమన్వయం చేసేపని ఎలిజెబెత్ చూసేది.

ఇదేకాక మహిళలు యుద్ధంలో గాయపడిన వారికి సేవచేయటం, వంటశాలల్లో, సూపుల తయారీలో, పేదలకు సహాయపడటంలో కూడా ముందుండేవారు.

ఇదే సమయంలో సామాజిక స్థితిలో మార్పుతేవటానికి కూడా మహిళలు ఉద్యమించారు. ఒక చరిత్రకారుడు వాళ్ళ గురించి ఇలా వ్రాశాడు–"బలహీనమైన జాతి అనుకునే స్త్రీలు అంతర్యుద్ధం రోజుల్లో వీరోచితంగా పోరాడారు. వాళ్ళు చాలామందే ఉన్నారు గాని వాళ్ళ లక్ష్యం ఒక్కటే– వాళ్ళ స్థితిని పురుషుడి కన్నా ఉన్నతంగా పెంచాలనే". ఇంకా మే 19, 1971 'టైమ్స్' పత్రిక విలేఖరి ఇలా వ్రాశాడు"అసలు ఫ్రెంచి సైన్యం ఫ్రెంచి మహిళలతోనే నిర్మితమైందా అన్నట్లుంది"అని.

కమ్యూన్ పాలించిన కాలంలో కూడా మహిళలు సామాజిక వ్యవస్థలో మార్పు కొరకు విద్యావ్యవస్థలో సంస్కరణలు, వాటిని ఆచరణలోకి తేవటానికి పోరాటం చేశారు. కమ్యూన్ కూడా ప్రభుత్వ ఖర్చుతో విద్యను అందించటానికి, సాంకేతిక విద్యాబోధనను అందించటానికి ఏర్పాట్లు చేసింది. స్త్రీ విద్యకై ప్రత్యేక దృష్టి సారించారు. ఇందుకొరకు మహిళలతోనే ఏర్పాటు చేసిన కమీషన్‌ను నియమించారు. కార్మిక స్త్రీలు పనిచేస్తున్న కర్మాగారాల పక్కనే నర్సరీలను కూడా ఏర్పాటు చేశారు. ఇటువంటి చర్యల ద్వారా కమ్యూన్ ప్రభుత్వం మహిళా సంక్షేమానికి, సమానత్వానికి నడుం కట్టింది.

పేదరికం కారణంగా వేశ్యావృత్తి అధికంగా ఉండేది. దీనిని కమ్యూన్ ప్రభుత్వం నిషేధించింది. వారికి కొత్త జీవితాన్ని ఇవ్వాలని, పోరాటంలో వారిని భాగస్వాములను చేయాలని ప్రముఖ మహిళా కమ్యూనిస్టు లూసీ మైఖేల్ సూచించింది. దాని కొరకై ఆ స్త్రీలతోనే ఒక విజిలెన్స్ కమిటీని ఏర్పాటు చేసింది.

మహిళా సంఘం చర్చి అధికారాలను కూడా సవాలు చేసింది. వివాహ వ్యవస్థను కూడా కొంతమంది స్త్రీ కమ్యూనార్డులు సవాలు చేశారు. మహిళా సంఘం యుద్ధంలో చనిపోయిన సైనికుల భార్యలకు, పిల్లలకు పెన్షన్ ఇవ్వాలని డిమాండ్ చేయగా, కమ్యూన్ దీనిని ఆమోదించింది.

**మహిళా సంఘం మహిళల కొరకు నాడు చేసిన డిమాండ్స్:**

1. స్త్రీలకు ఓటుహక్కు
2. పురుషులతో సమానంగా వేతనాలు.
3. విడాకుల హక్కు
4. స్త్రీవిద్య

మహిళలు యుద్ధంలో గాయపడిన వారికి సేవచేయటం, వంటశాలల్లో, సూపుల తయారీలో, పేదలకు సహాయపడటంలో కూడా ముందుండేవారు.

5. యుద్ధంలో చనిపోయిన సైనికుల భార్యలకు, పిల్లలకు పెన్షన్.

**కమ్యూన్ అంతర్యుద్ధంలో మహిళల పాత్ర:**

యుద్ధంలో మొదటి రోజైన మే 18న స్త్రీలు థేర్స్ సైన్యాలను నిలువరించటంలో కీలకపాత్ర వహించారు. అంతకు ముందు చరిత్రలో ఎన్నడూ చూడని విధంగా అధిక సంఖ్యలో అన్ని రంగాలకు చెందిన కార్మిక స్త్రీలు ఈ పోరాటంలో పాల్గొన్నారు. పురుషులతో సమానమైన స్థైర్యం, ధైర్యం, తెగువను చూపిస్తూ మృత్యువును లెక్కచేయకుండా పోరాటం సాగించారు. తుపాకీని చేతపట్టి కొందరు, గాయపడిన వారిని రక్షిస్తూ మరి కొందరు, పోరాటంచేసేవారికి సాయం చేస్తూ మరికొందరు కదనరంగంలో పనిచేశారు.

ప్రభుత్వ జనరల్ లెకోమ్టె కాల్పులు జరపటానికి ఆజ్ఞనివ్వగానే మహిళలు ముందుకురికి మీరు మమ్మల్ని కాలుస్తారా? ప్రజలనే కాలుస్తారా? అంటూ ప్రశ్నించడంతో, సైనికులు వీరిని నిలువరించలేకపోయారు. మహిళల పోరాట పటిమను చూసిన సైనికులు పెరిగిన నైతిక ధైర్యంతో తమ జనరల్‌నే బంధించారు. ఇదే విధంగా మహిళలు అశ్వ సైనికులను నిలువరించి, వారికి ఉద్బోధలు చేసి వారిని జాతీయ రక్షకదళంతో సోదరభావంతో కలసిపోయేలాగా చేశారు. కార్మిక వర్గ పోరాటంలో తొలిసారిగా మహిళలు అత్యధిక సంఖ్యలో పాల్గొన్న యుద్ధం ఇదే.

పోరాట సమయంలో మహిళలను అణగదొక్కటానికి 'వాళ్ళు యుద్ధ రంగంలో పెట్రోలు చల్లుతూ ఉన్నారు' అనే పుకార్లు పుట్టిస్తుంది థేర్స్ సైన్యం, ఈ వదంతిని ప్రతికా రంగం ఇంకా వ్యాపింపచేస్తుంది. దీనితో యుద్ధరంగంలో ఏ స్త్రీ అయినా మంచి బట్టలు వేసుకోకుండా, చేతిలో పాలసీసాగాని, ఏదైనా క్యాన్ గానీ ఉంటే వెంటనే వాళ్ళ బట్టలు చించి, పెట్రోలు చల్లటానికి వచ్చిందని చెప్పి, గోడ దగ్గరకు

తోసి కాల్చి చంపేవారు. కమ్యూన్ ఓటమి తరువాత యుద్ధ కౌన్సిల్ ముందు 1051 మంది స్త్రీలను విచారణకై నిలబెట్టారు.

ఈ విచారణను కూడా స్త్రీలు ధైర్యంగా ఎదుర్కొని అసువులు బాసారు. Red virgin of montmartre గా పేరుగాంచిన లూసీ మైఖేల్ అయితే కోర్టు విచారణలో తన చర్యలకు తానే పూర్తి బాధ్యురాలినని ప్రకటించింది. "నేను కమ్యూన్ రక్షణ కొరకు, సామాజిక విప్లవం కొరకు పోరాడాను. నాకు ప్రియాతి ప్రియమైన కోరిక సామాజిక విప్లవమే"నని ఆమె ప్రకటించింది. "కమ్యూన్‌ను ప్రమోట్ చేసిన వాళ్ళలో ఒకదానిగా ఉన్నందుకు నాకు గర్వంగా ఉంది. ఇప్పుడు మీరు నన్ను వదిలివేసినా నేను ప్రతీకారం తీర్చుకోకుండా ఉండలేను" అని లూసీ చెప్పింది. తరువాత ఈమెను న్యూకెలదోనియాకు ప్రవాసం పంపేశారు.

**కమ్యూన్ చివరి రోజులు:**

అపరిపక్వతతో కూడిన కమ్యూన్ ప్రభుత్వం స్టాండింగ్ ఆర్మీని ఏర్పాటు చేసుకోక పోవటం, ఫ్రెంచి బ్యాంక్‌ను స్వాధీనం చేసుకోకపోవటం, పారిస్ తప్ప ఫ్రాన్స్‌లోని ఇతర ప్రాంతాలను స్వాధీనం చేసుకోకపోవటం వలన థేర్స్‌కి అవకాశం దొరికింది. ఫ్రెంచి బ్యాంక్‌లోని నిధులతో అతను సైన్యాన్ని తయారుచేసుకొని వర్సయిల్స్ నుంచి కమ్యూన్‌పైన యుద్ధం చేసి దానిని ఆక్రమించాడు.

ఈ యుద్ధంలో స్త్రీలు కమ్యూన్ రక్షణ కొరకై అసమానమైన ధైర్యాన్ని ప్రదర్శించారు. రాత్రి, పగలు కష్టపడి రక్షణ గోడలను నిర్మించారు. 120 మంది స్త్రీలు అతి పెద్దదైన బారికేడ్‌ను నిర్మించి దాని వెనుక నుంచి పోరాటం సాగించారు. క్వీన్ ఆఫ్ బారికేడ్స్‌గా 1848 పోరాటంలో పేరుగాంచిన జోసెఫ్ కోర్టిమన్ అనే మహిళ 18వ Arrondisment తూర్పు భాగంలో చురుకుగా పనిచేస్తూ మందు గుండ్లలోకి కావాల్సిన మందును సైనికులకు అందించటానికి తన చిన్నారిని కూడా పంపింది.

కమ్యూన్ ఓడిపోగానే తమ భర్తలను అనుసరించి భార్యలు, తండ్రులననుసరించి పిల్లలు కూడా ముందుకి వెళ్ళి తమవాళ్ళతోపాటు తమని కూడా కాల్చమని, ప్రాణత్యాగం చేశారు.

మానవజాతి స్వేచ్ఛకోసం స్త్రీ, పురుషులిరువురు కార్మిక శక్తిని చాటిచెపుతూ చరిత్రలో నిలిచిపోయే విధంగా చేసిన పోరాటమిది. ఈ విప్లవంలో స్త్రీలు అద్భుతమైన ధైర్య సాహసాలను ప్రదర్శించి, బారికేడ్ల దగ్గర తుపాకులు చేతబట్టి పోరాటం చేశారు. సామాజిక విప్లవం రావాలని, స్త్రీ విద్య, సమానత్వం కావాలని ఉద్యమించారు.

ఈ సందర్భంగా నాడు వీర తెలంగాణా విప్లవ పోరాటంలో స్త్రీల పాత్ర గురించి చెపుతూ కా॥సుందరయ్యగారు అన్న వాక్యాలు గుర్తుకొస్తున్నాయి...."స్త్రీలలో ఉన్న శక్తిని, చైతన్యాన్ని వెలికితీసి ఉపయోగించుకోగలిగితే ఎంత గొప్ప విప్లవాన్నైనా సాధించవచ్చు" అని. పారిస్ కమ్యూన్ 72 రోజులే పాలించినా, మొట్టమొదటిసారి పాలనాధికారాన్ని సాధించిన కార్మిక వర్గంగా, పారిశ్రామిక విప్లవం జరుగుతున్న దశలో జరిగిన ఈ పోరాటం, ప్రపంచ కార్మిక వర్గ పోరాటాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినదిగా చరిత్రలో నిలిచిపోయింది.

**కమ్యూన్ చేపట్టిన రాజకీయ, సామాజిక సంస్కరణలు:**

1. చర్చిని, ప్రభుత్వాన్ని వేరుచేసి, చర్చికి చెల్లించే సబ్సిడీలను రద్దుచేసింది.
2. స్టాండింగ్ ఆర్మీని రద్దుచేసి పీపుల్స్ మిలిషాయాని ఏర్పాటుచేసింది.
3. అధికారులను ఓటర్లకు బాధ్యులుగా ఉండేలా రీకాల్ పద్ధతిని ప్రవేశపెట్టింది.
4. ఉచిత విద్యా ఏర్పాటు.
5. రొట్టెల ఫ్యాక్టరీలలో రాత్రి వేళల్లో పనిరద్దు.
6. తాకట్టు వ్యాపారాన్ని నిషేధించి, తాకట్టులో ఉన్న వస్తువులను విడిపించింది.
7. మూతపడ్డ ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకొని వాటిని కార్మికులే సహకార సంఘాల ద్వారా నడిపేటట్లు చేసింది.
8. ఋణాలను మాఫీ చేసింది.

ఈ చర్యలన్నీ కమ్యూన్ గాఢమైన అంతర్జాతీయ దృష్టితో చేసింది. రిపబ్లిక్‌కు చిహ్నమైన మూడు రంగుల జెండాని ఎగురవేయక, ప్రపంచ విప్లవోద్యమానికి చిహ్నమైన ఎర్రజెండాను తన పతాకగా స్వీకరించింది.

కామ్రేడ్స్ కారల్‌మార్క్స్ తన 'ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం' అనే కరపత్రంలో ఇలా కోట్ చేశారు "కమ్యూన్ ప్రధానంగా కార్మిక వర్గ ప్రభుత్వం, దోపిడీ వర్గానికి వ్యతిరేకంగా ఉత్పత్తి శక్తులు సాగించిన పోరాటం నుండి ఉద్భవించింది. దీనిద్వారా కార్మికుల ఆర్థిక విముక్తిని సాధించటానికి రాజకీయ రూపం కనిపెట్టబడింది..."

కామ్రేడ్ ఎంగెల్స్ అయితే "కార్మిక వర్గ నియంతృత్వమంటే ఎలా ఉంటుందో మీరు చూడదలిచారా? అయితే మీరు పారిస్ కమ్యూన్‌వైపు చూడండి, అదే కార్మిక వర్గ నియంతృత్వం అన్నారు. కామ్రేడ్ లెనిన్ కమ్యూన్‌ను ప్రజాసమ్మతమైన కార్మికుల ప్రభుత్వం అని, సోషలిజం యొక్క కనీస కార్యక్రమం' అని అంటున్న దానిని కమ్యూన్ అమలు జరపటానికి పూనుకున్నద'ని అన్నారు. దీనిని ప్రోలాటేరియ నియంతృత్వానికి సజీవ ఉదాహరణగా చెప్పారు. లెనిన్ చనిపోయిన తరువాత భద్రపరిచిన కమ్యూన్ యొక్క ఎర్రజెండాను కప్పారు. సోవియట్ నింగిలోకి పంపించిన అంతరిక్ష నౌక వోస్కోడ్ కమ్యూనార్డులు ఉపయోగించిన బ్యానరుని నింగికి తీసుకెళ్ళింది.

వర్గపోరాటంలో వర్గ శత్రువుమీద సాధించిన మొదటి కార్మిక ప్రభుత్వం భావితరాలకు ఆదర్శంగా 'అంతిమ విజయం కార్మిక వర్గానిదే' అని నిరూపించింది. ఈ పోరాటంలో ఫ్రెంచి మహిళలు స్వాతంత్ర్యం కోసమే కాకుండా సామాజిక విప్లవ లక్ష్యాలను సాధించే దిశగా కూడా ఉద్యమించారు. ఈ ఉద్యమ స్ఫూర్తితో స్వేచ్ఛ, సమానత్వం, సాధికారత కోసం నేటి మహిళ ఉద్యమించాల్సిన అవసరం ఎంతో ఉంది. ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీల మీద జరుగుతున్న భౌతిక, మానసిక, రాజకీయ, సామాజిక దాడులను ప్రతిఘటించటానికి ఈ ఉద్యమం ఒక కరదీపిక కావాలని మనందరి ఆకాంక్ష. మార్క్స్ చెప్పినట్లు 'పోరాడితే పోయేది బానిస సంకెళ్ళే' అది స్త్రీకైనా పురుషుడికైనా సమానమే.

# వివాహ చట్టం - సవరణలు

## ప్రతిపాదన-దాని పర్యవసానాలు



ఇటీవలి కాలంలో వివాహ చట్టాల్లో కొన్ని మార్పులు చేస్తూ బిల్లు ప్రవేశపెట్టాలనే ప్రతిపాదనకు కేంద్ర కేబినెట్ ఆమోదం తెలిపింది. వాటిలో సఖ్యతకు వీలుగాని దాంపత్యం ప్రాతిపదికన కూడా విడాకులు తీసుకోవచ్చనీ, ఆస్తిలో స్త్రీకి కూడా భాగం ఉండాలనీ నిర్ణయించడం సరైన దిశలో వేసిన అడుగే. కాని దీని వలన స్త్రీలు పిల్లలకు సమానత్వం, న్యాయం చేకూరతాయని భావించటం సాధ్యం కాదు. భార్యకు ఆస్తిలో ఎంత వాటా ఇవ్వాలనే విషయంలో ప్రతి కేసుకూ ప్రత్యేకంగా నిర్దేశించే బాధ్యతను ఈ బిల్లు కోర్టులకు వదిలేసింది.

వివాహంలో స్త్రీ పురుషులిద్దరూ సమానం అని అంగీకరిస్తే స్త్రీకి వివాహం తరువాత సంపాదించిన ఆస్తిలో స్త్రీకి సమాన వాటా పొందేహక్కు ఉంటుందని మహిళా సంఘాలు, బృందాలు సూచించడంలో న్యాయం ఉంది. ఇక "సఖ్యతకు వీలుగాని కాపురం" కారణంగా విడాకులు పొందటం అనే అంశంపై పెద్దగా భిన్నాభిప్రాయం ఉండకపోవచ్చు. భర్తలు విడాకులు కావాలని కోరినప్పుడు స్త్రీలు వాటిని వ్యతిరేకిస్తారని కుటుంబ వ్యవహారాల లాయర్లు, మహిళా సంఘాలు గమనించాయి. అట్లా ఎందుకు వ్యతిరేకిస్తారంటే కాపురం తెగిపోతే బయట వారికి ఆర్థిక ప్రత్యామ్నాయం లేదు...పైగా విడాకులు అనేది ఇంకా అంత సామాజిక ఆమోదం పొందలేదు. స్త్రీలు కేసు వేయగలిగే స్థితి ఉంటే వారు ఎక్కువగా భరణం కోసం, నివాసం కోసం కట్నం తిరిగి ఇవ్వమనీ, స్త్రీ ధనం ఇవ్వమనీ కేసు వేస్తారు.

సఖ్యతకు వీలుగాని దాంపత్యం కారణంగా విడాకులు మంజూరు అయేటట్లయితే స్త్రీలకు వివాహానంతర ఆర్జిత ఆస్తిలో సమాన వాటా కల్పిస్తూ ఒక సమగ్ర చట్టం కూడా తేవాల్సి ఉంటుంది. లేకుంటే ఈ కొత్త ప్రతిపాదన స్త్రీలకు బాగా ఆర్థిక నష్టం చేస్తుందనీ ఐద్వా, ఇతర సంఘాలు స్టాండింగ్ కమిటీని కోరాయి. అలాగే ఈ చట్టం అన్ని సమూహాలకూ, మతాలకూ వర్తింపచేయాలని కోరాయి. ఎందుకంటే కుటుంబాలలో స్త్రీల కృషి, వారు ఇంటిలో చేసే పనికి ఇది ఆర్థిక గుర్తింపుగా భావించాలి. ఈ వాస్తవాన్ని పర్సనల్ లా కాదనలేదు. స్త్రీలకు వివాహానంతర ఆర్జిత ఆస్తిలో సమానవాటా ఉండాలని చట్టం నిర్ద్వంద్వంగా కేటాయించాలి. విడిపోయిన తరువాత స్త్రీ ఎప్పుడు కోరితే అప్పుడు వాటా పంచి ఇచ్చే వీలు కూడా చట్టం నిర్దేశించాలి. దేన్ని వివాహం తరువాత సంపాదించిన ఆస్తిగా భావించాలో కూడా ఈ చట్టం స్పష్టంగా నిర్దేశించాలి. ఉదాహరణకు భార్యగాని, భర్తగాని వారసత్వంగా పొందే ఆస్తి అట్లాగే వారికి వచ్చే కానుకలు మొదలయిన వాటిని వివాహం అనంతరం ఆర్జించిన ఆస్తినుండి మినహాయించవచ్చు. (అట్లాగే వివాహానంతర ఆర్జిత ఆస్తిలో ఏమేం చేరాలో కూడా స్పష్టం చేయాలి). అట్లాగే సహజీవనం సాగించే వారికి ఈ చట్టం వర్తిస్తుందా లేదా అనేటటువంటి విషయాలను కూడా ఆలోచించాలి. సరైన చర్చలు, వాదనలు లేకుండానే ప్రభుత్వం తొందరపాటుగా ఇప్పుడు ప్రతిపాదించిన సవరణలు కొన్ని రాయితీలతో ఆమోదింపచేసుకోవాలని చూస్తున్నది.

స్త్రీలకు విడిపోయిన తరువాత ఎంత ఆస్తి ఇవ్వాలి? అనే అంశాన్ని

స్త్రీలకు వివాహానంతర ఆర్జిత ఆస్తిలో సమానవాటా ఉండాలని చట్టం నిర్ద్వంద్వంగా కేటాయించాలి. విడిపోయిన తరువాత స్త్రీ ఎప్పుడు కోరితే అప్పుడు వాటా పంచి ఇచ్చే వీలు కూడా చట్టం నిర్దేశించాలి.

కోర్టులకు వదిలేయడం అనేది అసమాన చర్యే కాకుండా స్త్రీలు ఉన్న ఆస్తి పాస్తులలో సగం కంటె చాల తక్కువ మాత్రమే పొందడానికి దారితీస్తుంది. ఎందుకంటే రకరకాల అభిప్రాయాలు, ప్రభావాలు గల వ్యక్తులే న్యాయ వ్యవస్థలో కూడా ఉన్నారు. న్యాయ వ్యవస్థలో కొన్ని స్థాయిలలో న్యాయమూర్తులు అతి సంకుచితమైన పురుషాధిక్య భావజాలాన్ని స్త్రీలకు సంబంధించిన అంశాలలో కనపరుస్తూంటారనేది స్త్రీల గురించి పనిచేస్తున్న లాయర్లు, కార్యకర్తల ఒక నిరంతర అనుభవం. ప్రస్తుతం ఉన్న న్యాయవ్యవస్థలోని అనుభవాలు, స్త్రీలకు ఇచ్చే భరణం వారు పొందేలా చేసేందుకు ఉండే చట్టాలు దాదాపుగా లేనట్టే. అనేక సందర్భాలలో స్త్రీలు, పిల్లలకు ఇచ్చే భరణాలు వాళ్ళ కలిసివున్నప్పుడు ఉండే జీవన శైలిని కొనసాగించడానికి సరిపోయేలాగా ఉండాలని పదే పదే కోర్టులు ఉటంకించాయి. ఈ సూత్రాన్ని ఎక్కువ భాగం కోర్టులు పాటించటంలేదు.

స్త్రీలు, పిల్లలు గౌరవంగా బ్రతకటానికి సరిపడనంత భరణాన్ని కేటాయించటం కోర్టులలో సర్వసాధారణమైపోయింది. భరణం కావాలని కోర్టుకు వెళ్ళిన స్త్రీలకు సాధారణంగా భర్త సంపాదనలో 5 నుండి 35 శాతం వరకు మాత్రమే భరణంగా కోర్టులు నిర్ణయిస్తున్నాయి. పిల్లలు కూడా తల్లితోనే ఉంటున్నప్పటికీ ఇదే పరిస్థితి ఉందని అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. తాత్కాలిక భృతి, చివరికి భరణం నిర్ణయించేటప్పుడు ఎక్కువ బాగం కోర్టులు చాలా సంకుచితంగా వ్యవహరిస్తున్నాయి.

సఖ్యతకాని దాంపత్యం అనే అంశం ప్రాతిపదికన విడాకులు మంజూరు చేయవచ్చు అనే చట్టాలున్న కెనడా లాంటి దేశాలను ఇక్కడ ఉటంకించకూడదు. ఎందుకంటే ఈ చట్టంతోపాటు వివాహానంతర ఆర్జిత ఆస్తి పాస్తులన్నింటిలో సమభాగం కేటాయించే చట్టాలు కూడా అక్కడున్నాయి. ఎందుకంటే

> పురుషుడు సంపాదించిన మొత్తం ఆస్తులలోను, పెరిగిన ఆదాయంతోను సంపాదించుకునే శక్తితో వివాహం నుంచి బయటపడుతున్నారు. కుటుంబానికి సేవలు చేయడంలో, ఇంటిని నిర్వహించడంలో పిల్లల్ని పెంచడంలో, ముసలివాళ్ళకి పరిచర్యలు చేయడంలో స్త్రీలు పడే శ్రమ వల్లనే పురుషులు సంపాదించగలుగుతున్నారనే వాస్తవాన్ని విస్మరించడం జరుగుతోంది.

కుటుంబాన్ని నిర్మించడంలోను, పిల్లలను పోషించడంలోను, ఇంటి పనిలోను స్త్రీల శ్రమను కూడా అక్కడ పరిగణనలోకి తీసుకున్నారు. ఇంటిపని కూడా బయట చేసే ఉద్యోగం గానే సమానమైన ఆర్థిక విలువను కలిగివుందని గుర్తించారు.

నిజానికి ఇటీవలి కాలంలో అరుణ్‌కుమార్ అగర్వాల్ వర్సెస్ నేషనల్ ఇన్సూరెన్స్ కంపెనీ కేసులో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులో "ప్రభుత్వం వేతనం లేని ఇంటిపనికి విలువను అంచనా వేయాలని దాని ప్రకారమే ప్రమాదాల పరిహారాన్ని లేదా వివాహ ఆస్తుల పంపకాన్ని నిర్ధారించాలని పేర్కొంది. రాజ్యాంగంలోని ఆర్టికల్ 15(1) నిర్దేశించిన విధంగా వివాహ చట్టాలకు సవరణలు చేయాలని కూడా కోర్టు భావించింది. వివాహంలో స్త్రీలకు సమాన హక్కులు ఇవ్వకుండా ఆర్థికంగానూ, ఇతర అంశాలలోను విడిపోయినప్పుడు పురుషునికుండే భద్రత స్త్రీలకు కల్పించకుండా విడాకుల వ్యవహారాన్ని సరళీకృతం చేస్తే అది మరింత వివక్షతకు దారితీస్తుంది.

ఎకనమిక్ రిసెర్చ్ ఫౌండేషన్ వారు విడిపోయిన మహిళలపై చేసిన అనేక అధ్యయనాలలో, విడాకులు పొందిన పురుషులు తరచుగా ఆర్థికంగా ఎటువంటినష్టాలు లేకుండా వివాహం నుండి బయటపడుతుంటే భర్త వదిలేసిన లేదా విడాకులు పొంది విడిపోయిన మహిళలు, పిల్లలు వారి ఆర్థిక స్థాయి బాగా దిగజారుతుందని తేలింది. ఎక్కువ సందర్భాలలో పురుషుడు సంపాదించిన మొత్తం ఆస్తులలోను, పెరిగిన ఆదాయంతోను సంపాదించుకునే శక్తితో వివాహం నుంచి బయటపడుతున్నారు. కుటుంబానికి సేవలు చేయడంలో, ఇంటిని నిర్వహించడంలో పిల్లల్ని పెంచడంలో, ముసలివాళ్ళకి పరిచర్యలు చేయడంలో స్త్రీలు పడే శ్రమ వల్లనే పురుషులు సంపాదించగలుగుతున్నారనే వాస్తవాన్ని విస్మరించడం జరుగుతోంది.

ఎక్కువ మంది మగవాళ్ళు వేరే సంబంధం కలిగి ఉండటం వలన, తిరిగి వేరే పెళ్ళి చేసుకోవాలనుకోవడం వల్ల, ఇంకా కట్నం వస్తుందని ఆశించడం వల్ల విడాకులు కోరరాదని అధ్యయనాలు వెల్లడిస్తున్నాయి. వస్తున్న చట్టాల ప్రకారం ఎదుటి వ్యక్తిలో తప్పులను నిరూపించకుండా విడాకులు పొందడం సాధ్యంకాదు. మగవాళ్ళు దీన్ని నిరూపించలేనప్పుడు చాలాసార్లు భార్యలకు డబ్బు ఇచ్చి వదిలించుకోవడానికి, తద్వారా పరస్పర అంగీకారంతో విడాకులు పొందడానికి ప్రయత్నిస్తారు. ఈ పరస్పర అంగీకారంతో విడాకులు చట్టబద్ధం కాబట్టి ఈ చట్టాల ప్రకారం స్త్రీలను బేరమాడే శక్తి ఉంటుంది కాబట్టి దాదాపుగా ఆస్తిలో సమానవాటా పొందడానికి ప్రయత్నిస్తారు. తద్వారా తమకు, తమ పిల్లలకు ఆర్థిక భద్రత కల్పించుకుంటారు. కొత్త చట్టం ప్రకారం స్త్రీలకు ఈ బేరమాడే శక్తి పోయింది.

విడాకులు పొందిన స్త్రీలు వాళ్ల పుట్టింట్లో ఆశ్రయం పొంది వారి మీదే ఆధారపడతారనేది అందరికీ తెలిసిన వాస్తవం. వీళ్ళల్లో 80 శాతం మంది పైగా స్త్రీలు పిల్లల కోసమే విడిపోవడమో లేదా వదిలిపోవడమో జరుగుతుందనేది కూడా అంతే వాస్తవం.

కాబట్టి సఖ్యతగా జీవించడానికి కుదరని దాంపత్యం అనే ప్రాతిపదికన విడాకులు ఇవ్వాలనే సవరణలు

**తరువాయి 17వ పేజీలో...**

# మృణ్మయనాదం

-ఓల్గా



జనకుని రాజ భవనం సంగీత నాట్యాలతో, పుష్ప సౌరభాలతో చెప్పనలవిగాని ఆనందోత్సాహాలతో వెలిగి పోతోంది. ఆనంద తరంగాలలో తేలియా డుతున్న దీపోత్సవ నౌకలా ఉందా భవనం.

ఉండదా మరి? జనకుని ప్రియకుమార్తె సీతకు అతి మనోహరుడు, శివ ధనుర్భంగం కావించిన శ్రీరామచంద్రునితో వివాహం జరిగింది. సీతతో పాటు ఆమె చెల్లెళ్ళకూ రాముని తమ్ముళ్ళతో పరిణయమైంది. అయోధ్య వచ్చి విదేహంలో దేహంలో దేహమయింది. ఈ పరస్పర స్నేహలింగనాల్లో రాచనగరు పరవశించింది.

అర్ధరాత్రి. సందడులన్నీ మాటు మణిగాయి. రాత్రిపూట మెలకువగా ఉండి రాణి వాసపు అవసరాలు తీర్చే పరిచారికల అడుగుల సవ్వడి తప్ప మరింకే శబ్దమూలేదు. ఆ నిశ్శబ్దపు తొలిరాత్రులలో యువజంటలు ఒకరి కన్నుల్లోకి ఒకరు చూసుకుంటూ మైమరచిపోతున్నారు.

సీతాదేవికి రెండు రాత్రులలోనే శ్రీరామునితో మాట కలిపి చమత్కరించగలిగిన చనువు పెరిగింది. రాముడు సీతాదేవి సౌందర్యాన్ని ఏం చేసుకోవాలో తెలియని అమాయకత్వం నుంచి బైటపడ్డాడు.

అర్ధరాత్రి దాటినా ఇద్దరికీ నిద్రపోవాలనే తలంపే లేదు. ఏవో మాటలు, పరిహాసాలు, చతురోక్తులు. అవసరానికి మించిన నవ్వులు. అనవసరమైన అలకలు, మితిమీరిన బుజ్జగింపులు. విశాలమైన ఈ గది ప్రణయోత్సాహంతో మిడిసి పడుతోంది.

విశ్వామిత్రునితో వెళ్ళి తాను ఎందరు రాక్షసులను చంపాడో, ఎంత అలవోకగా చంపాడో కాస్త అతిశయంగానే చెబుతున్నాడు రాముడు. కానీ సీతకు ఆ సమయంలో సంహారపు ముచ్చట్లు వినాలనిపించలేదు. మెల్లిగా రాముడిని వారించి-

"అరణ్య విహారంలో ఈ బీభత్సం కాకుండా అద్భుతమేమీ జరగలేదా రామా" అంది అతని నల్లని కురులను చిందరవందర చేస్తూ.

"అసలే నల్లనివాడిని. నువ్విలా జుట్టు ముఖం మీదకు లాగితే అసలు కనపడను" అంటూ సీత చేతిని నెట్టి-

"అద్భుతమంటే గుర్తుకొచ్చింది. ఒక సౌందర్యరాశిని చూశాను సీతా ఆ అరణ్య ప్రయాణంలో" అన్నాడు.

సీత ముఖం చిన్నబోయింది. రాముడు తనను చూడకముందే మరో సౌందర్యరాశినెవరినో చూడడమేమిటి?

సీత ముఖం వన్నె తరగడం రాముడు గమనించాడు. సీతను సరదాకైనా సరే పరస్త్రీ సౌందర్య వర్ణనతో చిన్నబుచ్చగల వయస్సు, మనసు రామునికింకా రాలేదు. అందుకని సీతకు ఉన్న విషయం ఉన్నట్లుగా చెప్పాడు.

"ఆమెను చూస్తే చేతులెత్తి నమస్కరించాలనిపించింది. ఒక మునికాంత. అహల్యట. ఆమె పెద్ద పెద్ద కళ్ళు చూస్తే అగ్నినీ, శీతలత్వాన్ని దాచుకున్న సాగరగర్భపు లోతు కనిపించినట్టయి ఒక క్షణం భయమనిపించింది. ఆమె పెదవుల మీది ఆ నవ్వుకు అర్థం నాకింకా తెలియడం లేదు. ఆగ్రహం, అనుగ్రహం, నిర్లిప్తత, వేదాంతం, దయ, ప్రేమ అన్నీ ఉన్నాయి అందులో. ఆ శరీరంలోని సమతుల్యత కేవలం శరీరానిదేకాదు మనసునీ, శరీరాన్ని కఠోర దీక్షలతో వశం చేసుకున్న సమతుల్యత అది. ఆమెనలాగే చూస్తూ ఉండాలనిపించింది. నాకు తెలియకుండానే చేతులెత్తి ఆ స్త్రీ మూర్తికి నమస్కరించాను. దేవతలా ప్రసన్నంగా నవ్విందామె. ఆ క్షణాలను భగ్నం చేస్తూ విశ్వామిత్ర మహర్షి నన్ను ముందుకు నడిపించి అసలు విషయం చెప్పాడు. మనసంతా చేదయింది. సౌందర్యం మాటున సౌశీల్యం లేదని తెలిశాక నాకు చాలా బాధ కలిగింది. కానీ ఆమెను మర్చిపోలేదు. ఆ కళ్ళనూ, ఆ నవ్వునూ మర్చిపోలేను".

సీత ఉత్కంఠతతో వింటోంది.

అహల్య. చక్కని పేరు. నాగలితో దున్నని భూమి అని. తను నాగలితో భూమి దున్నుతున్నపడు జన్మించిన భూపుత్రి. నాగలిపోటే ఎరుగని అహల్య! సౌశీల్యం లేదంటే అర్థం? ఆ సంగతి అడొగొచ్చా? సీత ఆలోచనలో పడటం చూసి రాముడామెను హృదయానికి హత్తుకుని "నేను నీ పక్కనుండగా నీ మనసింకెక్కడో ఉండకూడదు. నీ మనసు నా నుంచి ఒక్క క్షణం పక్కకు మరలినా భరించలేను" అన్నాడు.

ప్రేమగానే అయినా ఏదో ఖచ్చితమైన ఆజ్ఞ ఆ కంఠంలో వినబడి కలవరపడి తన ఆలోచన గబగబా బైటికి చెప్పేసింది సీత.

"నా మనసింకెక్కడికీ వెళ్ళలేదు.

**విశ్వామిత్రునితో వెళ్ళి తాను ఎందరు రాక్షసులను చంపాడో, ఎంత అలవోకగా చంపాడో కాస్త అతిశయంగానే చెబుతున్నాడు రాముడు. కానీ సీతకు ఆ సమయంలో సంహారపు ముచ్చట్లు వినాలనిపించలేదు.**

మీరు చెప్పిన అహల్య సంగతే ఆలోచిస్తున్నా. సౌశీల్యం లేదంటే–"

"సీతా!నువ్వింకా చిన్నపిల్లవు. నీకు అర్థం కాదు. అసలలాంటి విషయాలు నువ్వు వినకూడదు. మాట్లాడకూడదు".

సీత నోటిని తన పెదవులతో మూసేశాడు రాముడు. ఆ మత్తులో సీత అన్నీ మర్చిపోయింది.

★★★

అయోధ్యలో సీతకు కాలం ఎలా గడుస్తుందో ఆలోచించుకునే వ్యవధానమే ఉండటం లేదు. రాముని ప్రేమ ఊపిరి తీసుకోనివ్వడం లేదు. అత్తగార్ల గారాబం అంతులేకుండా ఉంది. పుట్టింటి బెంగకు ఆస్కారమే లేదు. చెల్లెళ్ళు ఇక్కడే ఉన్నారు. రోజుకో రీతితో పుష్పాలంకరణలు చేస్తున్న చెలికత్తెలను ప్రశంసించడం తప్ప చేయాల్సిన పనేమీ లేదు.

అలాంటి ఆనందమయ కాలంలో ఒకరోజు కౌసల్య సీతను తన మందిరానికి పిలవనంపింది. సముచితంగా అలంకరించుకుని వెళ్ళి అత్తగారికి ప్రణామం చేసింది సీత.

ఎవరో సామంతుల రాణులు సీతను చూడవచ్చారు. వారు సీతను చూసి ముగ్ధులై ఆమె సౌందర్యాన్ని కౌసల్య హృదయం ఉప్పొంగేలా వర్ణించారు.

"మా సీత భూపుత్రి" అంది కౌసల్య గర్వంగా.

"ఔనట. విన్నాం. జనక మహారాజు అదృష్టం. అందుకే అందంలో అహల్యనే మించిపోయింది" అన్నదొక రాణి.

సీత ఉలిక్కిపడింది. అహల్య–రాముడు ప్రశంసించిన అహల్య వీళ్ళకూ తెలుసా?

వచ్చిన అతిథులు వెళ్ళిపోయారు. కౌసల్య పరిచారికలను పిలిచి సీతకు దిష్టి తీయించింది.

"నిన్ను చూపించకుండా ఉండలేను. వాళ్ళ దృష్టి దోషం తగులుతుందేమో భయపడకుండానూ ఉండలేను" నవ్వింది కౌసల్య.

''అహల్య ఎవరత్తయ్యా'' సంకోచంగా అడిగింది సీత.

అందమైన స్త్రీలను భోగవస్తువులనుకుంటారు గదా పురుషులు. ఇంద్రుడనే వానికి ఆమె మీద కోరిక కలిగింది. ఒకనాడు గౌతముడు ఆశ్రమంలో లేని సమయం చూసి గౌతమునిలా వేషం ధరించి వచ్చాడా ఇంద్రుడు. ఆమె భర్తే అనుకుంది. అతని కోరిక తీరింది. అప్పుడు గౌతముడు రావడంతో విషయం బయటపడింది. మహర్షి అమెను పరిత్యజించాడు. అహల్య జరిగింది తెలుసుకుని స్థాణువే అయింది. చలనం లేని శిలే అయింది.

"గౌతమ మహర్షి భార్య తల్లీ. అపురూపమైన అందం. అందానికి తగిన సౌశీల్యం. అయినా పాపం శాపగ్రస్త అయింది".

"ఏమయిందత్తయ్యా".

"ఏముంది తల్లీ., అందమైన స్త్రీలను భోగవస్తువులనుకుంటారు గదా పురుషులు. ఇంద్రుడనే వానికి ఆమె మీద కోరిక కలిగింది. ఒకనాడు గౌతముడు ఆశ్రమంలో లేని సమయం చూసి గౌతమునిలా వేషం ధరించి వచ్చాడా ఇంద్రుడు. ఆమె భర్తే అనుకుంది. అతని కోరిక తీరింది. అప్పుడు గౌతముడు రావడంతో విషయం బయటపడింది. మహర్షి అమెను పరిత్యజించాడు. అహల్య జరిగింది తెలుసుకుని స్థాణువే అయింది. చలనం లేని శిలే అయింది. మన లోకంలోనే లేకుండా, ఇల్లూ, వాకిలీ లేకుండా, ఎండా, వాన, చలి తేడా తెలియికుండా అ అడవిలో ఉంటోంది. ఎవరికీ కనపడదు".

సీత కళ్ళల్లో నీళ్లు చూసి కౌసల్య ఆగి తను చేసిన పనికి నొచ్చుకుంది.

"చిన్నపిల్లవు, నీకివన్నీ చెప్పి తప్పు చేశాను. ఎవరి రాత ఎలా ఉంటే అలా జరుగుతుంది. మనం చేయగలిగిందేమీ లేదు. గీతనెవరూ మార్చలేరు. మర్చిపోమ్మా. ఆ దురదృష్టవంతురాలి సంగతి మర్చిపో" ఆ మాటలంటూనే సీత మనసు మరల్చడానికి మందిరం వెలుపల మాటలు నేర్చిన చిలక నుంచిన పంజరంవైపు తీసుకెళ్ళింది.

ఆ చిలక కౌసల్య మాటలాపగానే సీత వంక తిరిగి "సీత–రాత, సీత–గీత; సీత–రాత" అని పలుకుతూ విచిత్రంగా నవ్వసాగింది.

సీత భయపడి కౌసల్య వెనక నిలబడి "నేను నా మందిరానికి వెళ్ళొచ్చా అత్తయ్యా" అంది.

చిలుక వింత ప్రవర్తనకు కౌసల్యకూ ఏదో భయం ఆవరించింది. "పదమ్మా–నేనూ వచ్చి రాముడినీ నిన్నూ కళ్ళారా చూసుకుంటాను" అంటూ వెంటరాబోతున్న దాసీలను వారించి సీతారాముల మందిరం వైపు నడిచింది. రాముడి కోసం మధ్యాహ్నం నుంచీ ఎదురు చూస్తోంది సీత. కౌసల్య వచ్చి రాముడు లేడని తెలుసుకుని సాయంత్రం వరకూ సీతతోనే ఉంది. పూజా సమయమయిందని వెళ్ళిపోతూ మరునాడు ఉదయాన్నే ఇద్దరినీ తన మందిరానికి రమ్మని ఆహ్వానించింది. అప్పటినించీ–

సీత మనసు నిండా అశాంతి. అహల్య కథ గుర్తొచ్చి భయం. జాలి, దుఃఖం. ఆమె సౌశీల్యవతి కాదని రాముడెందుకన్నాడో తెలియక కోపం. అత్తగారు సౌశీల్యవతి అన్నది గదా. జరిగినదానిలో ఆమె తప్పులేనప్పుడు రాముడలా ఎందుకన్నాడు? పాపం అహల్య. ఆమె రాత అలాఉందని అంది అత్తగారు. ఆ చిలక ఎందుకలా అన్నది? సీత–గీత; సీత–గీత....చిలక మాటలు గుర్తొస్తే ఒళ్ళంతా భయంతో కంపిస్తోంది. తల పగిలిపోయేంత నొప్పి. సీత ఆ తలనొప్పితోనే నిద్రపోయింది.

★★★

అంతఃపురంలోని శోకసముద్రాలు దాటి, నదీ తీరం దగ్గరకు వచ్చి, వెంటనే వచ్చిన ముఖ్యులకు వీడ్కోలు ఇచ్చి, పడవ ఎక్కిన తర్వాత గాని సీత మనసు సేదతీరలేదు.

'జరిగిందేదో జరిగింది. రాముడితో కలిసి తను ఎక్కడుంటే ఏమిటి? అంతఃపురాలు చిన్నతనం నుంచీ చిరపరిచితాలే. ఈ నదులూ, అరణ్యాలూ, పర్వతాలూ వీటి సుఖశాంతులను అనుభవిద్దాం. రాజకీయ అంతరాయం లేకుండా రాముని ప్రేమ పూర్తిగా తన స్వంతం అవుతుంది'.

సీతకు ఉన్నవాటిని ఆనందించడం సహజ స్వభావం. రాజ్యం దాటుతున్న కొద్దీ

**నాలా మాట్లాడే స్త్రీలను భరించటం కష్టం సీతా. నేను తప్పు చేశానని ఒప్పుకుంటే భరిస్తారు. పాపానికో ప్రాయశ్చిత్తం ఉంటుంది. తప్పు చేయలేదని వాదిస్తే నామీద జాలిపడతారు. అన్యాయంగా దోషం ఆరోపించారని నా పక్షం వహిస్తారు. కానీ నా తప్పొప్పులతో మీకేమిటి సంబంధం? అది విచారించే హక్కు, అధికారం మీకెవరిచ్చారంటే మాత్రం ఎవరూ సహించరు**

ఆమెకు తన స్వస్థలానికి చేరుతున్న భావం తప్ప పరసీమలకెక్కడికో ప్రయాణమయ్యామన్న భావన రాలేదు. అది రామునితో చెబితే "నువ్వు భూపుత్రివి కదా. అంతా నీ సామ్రాజ్యమే" అన్నాడు నవ్వుతూ. సీతకు మళ్ళీ అహల్య గుర్తొచ్చింది. తననెవరైనా భూపుత్రి అనగానే అహల్య ఎందుకు గుర్తొస్తోందో సీతకు అర్థమయ్యీ కానట్లు ఉంది. ప్రయాణం సాగుతోంది. అరణ్య ప్రాంతాలలో ఆశ్రమాలు కనపడిన చోటల్లా రాముడు ఆగుతున్నాడు. మునులను సందర్శించి కష్టసుఖాలను వింటున్నాడు. దస్యుల వల్ల తమకొస్తున్న ఆటంకాలను వారు చెబుతున్నప్పుడు రాముని చేయి ధనుస్సు మీద బిగుసుకున్నది. సీత మునిపత్నులను కలిసి వారు వివిధ ఆహారాలను తయారుచేసే తీరులను తెలుసుకుంటున్నది.

మొత్తానికి సీతకు కాలం హాయిగానే గడుస్తున్నది. ఒక ముని ఆశ్రమంలో రెండు రోజులు బస చేద్దామని అన్నదమ్ములిద్దరూ నిర్ణయించారు. ఈ పరిసర ప్రాంతాల దస్యుల వివరాలను సేకరించాలని వారి ప్రయత్నం. ఉదయపు పూజలు ముగించుకుని అన్నదమ్ములు వెళ్ళిపోయారు. సీత మునిపత్నికి సహాయం చేద్దామని వెళితే ఆమె వారించింది. దాంతో సీత పరిసరంలో ఒక జలపాతం ఉందని తెలుసుకుని గుర్తులడిగి అక్కడికి బయల్దేరింది.

అది పెద్ద దూరం కాదు. పెద్ద జలపాతమూ కాదు. కానీ చాలా అందమైన ప్రదేశం. జలపాతం నుంచి స్వచ్ఛమైన నీళ్ళు చిన్న ప్రవాహంగా సాగిపోతున్నాయి. ప్రవాహపు అడుగున రంగురంగుల రాళ్ళు. తళతళలాడే సూర్యకిరణాలు ఆ రాళ్ళమీద పడి అవి రత్నాల ప్రోవుల్లా మెరుస్తున్నాయి. ఆ నీళ్ళలో కాళ్ళు పెట్టి ఆ రంగురాళ్ళను పరిశీలిస్తూ కూర్చుంది సీత.

"ఎవరమ్మా నువ్వు" మృదు గంభీరమైన గొంతు వినపడేంత వరకూ సీత ఆ రంగు రాళ్ళ లోకంలోనే ఉంది.

పక్కకు తిరిగి తల పైకెత్తిన సీత అక్కడ నిల్చుని వున్న స్త్రీని చూసి నివ్వెరపోయింది. దివ్యతేజోమూర్తి! సీత అప్రయత్నంగా లేచి చేతులెత్తి నమస్కరించింది.

"నా పేరు సీత. శ్రీరామచంద్రుని భార్యను".

ఆమె సీత భుజం మీద చేయి వేసి 'అలాగా' అని చిరునవ్వు నవ్వింది.

చిరునవ్వులో అంత కరుణ ఉంటుందని సీతకంత వరకూ తెలియదు.

"మీరెవరమ్మా" అని అడిగింది ఆమె పాదాల వంక చూస్తూ.

"నన్ను అహల్య అంటారు".

సీతకు ఒక్క క్షణం గుండె ఆగినట్లనిపించింది.

"అహల్య! అహల్యంటే మీరా"?

"నా గురించి విన్నావా?" నవ్వింది అహల్య. పారిజాత పూలు జలజలా రాలినట్లనిపించింది.

అహల్య కూర్చుంటే సీత కూడా పక్కన కూర్చుని-

"విన్నాను. మా అత్తగారు కౌసల్య మీ కథంతా చెప్పారు. ఎంత అన్యాయమో" అంది సీత.

"ఏం అన్యాయం?" మామూలుగా అడిగింది అహల్య.

"మీరు చేయని తప్పుకి మీరు దోషిగా నిలబడ్డారు" జాలిపడింది సీత.

"ఈ లోకంలో అనేకమంది ఆడవాళ్ళు అలా నిలబడాల్సిందే గదా సీతా".

"కానీ మరీ అంత ఘోరమా? మీకు తెలియదు గదా అతను మీ భర్త కాదని-"

"తెలుసో, తెలియదో నీకు తెలుసా? అసలెవరికైనా తెలుసా?"

సీత నోరు తెరిచి అంతలోనే మూసింది. ఆమె తల తిరిగినట్లయింది. తెప్పరిల్లి సంకోచిస్తూ-

"అంటే - మీకు తెలుసా? అని అడిగింది.

"ఆ ప్రశ్నకు ఏమీ అర్థం లేదు సీతా".

"కానీ సత్యం ఏమిటి? సత్యమనేది ఒకటుంటే దానికి అర్థమంటూ ఉండదా?" సీతకు ఆశ్చర్యం, కుతూహలం.

"ఎవరి సత్యం వారిది. సత్యాసత్యాలు నిర్ణయించగల శక్తి ఈ ప్రపంచంలో ఎవరికైనా ఉందా?"

సీతకు అహల్య మాటలు అర్థం కాలేదు. సీత ముఖంలోని అయోమయంతో కూడిన అమాయకత్వం చూసేసరికి అహల్యకు జాలి వేసింది.

"అర్థం కావడం కష్టమే సీతా. నీకు నా కథ ఎందుకు చెప్పారో, ఎలా చెప్పారో నాకు తెలియదు. ఇంద్రుడు నన్ను వాంఛించాడు. స్త్రీ-పురుషుల భోగ వస్తువని అందరూ అనుకున్నట్లే అతనూ అనుకున్నాడు. నేను అతనికి లోబడనని చీకటిలో నా భర్త వేషంలో వచ్చాడు. అతను నా భర్త కాదని నేను గుర్తించానా లేదా? లోకంలో అనేకమందిని వేధించే ప్రశ్న ఇది. నా భర్తకు మాత్రం ఆ తేడా లేదు. నాకు తెలిసినా, తెలియకపోయినా ఆయనకొకటే. ఆయన వస్తువు తాత్కాలికంగానైన పరహస్తగతమయింది. మైలపడింది. మైల, శౌచం, పవిత్రం, అపవిత్రం, శీలం, పతనం- ఈ పదాలను బ్రాహ్మణ పురుషులెంత బలంగా సృష్టించారంటే ఇందులో సత్యాసత్యాల ప్రసక్తే లేదు. విచక్షణే లేదు".

అహల్య ఆగిపోయింది. సీతకు ఇదంతా అర్థమవుతుందా? కానీ సీత ముఖం చూస్తుంటే ఆప్యాయత. ఆత్మీయత. ఆమెకు చెప్పాలనిపించడం తనకు ఆశ్చర్యంగా ఉంది. సీత పట్ల తనకీ సోదరీ భావం ఎందుకు?

మాట్లాడటం ఆపిన అహల్యను చూస్తోంది సీత.

"నువ్వీ అరణ్య ప్రాంతాలకెందుకొచ్చావు సీతా?"

సీత తన కథంతా చెప్పుకొచ్చింది.

"రాముని వదిలి ఉండలేక ఈ అరణ్యాలకొచ్చావా?" నవ్వింది అహల్య.

"సీత సిగ్గుపడుతూనే "ఆయనను వదిలి ఒక్కరోజు కూడా ఉండలేను. ఆయనా

అంతే అందరు మగవాళ్ళవంటివాడు కాదు" అంది.

"మగవాళ్ళందరూ ఒకటే సీతా. ముఖ్యంగా భార్యల విషయంలో.

"కాదు. నా భర్త అలాంటివాడు కాదు. సత్యాసత్యాలు విచారిస్తాడు".

"విచారిస్తాడు గదా"వ్యంగ్యంగా అంది అహల్య.

"అంటే-"

" అంటే- విచారణ జరపడమంటే ఏమిటి సీతా? అవనమ్మకమే కదా. అంతకంటే ఏదో ఒక నమ్మకమే నయం కదా".

సీతకు మనసంతా చికాకయింది. ఏమిటీవిడ వితండవాదం.

సత్యమనేదే లేదంటుంది. అదెవరికీ తెలయదంటుంది. తన సంగతి చెప్పదు.

"ఇంతకూ మీ విషయంలో సత్యమేమిటో చెప్పనంటారు!"

"నీ మనస్సుకు ఏది శాంతినిస్తుందో అది సత్యమనుకో" నవ్వింది అహల్య.

సీత ముఖం వివర్ణమయింది. అహల్య తనను అవమానిస్తోంది. ఈమె గురించి ఎంత ఆలోచించాను. రాముడి మాటలే నిజమేమో. ఈమె సౌశీల్యవతి కాదేమో.

"నాలా మాట్లాడే స్త్రీలను భరించటం కష్టం సీతా. నేను తప్పు చేశానని ఒప్పుకుంటే భరిస్తారు. పాపానికో ప్రాయశ్చిత్తం ఉంటుంది. తప్పు చేయలేదని వాదిస్తే నామీద జాలిపడతారు. అన్యాయంగా దోషం ఆరోపించారని నా పక్షం వహిస్తారు. కానీ నా తప్పొప్పులతో మీకేమిటి సంబంధం? అది విచారించే హక్కు, అధికారం మీకెవరిచ్చారంటే మాత్రం ఎవరూ సహించరు".

" ఆ అధికారం గౌతమ మహర్షికి కూడా లేదా?'' సీతకు అహల్య అంతుపట్టడం లేదు.

''లోకం ఆయనకా అధికారాన్నిచ్చింది. నేనివ్వనంత వరకూ ఎవరూ నా మీద అధికారాన్ని పొందలేరు".

''కానీ మిమ్మల్ని ఆయన పరిత్యజించారుగా".

" పాపం. పోగొట్టుకున్నాడు".

"మీరు మాత్రం-ఎన్నాళ్ళో శిలలా బతికారటగా".

''అని మీరనుకుంటున్నారు. ఇన్నేళ్ళూ నేను ఈ విశ్వంలో నా అస్తిత్వాన్ని గురించి ఆలోచిస్తున్నాను. ప్రపంచం ఏ నీతుల మీదా, ధర్మాల మీదా నడుస్తోందా, వాటికి మూలమేమిటో తెలుసుకున్నాను. నేనెంతో జ్ఞానం సంపాదించాను".

"సత్యాసత్యాలు లేవనటమేనా ఆ జ్ఞానం" సీత వ్యంగ్యంగా, విసురుగా అన్నది.

"సత్యం ఎప్పుడూ ఒక్కలాగే ఉండదనీ నిరంతరం మారుతూ ఉంటుందనీ తెలునుకోవడమే నేను సంపాదించిన జ్ఞానం".

"సత్యం ఉంది. మారని సత్యం ఉంది. నాపై రాముని ప్రేమ, రాముని మీద నా ప్రేమ సత్యం. ఇందులో అసత్యమేమీ లేదు. దీని ముందు మీరు సంపాదించిన జ్ఞానమంతా కొట్టుకుపోతుంది" అవేశంగా అంది.

" అలాగైతే నేను జ్ఞానానికున్న ఆ కోణాన్ని కూడా అర్థం చేసుకుంటాను సీతా".

సీతకు ఆమెతో మాటలు పొడిగించాలనిపించలేదు. ఏదో ఆవేశం, ఆరాటం. వెంటనే రాముని సన్నిధిలోకి వెళ్ళిపోవాలనిపించింది.

సీత లేచి అహల్యకు నమస్కరించింది.

అహల్య సీత తల మీద చేయిపెట్టి

''ఎన్నడూ విచారణకు అంగీకరించకు సీతా. అధికారానికి లొంగకు" అని దీవించింది.

సీత ఆ మాటలు భరించలేనిదానిలా అక్కడి నుండి వడివడిగా వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

ఆ రాత్రి రాముడితో మామూలు కబుర్లన్నీ చెప్పాక మెల్లిగా అంది సీత.

"నేను అహల్యని చూశాను".

''ఎక్కడ? అదిరిపడి లేచాడు రాముడు.

"ఎందుకంత కంగారు. జలపాతం దగ్గరకు వెళ్ళాను".

"ఒంటరిగానా?"

"ఔను. ఇక్కడకు చాలా దగ్గర. ఎంతో బాగుంది".

"ఒంటరిగా ఎక్కడకూ వెళ్ళకు సీతా" ఆందోళనగా అన్నాడు రాముడు.

"సరే వెళ్ళను. అహల్య సంగతి చెప్పనివ్వరా?"



రాముడేం మాట్లాడలేదు.

''ఆవిడ మీరన్నట్లు అద్భుత సౌందర్యమూర్తి. చేతులెత్తి నమస్కరించాలనిపించే తేజస్సు. కానీ ఆమె మాటలకు అర్థమే లేదనిపించింది. ప్రపంచంలో సత్యమనేదే లేదనీ, సత్యం నిరంతరం మారుతుంటుందనీ ఏదేదో మాట్లాడింది. నా మనసుకేమీ ఇంపుగాలేవు. చికాకుగా అనిపించింది".

రాముడు మౌనంగా విన్నాడు.

"ఏం మాట్లాడరేం?"

''ఏముంది మాట్లాడటానికి? అలాంటి స్త్రీ మాటలు నీలాంటి నిర్మల హృదయులకూ, అమాయకులకూ అర్థం కావు., పొద్దుపోయింది. పడుకో సీతా".

ఆజ్ఞాపించినట్లే అని తను నిద్రకుపక్రమించాడు.

సీతకు రామునితో తమ సంభాషణ అసాంతం చెప్పాలని ఉంది. కానీ వినడం రామునికిష్టం లేదని అర్థమైంది.

మళ్ళీ మళ్ళీ అహల్య మాటలు గుర్తుకు తెచ్చుకుంటూ, చికాకుపడుతూ, అశాంతిగా నిద్రలేని రాత్రిని దాటింది సీత.

ఆ తర్వాత చాలాకాలం పాటు ఆమె అహల్యను మర్చిపోయిందనే చెప్పాలి.

★★★

ఆరోజు సీత మనస్సు ఆనందోద్వేగాలతో నిండిపోయింది. రావణ సంహార వార్త ఆమెకు అందింది. లంక నుంచి విముక్తి కలిగిందనే ఆనందంతో ఆమె ఉప్పొంగిపోయింది. ఎప్పుడెప్పుడు రాముడిని చూస్తానా అని ఆమె హృదయం

కొట్టుకుపోతోంది. రాముని చూడగానే తానేమవుతుంది? రాముడేమంటాడు? అతని అనురాగ వీక్షణాలు, ప్రేమ, స్పర్శ అన్నీ దొరుకుతాయి. ఆనందంతో అవిరామంగా కన్నుల నుంచి నీరు కారుతోంది. లక్ష్మణుడిని దూరాన్నించి చూసి గబగబా ముందుకి నడిచింది సీత.

లక్ష్మణుడిని చూసి ఆశ్చర్యపోయింది. రావణ సంహారం జరగలేదా? జరగకపోతే లక్ష్మణుడిక్కడికెలా వచ్చాడు? వచ్చినవాడి ముఖంలో ఆనందం లేదేమిటి? విజయగర్వంతో తల ఎత్తుకు రాకుండా దోషిలా తలదించుకున్నాడెందుకు?

"లక్ష్మణా! ఎలా ఉన్నావు?" తనే పలకరించింది సీత. లక్ష్మణుడు మరింత తల దించుకున్నాడు.

"శ్రీరామచంద్రుడు- మీ అన్నగారు-క్షేమమేనా?" ఈ విషయంలో సీతకేమీ సందేహం లేదు. కానీ మరిది ముఖం చూస్తే అది తప్ప ఇంకోమాట రాలేదు.

"క్షేమమే వదినా".

"మరి అలా ఉన్నావెందుకు లక్ష్మణా. నీ ముఖంలో ఆనందమే లేదేం. నన్ను తీసుకురమ్మనేగా అన్నగారు నిన్ను పంపారు. పద వెళ్దాం".

" ఒక్క విషయం చెప్పాలి వదినా".

సీతకు మతి పోతోంది. ఒక పక్క విజయోత్సాహంతో వానర సైన్యం చేస్తున్న కోలాహలం అశోకవనానికి కూడా వినిపిస్తూనే ఉంది. లక్ష్మణుడు పూర్తిగా పరాజయం పాలైనవాడిలా ఉన్నాడెందుకు?

"శ్రీరామచంద్రుడు శీల పరీక్ష కోరుతున్నాడమ్మా" సీత గిరుక్కున వెనుదిరిగింది. ఆ మాటలు ఆమె మనసులోకి ఇంకేసరికి ఆమె నిలబడలేనిదానిలా నేలమీద కూలబడింది.

"శ్రీరామచంద్రునికేమీ సందేహం లేదు వదినా. కేవలం ప్రజల కోసమే ఈ ఆలోచన. విచారణలో న్యాయమే గెలుస్తుంది. సత్యమే జయిస్తుంది. పరీక్షలో నిలిచి గెలిచిన మీ సౌశీల్యాన్ని అందరూ కొనియాడతారు. రామచంద్రుడు మీతో ఈ మాటలు చెప్పమన్నాడమ్మా".

సీతకు మెరుపులా అహల్య రూపం కన్నుల ముందుకొచ్చింది.

" విచారణ జరపడమంటే ఏమిటి సీతా! అపనమ్మకమే కదా. అంతకంటే ఏదో ఒక నమ్మకమే నయం కదా".

**"శ్రీరామచంద్రునికేమీ సందేహం లేదు వదినా. కేవలం ప్రజల కోసమే ఈ ఆలోచన. విచారణలో న్యాయమే గెలుస్తుంది. సత్యమే జయిస్తుంది. పరీక్షలో నిలిచి గెలిచిన మీ సౌశీల్యాన్ని అందరూ కొనియాడతారు.**

" మగవాళ్ళందరూ ఒక్కటే సీతా".

అహల్యకు ఇదంతా ఇలా జరుగుతుందని తెలుసా? రాముడు తన శీల పరీక్షను కోరాడు. ఇంతకంటే చావు నయం కదా. తన ఖర్మానికి తననొదిలేయడం నయం కదా. ఎందుకు తనకీ అవమానం. ఇంత యుద్ధమూ దీని కోసమా?

యుద్ధం ప్రతాపాల నిరూపణకు. రాముడు తన ప్రతాపం నిరూపించుకున్నాడు. భార్య శీల నిరూపణకు ఎదురుచూస్తున్నాడు. అహల్య చెప్పిన అపనమ్మకమేనా ఇది? అంతకంటే నమ్మి తన చేయి పట్టుకోవడమో, నమ్మక పరిత్యజించడమో నయం కదా. ఏం చెయ్యాలిప్పుడు? సీత మనస్సు అగ్ని పర్వతమయింది.

" అన్నగారిని అపార్థం చేసుకోవద్దమ్మా. రేపు మీ గురించి ఎవరూ ఏమీ అనకుండా జాగ్రత్త తల్లీ. అయోధ్యా నగరానికి మీరు నిప్పులా నడిచివెళ్ళాలమ్మా. అన్నగారెంత బాధపడుతున్నారో, విలపిస్తున్నారో మీరూహించలేరమ్మా. ఆయన నిస్సహాయుడమ్మా".

లక్ష్మణుడు రాముని బాధను వర్ణిస్తున్న కొద్దీ సీత హృదయంలో మంటలు తగ్గాయి.

" రాముని కేమీ సందేహం లేదు. సత్యమేమిటో తెలుసు. నామీద నింద రాకుండా నాకోసమే ఇంత బాధపడుతున్నాడు. నేనెలా స్పందిస్తానోనని కుమిలిపోతున్నాడు. తమ మధ్య ఇది సృష్టించగల అగాధం తల్చుకుని కంపించిపోతున్నాడు'.

రాముడిని ఓదార్చడానికి సిద్ధమైపోయింది సీత.

ఆయన నిస్సహాయుడు. బలహీనుడు. ఎవరి ముందు? రావణుని ముందు కాదు. లోకం ముందు. లోకం అంటే అది చెప్పే నీతి సూత్రాలు. ధర్మ శాస్త్రాలు. మళ్ళీ అహల్య మాటలు గుర్తొచ్చాయి సీతకు.

"శౌచం, మైల, పవిత్రం, అపవిత్రం, శీలం, పతనం-ఈ పదాలనూ, భావాలనూ బ్రాహ్మణ పురుషులెంత బలంగా సృష్టించారంటే..."

ఆ బలం ముందు రామబాణం వీగిపోతుంది. బ్రహ్మాస్త్రం బలహీనమవుతుంది. రాముడిని ఆదుకోవాలి. రక్షించాలి. లోకం నుండి. కన్నీరు తుడవాలి. బలం ఇవ్వాలి. అది తను తప్ప మరింకెవ్వరూ చెయ్యలేరు.

"లేదు అహల్యా. రాముడికి అపనమ్మకం లేదు. నా రాముడు అందరు మగవాళ్ళవంటివాడు కాదు. ఇది సత్యం. నేను నీకు నిరూపించలేకపోవచ్చు. లోకం ఇది సత్యమని అంగీకరించకపోవచ్చు. కానీ ఇది నాకు సత్యం".

అహల్య ఈ మాట కూడా అన్నది కదూ-

"ఎవరి సత్యం వారిది. సత్యాసత్యాలను నిర్ణయించగల శక్తి ఈ లోకంలో ఎవరికైనా ఉందా?"

అహల్యా-ఎందుకీ మాటలు మాట్లాడావు? నీ మాటలు నాకిప్పుడు ఒక రకంగా అర్థమవుతున్నాయి. అది సరైన అర్థమేనా? చెప్పేవారెవరు?



సీత తలబద్దలవబోతుంటే పట్టుకున్నట్టు తలను గట్టిగా పట్టుకుంది.

ఆ ఆలోచనలు తర్వాత. ముందు రాముడిని చూడాలి. తను ధైర్యంగా పరీక్షనెదుర్కోవాలి.

సీత లేచి నిలబడింది. పమిట కొంగుతో ముఖం శుభ్రంగా తుడుచుకుంది.

"పద లక్ష్మణా. మీ అన్నగారి దగ్గరకు వెళ్దాం. ఆ పరీక్ష ఏమిటో చూస్తాను".

సీత నోటి నుండి బలంగా, ధైర్యంగా, ఒక విశ్వాసపూరిత నిర్ణయంలా వెలువడిన ఆ మాటలు విని లక్ష్మణుడు ఆశ్చర్యంగా తల ఎత్తాడు.

సీత భూపుత్రి అని అతనికెవరో చెవిలో చెప్పినట్లనిపించింది.

★★★

అయోధ్యకి వచ్చిన తర్వాత కూడా సీత అహల్యను మర్చిపోలేకపోతున్నది. అంతఃపురంలో అడుగుపెట్టినప్పుడే సంకోచం. అత్తగార్లు ముగ్గురిలో ఎవరు ఈ శీలపరీక్ష గురించి ప్రస్తావించినా తను భరించగలదా?

కౌసల్య సీతను హృదయానికి హత్తుకుని "నా కోడలు శీలవతి"అని కన్నీరు కారుస్తుంటే సీత హృదయంలో ఏదో గట్టిదనం, ఇనుపతనం ప్రవేశించినట్ల యింది. తన కోడలు శీలవతా కాదా అన్న సందేహం వచ్చి శీలవతి అని నిర్ధారించుకుందా! ఆమె అహల్య గురించి కూడా అలాగే అనుకుంది.

"నీ మనస్సుకు ఏది శాంతినిస్తుందో అదే సత్యం సీతా" అన్నది అహల్య. అత్తగారు అలాగే అనుకుందా లేక తనను నమ్మిందా?

ఇవి జవాబు లేని ప్రశ్నలు. ఎవరినీ అడగలేదు. ఈ విషయం తనతో ఎవరూ నేరుగా మాట్లాడరు. రాముడు ఏమీ జరగనట్లే ప్రవర్తిస్తున్నాడు. అతని ప్రేమల్లో ఏమీ తేడా లేదు. ముందున్న అనురాగమే. అహల్య తన గురించి ఏమనుకుంటుంది. నవ్వుతుందా? "ఎన్నడూ విచారణకు అంగీకరించకు సీతా" అన్నదామె. తను అంగీకరించింది. అది తన కోసం కాదు. రాముని కోసం అంటే అహల్య నమ్ముతుందా? అర్థం చేసుకోగలుగుతుందా? ఆమె జ్ఞాని. తప్పకుండా అర్థం చేసుకుంటుంది. సీతకు అహల్యను కలవాలనే కోరిక రోజురోజుకూ పెరిగిపోతోంది.

ఈ విషయం గురించి అహల్యతో మాట్లాడగలిగినట్లు తను ఎవరితోనూ మాట్లాడలేదు. మాట్లాడకపోతే తన మనసు మరింత బండగా మారడం మానదు.

సీత గర్భవతి అని తెలిసి అంతఃపురమంతా వేడుకలు చేసుకుంటున్న రోజున కూడా సీత అహల్యనే తల్చుకుంటూ గడిపింది.

"గర్భవతులకు ఏవేవో కోరికలుంటాయట. వాటిని తీర్చాలట. అమ్మ నీ మనసులోని కోరిక కనుక్కోమని మరీ మరీ చెప్పింది సీతా".

రాముడికి తన మనసులో కోర్కె అహల్యను కలిసి మాట్లాడాలనే కోరిక చెప్పాలనిపించి నిగ్రహించుకుంది సీత. రాముడు బాధపడతాడు. అతనికి ఇష్టం ఉండదు. కానీ ఈ కోరిక తీరకుండా ఉండటం, తన మనసుకీ, ఆ మనసు ప్రభావం పడబోయే తన గర్భస్థ శిశువుకీ మంచిది కాదు.

"నాకు అరణ్య విహారం మీద మనసు పోతోంది రామా. మనిద్దరం కలిసి చూసిన ఆ మున్యాశ్రమాలు, ఆ నదీ తీరాలు, ఆ అడవుల అందాలూ మళ్ళీ ఒకసారి చూడాలనివుంది".

"అలాగే. అదేమంత పెద్ద కోరిక.తప్పకుండా వెళ్దాం.

సీతకు చెప్పలేని ఉద్వేగం. అంతలోనే భయం. ఎందుకు తనీ పని తలపెట్టింది? అహల్యతో మాట్లాడితే తన అశాంతి పెరుగుతుందే గాని తగ్గదు. కావాలని కొని తెచ్చుకుంటుందా? లేదు. ఇప్పుడు తనకు అహల్య మాటలకు చికాకుపడకుండా ఉండగల అనుభవం వచ్చింది. ఎలాంటి అనుభవం! ఆమె లోతైన అర్థంతో మాట్లాడే మాటలు విని ఆలోచిస్తే గాని తన మనసుకు పరిపూర్ణమైన శాంతి దొరకదు. తన మనసుని ప్రశాంతపరచగల శక్తి ఒక్క అహల్యకే ఉంది.

రాముడితో కలిసి వెళ్ళినా ఏదో ఒక సమయంలో తనొక్కతే వెళ్ళి అహల్యను కలుసుకుంటుంది.

సీత మనసులో క్రమంగా సంతోషం నిండింది. తనకు ప్రియమైన స్నేహితురాలిని కలుసుకోబోతున్నట్లు కుతూహలంతో, ఆనందంతో వికసించిన సీత ముఖం చూసి రాముడూ ఆనందించాడు.

అరణ్య సందర్శనంతో అంతా మామూలవుతుంది. సీత లంక నుండి కాక అరణ్యం నుంచి అయోధ్యకు తిరిగివస్తే ఎంతో బాగుండేది. అలా జరగలేదు. మళ్ళీ ఇప్పుడా అవకాశం వచ్చింది. అరణ్యం నుంచి వచ్చిన సీత తనకు సుపుత్రుడినీ ఇస్తుంది. దాంతో అంతా మారిపోతుంది. సీతకూ తనకూ మధ్య ఏర్పడిన సన్నని తెర తొలగిపోతుంది.

రాముడు ఆ రాత్రి అరణ్యవాసంలో సీత సరసన నిద్రించినంత నిశ్చింతగా నిద్రించాడు.

★★★

రాముడు తనతో పాటు అరణ్య సందర్శనానికి రావడం లేదని తెలిసి సీతకు మరింత నిశ్చింతగా అనిపించింది. అహల్యతో ఎంతసేపైనా గడపవచ్చు. మనసునంతా కడిగేసుకోవచ్చు.

ఆనందంగా రథం ఎక్కుతున్న సీత లక్ష్మణుని ముఖం చూసి ఆశ్చర్యపోయింది.

"లక్ష్మణుడు మాట్లాడకుండా రథం ఎక్కి గుర్రాలను అదిలించాడు. సీత తను వెళ్లాలనుకున్న జలపాత ప్రాంతపు గుర్తులు చెప్పింది. లక్ష్మణుడు ఇంకా చాలాముందే, అరణ్యం దట్టం కాకముందే రథం అపాడు.

★★★

నిండు గర్భవతి సీతను వాల్మీకి ఆదేశంతో ఆశ్రమ వాసులంతా అపురూపంగా చూస్తున్నారు.

సీత ఘనీభవించిన గంగానదిలా ఉంది. వాల్మీకి సీతను చూసి ఆలోచిస్తున్నాడు.

ఏం చేస్తే ఈమె ప్రశాంతంగా ప్రసవానికి సిద్ధమవుతుంది.

సీతనే అడిగాడు. "నీకు కావలసిందేమైనా ఉంటే సందేహించకుండా చెప్పు తల్లీ" అని.

"నాకు అహల్యను చూడాలనివుంది." సీత సూటిగా వాల్మీకి ముఖం చూస్తూ అడిగింది.

వాల్మీకి క్షణం నివ్వెరపోయి తేరుకుని "అలాగే చూద్దువుగాని సీతా" ఆమె నీకు శాంతినివ్వగల సమర్థురాలే. కబురు పంపుతాను". అన్నాడు.

"బాగున్నావా సీతా" పక్కనే కూర్చుని

చేతులు పట్టుకుని ప్రేమగా అడిగింది అహల్య. సీత అహల్య ఒడిలో తలపెట్టుకుని వెక్కివెక్కి యేడ్చింది.

"ఊరుకోమ్మా. అంత దుఃఖం ఈ సమయంలో కూడదు'' సీత వీపు నిమురుతున్న అహల్య కళ్ళల్లో సన్నటి నీటిపొర. సీత తనివితీరా యేడ్చి "ఇప్పుడు నా మనసు హాయిగా ఉందక్కా. రావణ సంహారం జరిగినప్పటి నుంచీ నా మనసు క్రమంగా గడ్డకట్టింది. నిన్ను చూడగానే, నీ స్నేహ స్పర్శలో అది కరిగిపోయింది. ఇప్పుడు మళ్ళీ నా మనసు పూర్వంలా మెత్తగా ఉంది" అంది.

చాలాసేపు ఇద్దరూ మౌనంగానే మాట్లాడుకున్నారు.

సత్యాసత్యాల గురించి నీ మాటల అర్థం ఇప్పుడు తెలిసిందక్కా".

"జ్ఞాన సంపాదనకు అనుభవాన్ని మించిన మార్గం మరొకటి లేదమ్మా".

" నేను విచారణకు సిద్ధమయింది కేవలం రాముని కోసమే. నాకోసం కాదు".

" అది నాకు తెలియదా?"

"కానీ మళ్ళీ -ఇది ఎప్పటికీ ఇలా వెంటాడుతుందా?"

'రాముని కోసం కాక నీకోసం నువ్వు నిర్ణయాలు తీసుకునేవరకూ ఇది నిన్ను వెంటాడుతూనే ఉంటుంది సీతా. నువ్వున్నావు. బాధ అనుభవిస్తున్నావు. ఎవరి కోసమో అనుభవిస్తున్నాని అనుకుంటున్నావు. ఎవరి కోసమో కర్తవ్యాన్ని పాలించావని అనుకుంటున్నావు. నీ ధైర్యం, మనో నిబ్బరం అన్నీ పూర్తిగా ఇతరులకిచ్చావు. నీ కోసం ఏం మిగుల్చుకున్నావు?"

"నేనంటే ఏమిటక్కా? నేనెవరిని?"

నవ్వింది అహల్య.

"మహా మహా మునులు. వేదాంతులు ఈ ప్రశ్నకు సమాధానం వెదకడంలో జీవితాలకు జీవితాలే గడిపేస్తున్నారు. నువ్వంటే నువ్వే. శ్రీరాముని భార్యవు మాత్రమే కాదు. అంతకు మించినది, అసలైనది నీలో ఉంది. అదేమిటో తెలుసుకోవాలని స్త్రీలకెవరూ చెప్పరు. పురుషుల అహం ఆస్తులలో, ప్రతాపాలలో, విద్యలో, కులగోత్రాలలో ఉంటే స్త్రీల అహం పాతివ్రత్యంలో ఉంటుంది. ఆ అహంకారాన్ని దాటాలని స్త్రీలకెవ్వరూ చెప్పరు. విశాల ప్రపంచంలో తాము భాగమని వారు గుర్తించరు. ఒక వ్యక్తికి, ఒక ఇంటికి, ఒక వంశ గౌరవానికి

**అహాన్ని జయించడం పురుషులకు ఆధ్యాత్మిక గమ్యమవుతుంది. అహాన్ని పెంచుకోవడం, ఆ అహంలోనే కాలి బూడిదై పోవడం స్త్రీల గమ్యమవుతుంది. సీతా-నువ్వెవరో, నీ జీవితగమ్యమేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించు. అది అంత తేలిక కాదు. కానీ ప్రయత్నం ఆపకు. చివరకు తెలుసుకుంటావు నీకా శక్తి ఉంది.**

పరిమితమవుతారు. అహాన్ని జయించడం పురుషులకు ఆధ్యాత్మిక గమ్యమవుతుంది. అహాన్ని పెంచుకోవడం, ఆ అహంలోనే కాలి బూడిదై పోవడం స్త్రీల గమ్యమవుతుంది. సీతా-నువ్వెవరో, నీ జీవితగమ్యమేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించు. అది అంత తేలిక కాదు. కానీ ప్రయత్నం ఆపకు. చివరకు తెలుసుకుంటావు నీకా శక్తి ఉంది. శ్రీరామచంద్రుడిని కాపాడగలిగినదానివి నిన్ను నువ్వు కాపాడుకోలేవా-ఇదంతా ఎందుకు జరిగిందని విచారించకు. ఇది నీ మంచికోసమే. నిన్ను నువ్వు తెలుసుకునే క్రమంలో భాగంగానే జరిగింది. ఆనందంగా ఉండు. ఈ ప్రకృతిని గమనించు. అరణ్యంలో ఆశ్రమాలే కాదు. అనేక జాతుల ప్రజలున్నారు. వాళ్ళ జీవితాలు గమనించు. ఈ మొత్తం ప్రపంచంలో నువ్వున్నావు. ఒక్క రామునికే కాదు".

అహల్య మాటలు మృణ్మయ నాదంలా ధ్వనిస్తుంటే సీత శ్రద్ధగా వింటోంది.

"నీకు మాతృత్వం అనుభవమవబోతోంది. దానిని కూడా ఆనందించు. ఏ కోరికలూ, ఆశలూ పెంచుకోకుండా లేడి పిల్లలను పెంచినట్లు నీ పిల్లలను పెంచు".

సీతకు లోపలెక్కడో అణిగివున్న మాతృత్వ భావన పెల్లుబికింది. అప్రయత్నంగా ఆమె చేతులు ఆమె గర్భాన్ని తాకాయి. ఆమె కళ్ళల్లో ప్రేమ కాంతి నిండి అవి జీవంతో తొణికిసలాడాయి.

మరునాడు ఉదయం అహల్య ప్రయాణమైంది.

సీత ముఖంలో కాంతి చూసి వాల్మీకి నిశ్చింతుడయ్యాడు.

అహల్యను ఆలింగనం చేసుకుంది సీత.

"సీతా! నా విషయంలో సత్యమేమిటో చెప్పమంటావా" అడిగింది అహల్య.

"వద్దక్కా! యేదైనా ఒక్కటే. దానికే అర్థమూ లేదు".

అహల్యను సగౌరవంగా సాగనంపింది సీత.

★★★

రాముడు పుత్రులను అక్కున చేర్చుకున్న ఆనందంతో మైమరచిపోయాడు.

పుత్రులను వారసులుగా అంగీకరించిన రాజనీ కంఠానికి పసుపుతాడనే
ఉరితాడును బిగియించి
పెద్దల నిర్ణయాలకీ నిబ్యం సీతను తన పట్టమహిషిగా అంగీకరించదా? ఇక ఆ తర్వాత తనెవరినీ లెక్కచెయ్యడు.

అయోధ్యకు రమ్మని సీతకు కబురు పంపాడు.

ఆ కబురు విన్న సీతకు ఎలాంటి ఉద్వేగమూ లేదు. గత పన్నెండేళ్ళుగా ఆమె ముఖంలో పెరుగుతున్న ఆనందపు వెలుగు అణుమాత్రం తగ్గలేదు.

చిరునవ్వుతో రాముని అభ్యర్థనను తిరస్కరించింది.

"నీ పిల్లలను వదిలి నువ్వుండగలవా సీతా'' మరో కబురు అయోధ్య నుండి ఆశ్రమానికి వచ్చింది.

సీత ఈ అస్త్రంతో పరాజితురాలవుతుందనుకున్నాడు రాముడు.

"ఆ పిల్లలు నా పిల్లలు మాత్రమే కాదు రామా? ఈ విశ్వంలోని అనంత ప్రాణశక్తికి ప్రతీకలు. వారి విశ్వానికంతా చెందినవారని నేను తెలుసుకున్నాను. వాళ్ళూ, మీరూ, వాళ్ళు అయోధ్యకు చెందినవారనీ, సూర్యవంశానికి వారసులమనీ నమ్ముతున్నారు. మీ నమ్మకం ప్రకారం మీరు నడుచుకోండి".

"మరి నువ్వేమవుతావు సీతా-భర్తా, పిల్లలూ లేక"-

"నేను భూపుత్రిని రామా! నన్ను నేను తెలుసుకున్నాను. ఈ విశ్వమంతా నాదే. నాకు లేనిదేమీ లేదు. నేను భూపుత్రిని".

గంభీరంగా, స్థిరంగా పలికిన ఆ వాక్కులకు నిరుత్తరుడయ్యాడు రాముడు.

సీత సహాయం లేని రాముడు జీవితంలో మొదటిసారి ఓటమిని రుచి చూశాడు. బయటి నుంచి వచ్చే అధికారానికి లొంగని సీత, తన లోపల తన మీద తనకున్న అధికారపు శక్తిని మొదటిసారి సంపూర్ణంగా అనుభవించింది. ★

# సంఘ సంస్కర్తలు

## (ఏప్రియల్ 16 వీరేశలింగం గారి జయంతి సందర్భంగా)



వీరేశలింగం చేపట్టిన సంస్కరణలలో స్త్రీ జనోద్ధరణ ముఖ్యమైంది. వాస్తవానికి 19వ శతాబ్దంలో భారతదేశంలోని సంస్కరణోద్యమాల్లో కూడా ఈ అంశవే ప్రథమస్థానాన్ని ఆక్రమించుకున్నది. దీనిక్కారణం స్త్రీలు అనేక శతాబ్దాల నుండి సాంఘిక వివక్షకు గురవుతూ వచ్చారు. తీవ్ర అణచివేతకు గురై ఏ హక్కులూ లేకుండా దాన్యంలో మగ్గుతున్నారు. చరిత్రలో ఒకప్పుడు బలంగా ఉన్న మాతృస్వామిక వ్యవస్థలో తప్ప వీరికి సొంత వ్యక్తిత్వము, ఆత్మగౌరవము ఉండడానికి అవసరమైన ఆస్తిహక్కులు లేవు. స్త్రీలను పట్టి పీడించిన అంశాలలో ముఖ్యమైనవి: 1. బాల్యవివాహాలు. 2. నిర్బంధ వైధవ్యం. 3.బహుభార్యాత్వం. 4. అవిద్య. 5.సాంఘిక స్వేచ్ఛ లేకపోవడం. అప్పటి స్త్రీల స్థితిగతుల గూర్చి ఒక సమకాలీన రచయిత ఈవిధంగా చిత్రించాడు. " విద్యకు దూరమై, ఇంటి నాలుగు గోడలమధ్య బందీలై, ప్రపంచం ఏమీ చూడకుండా, ప్రపంచం గురించి ఏమీ తెలియకుండా, మూఢవిశ్వాసాలలో మునిగి, ఆచారాల చేత పీడింపబడే మన మహిళలు-చెప్పుకుంటే సిగ్గుచేటు-బానిసలకంటే ఏవిధంగానూ నయం కాదు". స్త్రీ జనోద్ధరణతోపాటు మిగతా సంస్కరణలకు సంబంధించిన ఉద్యమాలు చేపట్టేముందు వీరేశలింగం వీటిని గూర్చి సమాజంలో ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి ప్రయత్నాలు చేశాడు.

### వివాహ సంస్కరణలు

### బాల్య వివాహాలు-కన్యాశుల్కం

సంఘ సంస్కరణోద్యమాల్లో బాల్య వివాహాలు, కన్యాశుల్కం సమస్యలను సంస్కర్తల దృష్టిని ఆకట్టుకుంటున్నాయి. ఈ రెండు సమస్యలతో పాటు వితంతు పునర్వివాహ సమస్య కూడా సంస్కర్తలు చేపట్టారు. బాల్య వివాహాలు ప్రధానం గా బ్రాహ్మణుల్లో ఉండేవి. అభం, శుభం ఎరుగని వయసులో బాలికలకు పెళ్ళిళ్ళు చేయడం ఏవిధంగానూ హేతుబద్ధం కాదు. దురదృష్టవశాత్తు వీటికి, మతానికి ముడిపెట్టారు. ఎనిమిది ఏళ్ళు నిండకముందే బాలకలకు వివాహం జరపకుంటే, వారి తల్లిదండ్రులు పాపం మూటగట్టుకుంటారని పవిత్ర గ్రంథాలు చెబుతున్నట్టుగా ప్రచారంలో ఉంది. ఈ దురాచారానికి వ్యతిరేకంగా దంపూరు నరసయ్య లాంటి విజ్ఞులు ఒకరిద్దరు రచనలు చేశారు. లెటర్స్ ఆన్ హిందూ మ్యారేజెస్ అనే గ్రంథాన్ని నరసయ్య రాశాడు. బాల్య వివాహాలను నిరసిస్తూ దక్షిణ భారతదేశంలో రాసిన మొదటి గ్రంథమిది. మనుస్మృతితో సహా అనేక స్మృతులు, శాసనాల నుండి నరసయ్య అనేక ఉల్లేఖనలు చేసి, వాటిలోని భావాలకు బాల్య వివాహాలు విరుద్ధమని ప్రకటించాడు. యుక్తవయస్సు వచ్చిన ఆడపిల్లలకు వరుడిని ఎంచుకొనే స్వేచ్ఛ ఉండాలని కూడా నరసయ్య ఈ సందర్భంలో చెప్పాడు.

ధర్మశాస్త్రాలను క్షుణ్ణంగా పరిశీలించి వాటి ఆధారంగా వీరేశలింగం బాల్యవివాహాలు సమర్థనీయం కావన్న నిర్ణయానికి వచ్చాడు. 1884లో ఈ విషయంపై వీరేశలింగం విపులంగా విశ్లేషించాడు. బాల్యవివాహాలు చేసుకున్న బాలికల్లో 80 శాతం మంది వితంతువులవుతున్నారని, ఈ దురాచారాన్ని నివారించడానికి వివాహితులైన పురుషులకు విశ్వవిద్యాలయ పరీక్షలు రాయడానికి కాలపరిమితి విధించి వారిని ఉపకారవేతనాలకు, బహుమతులకు అనర్హులుగా చేయాలన్నది మొదటిది. రెండు, పెళ్ళికాని అభ్యర్థులకు ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాధాన్యత ఇవ్వాలి. "బ్రహ్మ వివాహాలు" అనే ప్రహసనాన్ని వీరేశలింగం రాశాడని ముందే తెలుసుకున్నాం. ఇందులో బాల్య వివాహాల వల్ల ఉత్పన్నమయ్యే కష్టాలను, కన్యాశుల్కం సమస్యను, పెళ్ళికి చేసే దుబారా


బాల్యవివాహాలు చేసుకున్న బాలికల్లో 80 శాతం మంది వితంతువులవుతున్నారని, ఈ దురాచారాన్ని నివారించడానికి వివాహితులైన పురుషులకు విశ్వవిద్యాలయ పరీక్షలు రాయడానికి కాలపరిమితి విధించి వారిని ఉపకారవేతనాలకు, బహుమతులకు అనర్హులుగా చేయాలన్నది మొదటిది. రెండు, పెళ్ళికాని అభ్యర్థులకు ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాధాన్యత ఇవ్వాలి.

ఖర్చును ఎంతో సహజంగా చిత్రించాడు. ఈ సాంఘిక ప్రహసనం పెద్దయ్యగారి పెళ్ళి' (అంటే వృద్ధుడి వివాహం) పెళ్ళిగా ప్రజల్లో ప్రాచుర్యం పొందింది. దీని ప్రభావంతో అప్పుడు వాడుకలో జరుగుతున్న అనేకానేక బాల్య వివాహాల వివరాలను పత్రికలు వెలుగులోకి తెచ్చాయి. ఈ దురాచారం ఎంత హీనస్థితికి దిగజారాయంటే 10 నెలలలోపు వయస్సున్న ఆడపిల్లలకు కూడా పెళ్ళిళ్ళు చేసినట్లు అప్పట్లో 'బుద్ధ విధేయి', 'తెలుగు జనని' పత్రికలు వార్తలుగా రాశాయి. రాజమండ్రి సంఘ సంస్కరణ సమాజం ఈ సమస్యను తలకెత్తుకుని బాలికలను 10 ఏళ్ళు, బాలురకు 14 ఏళ్ళు వయస్సు రాకుండా వివాహాలు చేయరాదన్న చట్టాన్ని తేవడానికి కృషినారంభించింది. అంతేగాక 14 ఏళ్లు బాలికకు, 18 ఏళ్ళు బాలురకు రాకుండా దాంపత్య జీవనం సాగించరాదని కూడా తీర్మానించింది. సంఘ సభ్యులు బాల్య వివాహాల్లో పాల్గొనరాదని ప్రతిజ్ఞ చేశారు. వివాహ వయఃపరిమితిని చట్టబద్ధం చేయాలన్న మలబారీ (మహారాష్ట్ర) ఉద్యమానికి బాసట తెలుపమని మహాదేవ గోవింద రనడే వీరేశలింగానికి దానికి సంబంధించిన పత్రాలు పంపాడు. వాటిని పూర్తిచేసి, సంతకాలు పెట్టి వీరేశలింగం తిరిగి రనడేకు పంపించాడు. ఆంధ్రదేశంలో వీరేశలింగం నిర్వహించిన సమావేశాల్లో సభల్లో ఈ సమస్యపై తీర్మానాలు చేసి ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు.

కన్యాశుల్కం ఆచారం ప్రధానంగా బ్రాహ్మణ, వైశ్యకులాల్లోఉండేది. బాల్య వివాహాల వల్ల వృద్ధులైన భర్తలు చనిపోవడంతో బాలవితంతువులు సమాజంలో అధిక సంఖ్యలో ఉండేవారు. దీనికితోడు వయసు వచ్చిన ఆడపిల్లలకు వివాహం చేయకూడదనే ఆచారం వల్ల కూడా స్త్రీలకు వైధవ్యం ప్రాప్తించేది. పురుషులకు పునర్వివాహం సాధ్యం కావడంతో, వయసు మళ్ళిన పురుషులు తమ తదనంతరం మతకర్మలు చేయడానికి, ఆస్తిపాస్తులు పొందడానికి వారసులు

**కన్యాశుల్కం ఆచారం ప్రధానంగా బ్రాహ్మణ, వైశ్యకులాల్లో ఉండేది. బాల్య వివాహాల వల్ల వృద్ధులైన భర్తలు చనిపోవడంతో బాల వితంతువులు సమాజంలో అధిక సంఖ్యలో ఉండేవారు. దీనికితోడు వయసు వచ్చిన ఆడపిల్లలకు వివాహం చేయకూడదనే ఆచారం వల్ల కూడా స్త్రీలకు వైధవ్యం ప్రాప్తించేది.**

ఉండాలనే కోరికతో పెళ్ళికూతుళ్ళను కొనేవారు. వీరేశలింగం తన ఉపన్యాసాల్లో, రచనల్లో ఈ దురాచారాన్ని ఖండించాడు. ధర్మశాస్త్రాల సహాయంతో కన్యాశుల్కం అనుసరణీయం కాదని చెప్పాడు. డబ్బుతో కొన్న వధువు దాసి అవుతుంది గానీ, భార్య ఎన్నటికీ కాలేదని మనుధర్మశాస్త్రం చెప్తున్నదని వీరేశలింగం రాశాడు. మతకర్మలతో పితృ దేవతలను పూజించే ఆచారానికి డబ్బుతో కొన్న స్త్రీలు అనర్హులని చెప్పాడు. సమాజంలో అగ్రభాగాన బ్రాహ్మణులు ఈ దుర్మార్గపు దురాచారాన్ని మానుకోవాలన్నాడు.

వీరేశలింగం నాయకత్వంలో రాజమండ్రి సంఘసంస్కరణ సమాజం ఈ దురాచారాన్ని మానుకోవాలని ప్రచారం చేపట్టింది. దానిని నిషేధిస్తూ చట్టం చేయాలని తీర్మానం చేసింది. కన్యాశుల్కం వ్యతిరేకోద్యమం ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలకు వ్యాపించింది. విజయనగరం మహారాజా ఈ సమస్యను 1888లో మద్రాసు శాసనసభలో ప్రస్తావించారు. అయినా ప్రభుత్వం దాన్ని చట్టపరంగా నిషేధించేందుకు సమ్మతించలేదు. అయినా ఈ సందర్భంలో గురజాడ తన నాటకంలో ఈ సమస్యను గూర్చి సజీవచిత్రణ చేశాడు. ఆవిధంగా వీరేశలింగం గారు స్త్రీ జనోద్ధరణకు బహుముఖాలుగా కృషి చేశారు. ●

**7వ పేజీ తరువాయి...**

చెయ్యడానికి ముందు వివాహానంతర ఆర్జిత ఆస్థిలో స్త్రీలకు సమాన భాగం కల్పించే చట్టం తీసుకురావలసి ఉంటుంది. ఈ చట్టంలో భార్యా భర్తలు విడిపోతే భార్యకు ఆస్థిలో సమాన భాగస్వామ్యం అనివార్యం అని పొందుపరచాలి. దాంతోపాటే పిల్లలు కూడా వీరితో ఉంటే వారికి నివాసం/ఇల్లు పొందే వీలుకూడా ఉండేలా నిర్దేశించాలి. అలాగే స్త్రీలు పిల్లలకు లభించవలసిన భాగాలకు సంబంధించిన చట్టాలలో కూడా వారు తగినంత భరణం పొందేలా బలోపేతం చెయ్యాలి. భర్త ఆదాయాన్ని వెల్లడించేందుకు ప్రత్యేక చట్టంతోపాటు ఆ ఆదాయానికి సంబంధించిన రుజువులు చూపాల్సిన బాధ్యతకూడా భర్తపైనే ఉండాలనే సూచనలుకూడా పరిగణలోకి తీసుకోవాలి. కోర్టు, న్యాయమూర్తుల విచక్షణకు వదిలేస్తున్న అనేకానేక అంశాలను పరిమితం చేసి స్త్రీలకు పిల్లలకు తప్పనిసరిగా తగినంత భరణం లభించేవిధంగా ఎక్కువ భాగం కోర్టు తీర్పులు ఉండేలాగా చూడాలి.

దాంతో పాటే భరణంగా లభించే రొఖ్ఖం తప్పనిసరిగా చెల్లించేలాగా ఆ మొత్తాన్ని వసూలు చేసేలాగా ప్రభుత్వం చట్టాన్ని సవరణ చేయాలి. ఇది కాకుండా స్త్రీలకు, పిల్లలకు విడాకులు కోరుతూ రిట్ వేసిన వెంటనే వారి అవసరాలు తీర్చే విధంగా ఒక నిధిని కూడా ఏర్పాటు చేయాలి. అనేక దేశాలలో ఈ భరణం రొఖాన్ని వసూలు చేసేందుకు రకరకాల చట్ట వ్యవస్థలు విడివిడిగా ఏర్పాటు చేశారు. ఇలాంటి కేసులలో స్త్రీలు ,పిల్లలు వాళ్ళని వాళ్ళు కాపాడుకుని పోషించుకోవాలనే పరిస్థితికి పోకుండా చూసే బాధ్యత ప్రభుత్వానిదే. ★

# ఫత్వా, తల్లాక్‌లలో తబ్దీలీలు (మార్పులు)

-వేములపల్లి సత్యవతి

భారతదేశంలోని ముస్లింలకు హిందూకోడ్ బిల్లు వర్తించదు. వారికి ప్రత్యేకంగా 'ముస్లిం పర్సనల్ లా బోర్డు' ఉంటుంది. ఆ బోర్డులో ఉండే సభ్యులు కరుడుగట్టిన మత పెద్దలు. వారి నిర్ణయాలనే ఇస్లాం మతస్తులు శిరసావహించాలి. ఇస్లాంను విమర్శించినా లేక మత కట్టుబాట్లను జవదాటినా ఫత్వా జారీ చేస్తారు. ఫత్వా అంటే ముస్లిం మత గురువులు జారీ చేసిన ఆజ్ఞలు. వాటిని జవదాటవీలులేదు. లోగడ ఇరాన్ అధ్యక్షుడు కీ.శే. అయతుల్లా ఖొమేనీ రచయిత సల్మాన్ రష్దీపై ఫత్వా జారీ చేశాడు. రష్దీ తలనరికి తెచ్చిన వారికి లక్షల అమెరికన్ డాలర్లు బహుమతిగా లబిస్తుందని ప్రకటించాడు. అలాగే బంగ్లాదేశ్ రచయిత్రి తస్లీమా నస్రీన్‌పై ఆ దేశ మతగురువులు బంగ్లాలో అడుగు పెట్టడానికి వీలులేదని ఫత్వా జారీ చేశారు. ఆమె ఎక్కడా స్థిరంగా ఉండ వీలులేక దేశాలు తిరుగుతూ అజ్ఞాత జీవితం గడుపుతూ ఉంది. మన దేశంలో కూడా 'షాబానో' కేసు సుప్రీంకోర్టు ఆమెకు అనుకూలంగా తీర్పుచెప్పింది. కాని కరుడు కట్టిన మత గురువుల మాటకు తలవొగ్గి అప్పటి మన దేశ ప్రధాని కీ.శే. రాజీవ్‌గాంధీ సుప్రీంకోర్టు తీర్పును అమలు చేయలేక నీరుగార్చారు.

ఆఫ్ఘనిస్థాన్ దేశీయుడైన షఫియా కెనడాలో వ్యాపారం చేనస్తా అక్కడే స్థిరపడ్డాడు. షఫియా అతని రెండవ భార్య. టూబా, హమీద్‌లు కలిసి రెండవ భార్యకు జన్మించిన ముగ్గురు అమ్మాయిలను హతమార్చారు. ఆ పిల్లలు తమ కుటుంబ పరువు ప్రతిష్టలను బజారుకీడ్చారన్న నెపంతో వారిని చంపివేశారు. వారితోపాటు షఫియా మొదటి భార్యను కూడా చంపేశారు. ఒకేరోజు ఒకే కుటుంబంలోని నలుగురు హత్యగావటం కెనడాలో సంచలనం సృష్టించింది. వారిపై

> తల్లాక్ వాక్ బాణాలతో విలవిలలాడే ముస్లిం మహిళలకు తల్లాక్‌ను నిషేధించాలన్న నిర్ణయం మహిళల జీవితాలలో ఎంతో మార్పు వస్తుందనటంలో సందేహం లేదు.

హత్యానేరం మోపబడింది. కెనడా కోర్టువారిని దోషులుగా తీర్పుచెప్పింది. కోర్టు తీర్పు వెలువడిన తర్వాత 'ఇస్లామిక్ సుప్రీం కౌన్సిల్ ఆఫ్ కెనడా' (ముస్లిం ఇమాంలు, మత గురువులు) పరువు హత్యలు తప్పని ఫత్వా జారీ చేశారు. ఇస్లాం గృహహింసను, మహిళలను ద్వేషించటం సహించదని,



పరువు హత్యలకు ఇస్లాంలో అసలు తావే లేదని ఫత్వా జారీ చేశారు. వారితోపాటు అమెరికాకు చెందిన ఇమాంలు (మత గురువులు) కూడా సంతకాలు చేసి ఫత్వా జారీ చేశారు. కెనడాలోని 'కింగ్‌స్టన్‌కోర్టు' ఆ ముగ్గురు హత్య చేసినట్లు తీర్పుచెప్పి ఒక్కొక్కరికి 25 సంవత్సరాలు జైలు శిక్ష విధించింది. దాని తర్వాత ఇమాంలకు కనువిప్పు కలిగింది. షఫియా కేసు కారణంగానే ఇలాంటి ఫత్వా జారీ చేయటం జరిగిందని ఐఎన్‌సిసి వ్యవస్థాపకుడు 'ఇమాం సయ్యద్ సోహర్‌వార్డీ' ప్రకటించాడు.

మనదేశంలోని ముస్లిం మేధావి వర్గంలో కూడా షఫియా కేసు తదనంతరం కదలిక జరిగింది. మార్పులు చేయటానికి ముందడుగు వేశారు. 5-2-12న న్యూఢిల్లీలో ఈ మేధావి వర్గం సమావేశమయింది. పర్సనల్ లా చట్టంలోని అనేక విషయాలను క్రోడీకరించాలని నిర్ణయం తీసుకుంది. తల్లాక్ వాక్ బాణాలతో విలవిలలాడే ముస్లిం మహిళలకు తల్లాక్‌ను నిషేధించాలన్న నిర్ణయం మహిళల జీవితాలలో ఎంతో మార్పు వస్తుందనటంలో సందేహం లేదు. ఆ మేధావులు సాహసోపేతమైన నిర్ణయం తీసుకోవటం హర్షించదగిన విషయం. ముస్లింలలో ఉన్న బహు భార్యాత్వాన్ని నియంత్రించటంపై కూడా చర్యలు చేపట్టాలని తలచింది. ఆ మేధావి వర్గం దేశవ్యాప్తంగా పర్యటించారు. అనేకమంది అభిప్రాయాలను సేకరించారు. వారు సంచలనాత్మకమయిన ఒక ముసాయిదాను తయారుచేశారు. 'పర్సనల్ లా'ను క్రోడీకరించి తదనంతరం చట్టంలో సవరణలు, మార్పులు చేయటం కోసం ఆ ముసాయిదాను పార్లమెంటుకు పంపాలనుకున్నారు. సంస్కరణవాదియైన అస్గర్‌అలీ ఇప్పుడు కొత్త చట్టాలను తీసుకురావటంలేదని ముస్లింలకు 'ఖురాన్' కల్పించిన మార్గదర్శకాలనే అమలు చేసేవిధంగా ప్రయత్నాలు చేస్తున్నామని తెల్పారు. ఇక ఇక్కడ మూడుసార్లు తల్లాక్ చెప్పడం చెల్లదని, దానిని ఖచ్చితంగా రూపు మాపాల్సిందేనని ముంబాయ్‌లోని ఇస్లామిక్ స్టడీస్‌కి చెందిన కుతుబ్ జౌహాన్ కిద్వాయ్ స్పష్టం చేశారు. బహుభార్యాత్వాన్ని కొన్ని నిబంధనలకు లోబడి ఉండేలాగ నియంత్రించాలని మేధావుల బృందం అభిప్రాయపడింది. ప్రారంభంలో అసలు ఏక భార్యత్వమే అమలులో ఉండేదని 'జీహాద్' (పవిత్ర) యుద్ధంలో వేలాదిమంది ముస్లిం పురుషులు మరణించారని, వేలాదిమంది మహిళలు దిక్కులేనివారుగా, అనాధలయ్యారని వారికి మరల

జీవితాన్నివ్వటానికి ఒక్కో పురుషుడు నలుగురు మహిళలను వివాహమాడవచ్చని ఇస్లాం అనుమతిచ్చిందని, అప్పటి నుంచి బహు భార్యత్వం కొనసాగుతున్నదని చెప్పారు. అయితే ఆ నలుగురిని పోషించగల ఆర్థిక స్థోమత కలిగివున్నవారే ఆలాంటి వివాహానికి అర్హులని, వారికే నల్గురిని వివాహమాడే హక్కు వర్తిస్తుందని" కేరళ హైకోర్టు రిటైర్డ్ జడ్జ్ జస్టిస్ షంషుద్దీన్ తెల్పారు. దీనికోసం మొదట 'నిఖానామా'లు రిజిష్టరు చేయించటానికి ప్రత్యేకంగా నిఖా రిజిష్టరులను ఏర్పాటు చేయాలని సూచించారు. ఇదేగాక వివాహ వయసును కూడా పరిగణనలోనికి తీసుకోవాలన్నారు. యువతులకు 18 సంవత్సరాలు, యువకులకు 21 సంవత్సరాలుగా వివాహ వయసు నిర్ణయించాలని ముసాయిదాలో పేర్కొన్నారు. ఇవన్నీ అమలులోకి వస్తే ముస్లిం మహిళల జీవితాలలో అనూహ్యమయిన మార్పు వస్తుందనటంలో సందేహం లేదు.

మతపరమైన ఘోషా, పరదాచాటున పడి ఉండాలన్న కట్టుబాట్లలో ఉన్న మహిళలు మనో నిబ్బరంతో గడపదాటి,అద్భుతమైన ఘనకార్యాలు సాధించారు. నవంబర్ 18, 1911వ సంవత్సరం, శుక్రవారం అసోంలోని ఆజాన్‌పీర్‌దర్గాలో ఓ అద్భుతమైన ఘటన జరిగింది. 20 మంది ముస్లిం మహిళలు దర్గాలో ప్రవేశించి ప్రార్థన చేశారు. ముస్లిం మహిళలకు దర్గాలలోనికి, మసీదులలోనికి ప్రవేశం నిషిద్ధం. ఆ రాష్ట్ర గవర్నర్ సతీమణి జయంతి పట్నాయక్ వారికి బాసటగా నిలిచింది. ఆమె వారితోపాటు దర్గాలో ప్రవేశించి ప్రార్థన చేశారు. గవర్నర్ పట్నాయక్ ముస్లిం సోదరులతో కలిసి దర్గా బయట ప్రార్థనలో పాల్గొన్నారు. నేడు ముస్లిం యువతులు, మహిళలు అనేకరంగాలలో అప్రతిహతంగా ముందుకు దూసుకుపోతున్నారు. అలాంటి సమయంలో వారికి దర్గాలలోనికి, మసీదులలోనికి ప్రవేశం లేకుండా దూరంగా ఉంచటం న్యాయం కాదని చొరవ చూపి ఆ రాష్ట్ర గవర్నర్ దంపతులు ముస్లిం సోదరులకు నచ్చచెప్పి అలా చేయటం

**సౌదీలో ఇస్లాం పేరిట విధించే దండనలు చాలా దారుణంగా, భయానకంగా ఉంటాయి. దొంగతనం నేరం రుజువయితే అతని చేతులను(ముంజేతులను) ఖండించివేస్తారు. మరికొన్ని నేరాలకు పబ్లిక్‌గా కొరడా దెబ్బల శిక్ష ఉంటుంది. ఆ దెబ్బలు వందలలో ఉంటాయి. ఏ మహిళైనా అక్రమ సంబంధం కలిగి వున్నదని రుజువయితే పబ్లిక్‌గా ఆమెను రాళ్ళతో కొట్టి చంపే శిక్ష వేస్తారు. పురుషునికి మాత్రం ఏ శిక్షా ఉండదు. ఈ వివక్షత అన్ని మతాలలోను కులాలలోను దర్శనమవుతూనే ఉంటుంది.**

హర్షించదగిన విషయం. మత సామరస్యానికి ఇలాంటి కార్యక్రమాలు సోపానాలుగా ఉపయోగపడతాయి. విద్యావంతులయిన ముస్లిం మహిళలు మహిళా సంఘాలను ఏర్పాటు చేసుకుని మసీదు, దర్గాలలోనికి ప్రవేశానికి పోరాడుతున్నారు. ఈవేళ కాకపోతే మరికొంత కాలానికైనా వారు విజయం సాధిస్తారు.

సౌదీ అరేబియా గల్ఫ్‌లోని ముస్లిం రాజ్యాలలో తలమానికమైనది. అన్నీ మతప్రాతిపదికన ఏర్పడిన రాజ్యాలే. రాజు లేక దేశాధ్యక్షుడు సర్వాధికారి. సౌదీలో ఇస్లాం పేరిట విధించే దండనలు చాలా దారుణంగా, భయానకంగా ఉంటాయి. దొంగతనం నేరం రుజువయితే అతని చేతులను(ముంజేతులను) ఖండించివేస్తారు. మరికొన్ని నేరాలకు పబ్లిక్‌గా కొరడా దెబ్బల శిక్ష ఉంటుంది. ఆ దెబ్బలు వందలలో ఉంటాయి. ఏ మహిళైనా అక్రమ సంబంధం కలిగి వున్నదని రుజువయితే పబ్లిక్‌గా ఆమెను రాళ్ళతో కొట్టి చంపే శిక్ష వేస్తారు. పురుషునికి మాత్రం ఏ శిక్షా ఉండదు. ఈ వివక్షత అన్ని మతాలలోను కులాలలోను దర్శనమవుతూనే ఉంటుంది. కొన్నాళ్ళ క్రితమే సౌదీ రాజు ఆ దేశపు మహిళలకు ఓటుహక్కును ప్రకటించాడు. ప్రపంచంలోని అత్యంత విలువగల లగ్జరీ కార్లన్నీ సౌదీ అరేబియాలో కన్పిస్తాయి. అక్కడ స్థానికులయిన వారికి కారు కొనటం పెద్ద కష్టం కాదు. మనకయితే కూరగాయలు కొనటమే రోజు రోజుకీ గగనమయిపోతున్నది. సౌదీలో పెట్రోల్ కారుచౌక. కాని అక్కడ మహిళలు కారు నడపకూడదు. అక్కడి చట్టం అంగీకరించదు. కాని అక్కడి మహిళలు చరిత్రను సృష్టించే కార్యం చేశారు.

2011 జూన్ 17న సౌదీ అరేబియాలో వందల కొలది ముస్లిం మహిళలు కార్లు నడుపుకుంటూ రోడ్లపైకొచ్చారు. కార్లు నడుపుకోవటానికి లైసెన్స్‌లివ్వాలని ఆందోళనకు దిగారు. అలా కార్లు నడుపుతూ రోడ్ల మీదకు వస్తే ఎలాంటి ఫలితాలను రుచిచూడవలసి వస్తుందో వారికి బాగా తెలుసు. సౌదీ ప్రభుత్వపు ఈ విధానం వల్ల ఉద్యోగినులయిన మహిళలు సమయానికి ఆఫీసులకెళ్ళడానికి పురుషులమీద ఆధారపడవలసి వస్తుంది. ఇంటి పనులను సకాలంలో చేసుకోవటంలోను, పిల్లలను బడులకు పంపే విషయంలోను వారు ఎన్నో ఇబ్బందులకు గురవుతున్నారు. స్వయంగా చేసుకోగలిగిన పనులను కూడా చేసుకోవటానికి వీలుకాకుండా ఉంది. అందుకే అన్నిటికి సిద్ధమై రోడ్డున పడ్డారు.

ఒకసారి జెడ్డాలో వరదలొచ్చి ఇండ్లలోనికి నీరు వచ్చింది. ఒక మహిళ కారులో తన కుటుంబం వారిని సురక్షిత స్థానానికి చేర్చి అందరి ప్రాణాలు కాపాడింది. ఆ వార్త పత్రికలలో విశిష్టమైనదిగా పతాక శీర్షికలకెక్కింది. అది చదివి సౌదీ అరేబియా ముస్లిం మహిళ ఒకామె ప్రభావితురాలై లెబనాన్ వెళ్ళి కారు డ్రైవింగ్ నేర్చుకొని వచ్చింది. లెబనాన్ కూడా ముస్లిం దేశమే. కాని అక్కడ మహిళలు కారు నడపరాదన్న నిషేధం లేదు. కారు డ్రైవింగ్ నేర్చుకొచ్చిన మహిళ పేరు 'అరీజ్ అల్‌ఖల్దీ' ఆమె రాత్రి వేళల్లో తాను కారు నడుపుతున్న దృశ్యాలను ఇంటర్‌నెట్‌లో పెట్టింది. అది చూసి మరికొంతమంది మహిళలు స్ఫూర్తి పొందాలన్నది ఆమె ఆకాంక్ష. ఆమె ఆకాంక్ష ఆటంకాలు లేకుండా నెరవేరాలని, మహిళలందరికీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బ్రతికే హక్కు రావాలని మనమందరం కోరుకుందాం. ●

- డా॥ప్రసాదమూర్తి

# చెల్లికోసం

అటునుండి ఒబామా వచ్చాడు
ఇటునుంచి చెల్లి అమెరికా వెళ్ళింది
అగ్రరాజ్యాధినేత రాకకంటె
నా చెల్లాయి అమెరికా యాత్రే
నన్ను ఆనందపరిచింది..
అందరిలాంటి చెల్లి కాదు మరి
దురదృష్టాన్ని...పిరికితనాన్ని
కన్నీళ్ళన్నీ....కష్టాలనీ
ఖండఖండాలుగా నరికిన చెల్లి
ఇప్పుడు ఖండాలు దాటి వెళ్ళింది..
పరికిణీల వయసప్పుడే కన్నీళ్ళ కడలిని
కనురెప్పల మధ్య బంధించటం నేర్చిన చెల్లి
ఇప్పుడు సముద్రాలను సునాయాసంగా
లంఘించింది.

ఆనందించాల్సిన వయసులో
విషాదం..
సుఖపడాల్సిన వయసులో దుః
ఖం
ఈదేశం సగటు ఆడపిల్ల అసలు
ఆస్తులు కదా
చెల్లిదీ అదే వారసత్వం..
కాని చెల్లి సగటు ఆడపిల్లేకాదు...
విధిరాతనీ...పెద్దల దుష్టనీతినీ
లక్ష చేతులతో ఎదుర్కొన్న సాహసాల మల్లి

అన్నట్టు
చెల్లి విమానం ఎక్కింది కదా..
అన్నయ్యా
ఫ్లయిట్ పారిస్‌లో ల్యాండయ్యిందని
అయిదో తరగతి కూడా చదవని
చెల్లి ఆకాశభాషలో మాట్లాడింది
పుడుతూనే నింగి ఉయ్యాలలూగే వాళ్ళకి
విమానం వింత కాకపోవచ్చు
ఇంకా శరీరం కళ్ళు తెరవక ముందే
కాపురం కత్తిమీద కాలుమోపిన చెల్లికి
మేఘాల మీద నడక గొప్పేమరి..

కాపురం సారా కంపు కొడితే...
సంసారం వీధిన పడితే...
నడిచిన గతమంతా
కన్నీరు కురిసిన జ్ఞాపకాలే అయితే...
చెల్లికి
అంబరాన ఎగరడం సంబరమే కదా!

కింద సముద్రం
దాని మీద మేఘాలు..
వాటిపైన చెల్లి..
అన్నయ్యా
గాల్లో తేలినట్టుందని
చెల్లి సెల్‌ఫోనులో వాయుసంగీతమైంది
చెల్లి గతాన్ని...వర్తమానాన్ని
రెండూ కళ్ళముందు పెట్టుకుని
నవ్వుతూ ఏడ్చాను..
ఆడపిల్లకు చదువెందుకు అనుకున్నారు కాని
చెల్లి చదువుకుని ఉంటే

జీవితంలో హార్డ్‌వేర్‌ని ఆపోసన పట్టినట్టే
సాఫ్ట్‌వేర్‌ని కూడా ఉతికి ఆరేసేదే
మొగ్గలాంటి పిల్ల మెడలో
పుస్తెల తాడే అలంకారమనుకున్నారు కాని...
భుజానికి పుస్తకాల సంచి తగిలిస్తే
ఒక తరం మెడలో స్ఫూర్తి పతకమై
వేలాడేదే...

ఎప్పుడూ కన్నీళ్ళతో తడిసిన
చీరకొంగుతో కనిపించే చెల్లి
నిబ్బరంగా అడుగు ముందుకే వేస్తుంటే...
ఇన్ని డిగ్రీలు ఉండికూడా
చెల్లి ముందు అవిటివాడినే అనుకునేవాణ్ణి
ఏరాత్రివేళో నిద్రల్లో ఉలిక్కిపడినపుడు
చెల్లి ఏం చేసుకుందో అన్న బెంగ
గుండెలమీద బండరాయిలా కూర్చునేది
బాలనే కాని బేలను కాదురా అన్నా అంటూ
వందలమైళ్ళ దూరం పయనించే
శబ్దతరంగమై
నాకు ఉపశమనం కలిగించేది చెల్లి.

పుస్తకాలు తిప్పకపోయినా..
తిప్పలు పెట్టిన నుదిటిరాతను
మొండితనంతో మొట్టికాయలు వేసింది
బతుకంతా ఓడిపోతున్నా..
తనకోసమే దారికాచుకున్న గెలుపుపైనే
గురిపెట్టింది..
నుదుటి సింధూరం
చిత్రవధల జీవితానికి నెత్తుటి
చిత్రపటమైతే...
విదిలించి వదిలించుకోవాల్సిన
మాంగల్యాన్ని మాత్రం
లోకాన్ని ఎదిరించి కాపాడుకున్న
కరుణామయి చెల్లి
యముడితో పోరాడిన సావిత్రికంటె
గొప్పగా కనిపించేది..
పారిపోవడం పరిష్కారం కాదని
సాహసాన్ని వజ్రాయుధంగా ధరించి
కదిలిన
చెల్లి నాకెపుడూ ఝాన్సీరాణిలానే
కనిపించేది
సంస్కారం విజ్ఞానం చదువుతో
వస్తాయనుకునే వాళ్ళు
చెల్లిని చూసి తలదించుకోవాల్సిందే
ఎడ్యుకేషన్ అంటే నేను నా చెల్లినే చూపిస్తాను
చదువుకోలేదని బెంగపడిందో లేదో కాని
ఎన్ని బాధల పర్వతాలు అడ్డొచ్చినా
పగలగొట్టుకుంటూ
చెల్లి తన పిల్లల్ని మాత్రం చదివించింది
అందుకే అమ్మ వస్తుందని
సంతోషం ఊపిరిగా ఊదిన బెలూనై కొడుకు
అమెరికా గుమ్మానికి సంబరాల
తోరణమయ్యాడు..
తూర్పునుంచి పశ్చిమం దాకా
గెలుపు జెండా ఎగరేసుకుంటూ వెళ్ళిన
చెల్లిని చూసి
సాల్ట్‌లేక్ ఎయిర్‌పోర్ట్ సలాం చేసింది
నెట్‌లో మేనల్లుడు పంపిన చెల్లి ఫోటోలు
చూస్తే
ఆడపిల్లల్ని చదివించండ్రా బాబూ అని
లోకానికి చెల్లి చీవాట్లు పెడుతున్నట్టే ఉంది.

" మీ కా.ప పూర్తయిందా బాబాయ్?" అంది మా ఆవిడ.

"కాపా? అదేవిటమ్మాయ్?" బాబాయ్ తెల్లబోయాడు.

" అదే, కార్యాలయం పని. ఇంత పొదుగెందుకని, అలా అడిగా" అంది. మావయ్య ఏం చెప్పాలో తెలీక, తికమకగా చూశాడు. "ఆ, ఆ" అని పేపరులో ముఖం దాచుకున్నాడు.

# తరాణి

- కాళీపట్నం సీతావసంతలక్ష్మి

"మా ఆవిడకి పుట్టుకతోనే ప్రతీ పదాన్నీ తర్జుమా చేసే విద్య వచ్చి ఉంటుందని నా అనుమానం. లేదా వాళ్ల అమ్మ తనకి వసపోసినప్పుడు తర్జుమా రసం కూడా కలిపి పట్టి ఉండాలి. ఆపైన ఇంగ్లీషు ఒక్కముక్కయినా అర్థం అయిచావని వాళ్ల అమ్మమ్మపై మా ఆవిడకున్న వల్లమాలిన అభిమానం, ప్రేమా అయినా అయిఉండాలి. పెళ్లయిన దగ్గర నుండీ, తర్జుమా లేని ఒక్క వాక్యం కూడా తననోట నేను వినలేదు. ఈ జీవితం ఇంక ఇలాగే గడపాలి అనే విది' నిర్ణయాన్ని ఈ మధ్య ఎదిరించటం మానేశాను.

" ఏవండీ, చల్లపెట్టెలోంచి పాలు తెచ్చిపెట్టరూ?" వంటింట్లోంచి కేకేసింది రాణి, అదే మా ఆవిడ.

వెంటనే ఫ్రిజ్‌లోంచి పాలు తీసుకుని వంటంట్లోకి నడిచాను.

" ఈ మధ్యన పాలవాడు పాలలో నీళ్లు మరీ విపరీతంగా కలిపేస్తున్నాడు" అంటూ గ్యాస్ స్టవ్ అంటించింది. సిలిండర్ ఖాళీ అయింది కాబోలు. గ్యాస్‌స్టవ్ వెలగలేదు.

" ఇవాళ గుర్తుంచుకుని వా.ప్ర వాడికి చెప్పండి!

"వా. ప్ర ఏమిటి?" ఇదేదో కొత్త ప్రయోగంలా ఉందే అనుకుంటూ అడిగాను.

" వాయు ప్రతినిధి. అస్తమానం అన్ని పదాల తర్జుమాలు పలకాలంటే కష్టంగా ఉంది. సమయాభావం వల్ల ఇలా కుదించి, కుంచించి క్లుప్తం చేశా" గర్వంతో కళ్లు మెరిసిపోతుంటే అంది రాణి.

"దయచేసి దూసంకలో ఓసారి జ్ఞాపకం చేయండి వా.ప్రకి. ఈసరికే ఓసారి ముందు చెప్పుదల చేసేశా". చెప్పుదల అంటే బుకింగ్. మరీ దూసంక ఏమిటి?

''ఓ దూసంక ఏమిటనుకుంటున్నారా? దూరసంచార కర భూషణం"

"ఫోనా? ఫోన్ అంటే పోయేదానికి ఏమిటోయ్ రాణీ ఈ దూసంక, ఇంకా నయం లఘుశంక అన్నావుకాదు'' అని ఆట పట్టించాడు. ఆవిడ భాషలో లల్లూ అంటే లఘుశంక ఇల్లుక్లుప్తంగా లల్లూ. అసలే తర్జుమా. ఆపైన క్లుప్తం. ఇంటికి ఎవరైనా వస్తే మరీ అల్లకల్లోలం.

ఆ మధ్యన మా మావయ్య ఏదోపనిమీద వచ్చి మా దగ్గర ఓ రెండు రోజులున్నాడు. ఉదయం బైటకు వెళ్లి సాయంత్రం వెనక్కు వచ్చాడు. మావయ్యకు మంచినీళ్లు, టిఫెను, కాఫీ అన్నీ ఇచ్చి,

" మీ కా.ప పూర్తయిందా బాబాయ్?" అంది మా ఆవిడ.

"కాపా? అదేవిటమ్మాయ్?" బాబాయ్ తెల్లబోయాడు.

" అదే, కార్యాలయం పని. ఇంత పొదుగెందుకని, అలా అడిగా'' అంది. మావయ్య ఏం చెప్పాలో తెలీక, తికమకగా చూశాడు. "ఆ, ఆ" అని పేపరులో ముఖం దాచుకున్నాడు.

''మీ పిండ నిర్ణయం అయిపోయిందాండి?'' ఓపిగ్గా అడిగింది. ఈసారి కూడా మావయ్య తెల్లబోయాడు.

" అదేవిటమ్మా? బ్రతికుండగానే పిండాలూ, శ్రాద్ధాలూ అంటావు? చాలా చిన్నబుచ్చుకుని అన్నాడు.

" ఏంటి బాబాయ్, ఈ మాత్రం తెలీదా? ఫించను డబ్బు. పిం,డ" అంది తన తెలివికి తానే మురిసిపోతూ. మావయ్యకు మా ఆవిడ తర్జుమా, క్లుప్తీకరణ పిచ్చిని తరువాత తీరిగ్గా వివరించేనరికి తల ప్రాణం తోకకొచ్చింది.

మరునాడు మావయ్య ప్రయాణమవుతున్నప్పుడు ఆయన కోసం మా ఆవిడ ఒక చొక్కా కొనుకొచ్చి పెట్టింది. ఆయన కాళ్లకి నమస్కారం పెడుతూ," బయల్దేరండి బాబాయ్, మీ ధూశం వెళ్లిపోతుంది" అంది కంగారుగా.

" అదే అదే ధూమశకటం మావయ్యా" అంటూ మావయ్యను సాగనంపాను.

"పిల్లలు ఆమైకి వెళ్ళారు. నేను పపిగారింటికి వెదుతున్నాను. భోజనం భో.బ మీదుంది. మీకు ఆకలేస్తే పెట్టుకు తినెయ్యండి" అని పురమాయించింది.

"ఏంవోయ్, హో,హో,హో... అంటూ జోదుగిత్తల్ని ఆపినట్లు, రాణిని ఆపాను. "ఈ ఆమై ఏమిటి?"

'ఆటల మైదానం"

"పప్పి ఎవరు?"

''వపి కాదు. వపి. వక్కింటి పిన్నిగారు."

"భో.బ ఏమిటి? భోషాణప్పెట్టె తెలుసుగానీ, భో.బ ఏమిటోయ్?'' తల పట్టుకుంటూ అన్నాను.

"భోజనాల బల్ల" ఈ మాత్రం కూడా తెలీదా అన్నట్లు, పమిటి దులిపి వేసుకుని చరచరా నడిచి వెళ్ళిపోయింది చురచురా చూస్తూ.

మరునాడు మా బావమరిదికి వెళ్లి కూతురిని చూడటానికి వెదుతున్నామనీ, సెలెక్షన్‌కి రాణీకూడా వస్తే బాగుంటుందని మా మామగారి దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది. ఈవిణ్ణి ఒక్కర్తినీ పంపితే. ఈవిడా, ఈవిడ పుట్టింటివారూ, ఆ పెళ్లివారిని ఆదరగొట్టేస్తారని భయపడి, తనతో నేనూ బయల్దేరా.

తరువాతి వారంలో మా బావమరిదికి పిల్లని చూడ్డానికి సకుటుంబ సపరివార సమేతంగా బయలుదేరి వెళ్లాం. మా బావమరిది ఇంజనీరు. " మావాడు బశాని" అన్నారు మా మామగారు.

కాబోయే వియ్యంకుడు తెల్లమొహం వేశాడు.

"భవనశాస్త్ర నిపుణుడు. అంటే సివిల్ ఇంజనీరు. అది వాడి పేరుకాదులెండి" అని వెంటనే వివరింపులందుకున్నా. అబ్బకూడా ఉండటం ఎంతమంచిదైందో అనుకుంటూ.

" మా అమ్మాయి నళిని. తను ఎమ్మెస్సీ కెమిస్ట్రీ" అంటూ కావిగారు... అరెరే క్లుప్తీకరణ జబ్బు నాకూ అంటుంకుందే, అదే కాబోయే వియ్యంకుడుగారు చెప్పారు.

పక్కనించి మా ఆవిడ గుసగుసగా "రసాని, భశాని, భలేగా కుదిరాయి పేరు'8 అని మా మరదలికీ, బావమరిదికీ చెబుతూంటే ఎవరైనా వినేశారేమోనని ఖంగారుపడ్డా. హమ్మయ్య, ఎవరూ విన్నట్టు లేదు. కాస్త ఊపిరి పీల్చుకున్నానో లేదో.

"మా అమ్మాయి పేరు నళినమ్మా. రశాని కాదు" అంటూ పెళ్ళికూతురి బామ్మ ఆపేరులో ఏదో తప్పర్థాన్ని వెతుకుతున్నట్లు, నొచ్చుకుంటూ అంది.

నిజానికి నాకూ ఈ క్లుప్తీకరణ కాస్త ఎబ్బెట్టుగా అనిపించింది. రసాని ఏమిటి? మంత్రసానిలా అనుకుని ఏం చేసేది లేక కళ్లు దించుకుని కూర్చున్నా.

ఇంతలో కారంబూందీ, మైసూర్‌పాకు, కాకినాడ కాజాలు పెట్టిన ప్లేట్లు అందరికీ అందజేశారు. మా అత్తగారు పదార్థాలు బాగున్నాయని మెచ్చుకుంది. మా బావమర్దికీ పిల్లనచ్చినట్లుంది. అది కనిపెడుతూనే, కావిగారు అందుకున్నారు.

"కాసేపు పిల్లలిద్దరినీ ఒంటరిగా మాట్లాడుకోనిస్తే, బావుంటుంది. బావగారూ మా మామిడితోట చూపిస్తా పదండి" అంటూ తెలివిగా మమ్మల్నందరినీ ఒక పెద్ద కారు ఎక్కించి బైల్దేరదీశారు. కారెక్కుతూనే మా ఆవిడ గలగలా మొదలు పెట్టింది. "కాబూ, మైపాలు, కాకాలు చాలా బాగున్నాయండీ, ఎలాగైనా కాకినాడ గొప్పేవేరు" అంది మా ఆవిడ.

" మిమ్మల్ని కాకా పట్టడమేమిటండీ? అబ్బాయికి పిల్ల నచ్చాక...!" విస్తుబోతూ కావిగారు నసిగారు.

"అబ్బెబ్బె. అదేంకాదండి. కాబూ అంటే కారంబూంది. మైపాలు అంటే మైసూర్‌పాకులు, కాకాలు కాకినాడ కాజాలు" అంటూ మళ్లీ సర్ది చెప్పటం నావంతే అయింది.

తోటంతా తిరిగి చూడటానికి ఓ గంటన్నర పట్టింది.

" మా తోట చాలా బావుందండీ" మా మావగారన్నారు.

తోటని మాతోట అంటుంటే, దాన్నికట్నంగా ఇచ్చేయమంటున్నారని అపార్థం చేసుకున్న కావిగారు బిత్తర చూపులు చూడనారంభించారు.

"హె... హె ఈ రోజుల్లో కట్నాలూ అవీ..."అని నీళ్లు నములుతున్నా, బెదిరిస్తున్నట్లు కావిగారి ముఖ కవళికల్లో ఏదో మార్పు కనబడసాగింది నాకు.

వెంటనే అదుపులో పెట్టకపోతే, పరిస్థితి చేయిదాటొచ్చని భయపడి మళ్లీ నేనే విడమరిచి చెప్పా. మాతోట అంటే మావగారి ఉద్దేశం కేవలం మామిడి తోటకు క్లుప్తీకరణేగానీ మరే దురుద్దేశం వారికి లేదనీ, వారుత్త గోవులాంటి వారనీ నచ్చచెప్పేసరికి ఇల్లు రానే వచ్చింది.

ఇల్లు చేరేసరికి నళిని బామ్మ కళ్ల నీళ్లు తుడుచుకుంటూ ముందు వరండాలోనే ప్రత్యక్ష్యం అయింది. నాకర్థమైపోయింది. వాళ్లమ్మాయిని మా ఆవిడ రసాని అని పిలిచినందుకు ఆవిడ బాధపడిపోతోందని. ఇక నాకు విశదీకరించేందుకు విసుగనిపించి, మా మావగార్ని పక్కకి పిలిచా.

"మావగారూ, మీరు కాస్త ఆ బామ్మగారికి, మీ అమ్మాయి తరాణి జబ్బు గురించీ, క్లుప్తీకరణ జటిల వ్యాధి గురించీ విడమరిచి చెప్పండి. రోజంతా అందరికీ చెప్పి చెప్పి వీసిగిపోయాను". అన్నాను.

ఎంతైనా అలుణ్ణి కదా! నేనంటే భయమో, లేక కాస్త ఆయన కూడా తెలిసొచ్చిందో ఆయనే బామ్మగారి దగ్గరికి వెళ్లారు.

"పిన్నిగారూ, మా అమ్మాయికి ప్రతీ పెద్ద పదాన్నీ క్లుప్తంగా, లేక తర్జుమా చేసో చెప్పటం అలవాటు. మీ అమ్మాయిని రసాని అని అంటే అర్థం, రసాయనిక శాస్త్ర నిపుణులు అని అర్థం. అంతేగానీ మంత్రసాని అని కాదు". అని ప్రాధేయపడుతూ అన్నారు.

"అలాగా నాయనా. ఏదో పూర్వకాలపుదాన్ని. ఏమిటో, పెళ్లి కాకుండానే ఆడబడుచు ఇన్నేసి మాటలంటూందేమిటా అని బాధపడ్డాను అంతే నాయనా". అంటూ ఏడుపు ఆపేసి, కట్టుడుపళ్లు అన్నీ బైటపెట్టి రిన్ తెలుపులా వెలుగు నవ్వులు కురిపించేసింది బామ్మగారు.

•

# ఎవరు నువ్వు?

నా ఇష్టం
నన్నడగడానికి నువ్వెవరు?
అసలు సంగతెలా ఉన్నా
అతడు సంధించిన ప్రశ్న
ఇంధనమైంది
ఆమెగుండె మండేందుకు?!

అవును
నేనెవర్ని?
పదే పదే వేధించే ప్రశ్న
ఇల్లాలనే ముసుగేస్తే అదే
కిరీటమని భ్రమసింది
సహధర్మచారిణి పదం
సార్థకమయ్యేందుకు
ఇల్లు-సంసారం-సంతానం
వేణ్ణీళ్ళకు చన్నీళ్ళంటూ
ఉద్యోగ నిర్వహణా భారం అదనం.

ఇంటా బయటా ఎన్నో రూపాలు
మరెన్నో పాత్రలు
ఆ శ్రీ మహావిష్ణువు అవతారాలు పదేనట
మరి ఇల్లాలి అవతారాలు? అదీ
ఏకకాలంలో?
అయినా.......
బాధ్యతలేగానీ హక్కుల్లేని జీవితం
ప్రశ్నించే ఆమె గొంతులో
అతడికి స్ఫురించింది ధిక్కార స్వరం
ఆ గొంతుతోపాటు మనసునూ
నొక్కి పెట్టాలని అతడి ప్రయత్నం
అందుకే....
అతడి ఆ...ప్రశ్న
మండిస్తూంది ఆమె గుండెను మళ్ళీ మళ్ళీ

- దుర్గాప్రసన్న

# నీవు అభ్యుదయవాదివేనా ?

-ఎం. నాగమణి

నీవు అభ్యుదయవాదివేనా?
ప్రశ్నించుకో నీ అంతరంగాన్ని
నీ ప్రయత్నాలు
నీ ఆలోచనలు
నీ పనులు
నీ ప్రపంచంలో నీవున్నావు
ఎప్పుడైనా ప్రయత్నించావా?
నీలోని సగభాగమైన
నీ భార్యతో సంప్రదించాలని
బాధని, సంతోషాన్ని
కష్టాన్నీ, సుఖాన్ని
ఆమెతో పంచుకోవాలని!
ఆమెకూ ఒక మనసుందని
ఆ మనసుకూ స్పందనుందని
గమనించావా ఏనాడైనా?
నియంత్రణ లేని
నియంత లోకం నీది
నీ నియంతపు నిర్ణయాలతో
ఆమెను ఒంటరిని చేశావు
నీతో, నీ పిల్లలతో కలిసే ఉన్నా
మానసికంగా ఒంటరైపోయింది
నీ జీవితంలోంచి తొలగిపోయింది.
శిలలా మార్చేసావు ఆమె మనస్సుని
ఆ శిలను కరిగించటానికి
కనీసపు ప్రయత్నం చేసావా ఎప్పుడన్నా
లేనే లేదు?
ఆమెలోని మాతృత్వపు
సహజ లక్షణాన్ని సైతం
అణిచేసుకుంది బలవంతంగా
నీ పిల్లలకూ మాతృత్వపు
మమకారాన్ని దూరం చేశావు
దీనికి ముమ్మాటికీ
నీవే జవాబుదారీ
కానీ నీవు మాత్రం
మహరాజులా ఉన్నావు (అని
అనుకుంటున్నావు)
కానీ-
నీ మదిలో అలజడి మొదలైంది
కాదని నిన్ను నువ్వే మోసం
చేసుకుంటావా?



కాలం ఎప్పుడూ ఒకేలా ఉండదు
నీ శారీరక పరిస్థితి మారింది
ఆమె అవసరం తెలిసింది
మళ్ళీ నీ జీవితంలోకి
ఆహ్వానించావు నీవు
నిరాకరించింది ఆమె
ఇది నీవు ఊహించినదే
అయినా-
ఏదో ఒక మూల ఆశ
ఆ శిల కరుగుతుందనీ, కరగాలనీ



శిల సైతం కరుగుతుంది
శిలలాంటి ఆమె మనస్సూ
కరగొచ్చు ఎప్పటికైనా!
అది నీ అదృష్టం అని మాత్రం అనుకోకు!
అది ముమ్మాటికీ ఆ శిల యొక్క
గొప్పతనం
ఎందుకంటే-
అది స్త్రీత్వపు సహజ లక్షణం
అది అమ్మతనపు సహజగుణం కాబట్టి
ఇప్పటికీ-
నీవు అభ్యుదయవాదినని
అనుకుంటున్నావా?
కావు కానే కాదు
నీవు అహంకారివి
అవకాశవాదివి
అని నేను అనుకుంటున్నాను.
కాదని అనగలవా? అనుకోగలవా?
ఆత్మసాక్షిగా!!


## మానవి పత్రిక చందాలు, రచనలు, అభిప్రాయాలు పంపవలసిన చిరునామా:

చైతన్య 'మానవి'
మోటూరు ఉదయం భవనం
బ్లాక్ నెం:24, హెచ్.ఐ.జి ఫేజ్:2,
1-8-1, బాగ్‌లింగంపల్లి
హైద్రాబాద్ - 500044
ఫోన్:27605845
ఇ.మెయిల్: chaitanyamanavi@gmail.com

చందా వివరాలు :

చైతన్య మానవి త్రైమాస పత్రిక విడి పత్రిక: 10 రూ॥లు
సంవత్సర చందా: 60 రూ॥లు (పోస్టల్ చార్జీలతో కలిపి)
మనీఆర్డర్ లేదా డీడీ రూపంలో 'మానవి' పేరున పంపగలరు.



## అభ్యుదయ పథంలో

# గారపాటి కమలమ్మ

- అల్లూరి మన్మోహిని

శ్రామిక వర్గ బాంధవి గారపాటి కమలమ్మ మార్చి 14వ తేదిన కన్నుమూసారు. కమలగారు 19-5-1925 పశ్చిమగోదావరి జిల్లా, కొవ్వలి గ్రామంలో పుట్టారు. తల్లిదండ్రులు మేడికొండ పుష్పలీల, శీతయ్య. భర్త గారపాటి సత్యనారాయణ గారిది పెద్దపాడు గ్రామం.

కమలగారు 87 సంవత్సరాల వరకూ అనారోగ్యం ఏమిటో తెలియదామెకు. ఒకరోజు అమ్మ హాస్పిటల్‌లో కన్నుమూసారని ఫోన్ చేశాడు ఆమె కుమారుడు రవీంద్రబాబు.

ఒంగోలులో ఉన్న డా॥మోటూరు టాన్యా తీవ్రమైన అనారోగ్యస్థితిలో ఉన్నారని నేను, కమలమ్మ మరికొందరు కలిసి డా॥టాన్యాను చూడటానికి వెళ్ళాం. టాన్యా పరిస్థితి చూసి స్పందించిన కమలమ్మ గారు కవిత రాసి టాన్యా దగ్గర ఉన్న ఉషకు ఇచ్చారు. అది చదివిన మాకు కమలగారికి, ఉదయంగారి కుటుంబానికి ఉన్న అజ్ఞాత అనుబంధం ఎంత నిగూఢమైనదో తెలిసింది.

కడసారిగా నేనామెను చూసింది మా మనుమడు చందన్ వివాహనికి వచ్చినప్పుడే. వధూవరులకు తన ఆశీస్సులను కవిత రూపంలో అందించారు. కమలగారి హృదయమే కవితల కోవెల. ఏ సందర్భానికైనా వెంటనే స్పందించి కవిత రూపంలో వ్యక్తం చేయగలగటం ఆమె ప్రత్యేకత.

పార్టీ నిర్బంధ పరిస్థితుల్లో ఉన్నప్పుడు మోటూరు ఉదయం, హనుమంతరావు దంపతుల బిడ్డలైన డా॥టాన్యా, ఉషలను తల్లివలె ఆదరించారు కమలమ్మ.

1952 ఎన్నికలలో 40 మంది ఎంఎల్ఎలను గెలుచుకుంది కమ్యూనిస్టు పార్టీ. ఎన్నికల అనంతరం భీమవరంలో జరిగిన మా వివాహ నిర్వాహకులుగా గారపాటి సత్యనారాయణ గారు హాజరైనారు. అనంతరం 60వ దశకంలో జరిగిన ఎన్నికల సందర్భంగా ఏలూరులో నేను అన్నె అనసూయ, కమలమ్మగార్లతో కలిసి ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాం.

1965-66 సంవత్సరాలలో దేశవ్యాప్తంగా సిపియం డిటెన్షన్ చట్టం ప్రయోగించి నాయకులను జైళ్ళలో నిర్బంధించిన సందర్భంగా నేను భీమవరంలో వున్నాను. ఆ సమయంలో ఏలూరు నుండి అన్నే అనసూయగారితో కలిసి కమలమ్మగారు మా ఇంటికి వచ్చారు. ముగ్గురం కలిసి అప్పటి రైతుసంఘం నాయకులు దంతులూరి సీతరామరాజు సహాయంతో పార్టీ నిధి సేకరణ మొదలైన కార్యక్రమాలతో గ్రామాలకు వెళ్ళేవాళ్ళం.

1966-71 మధ్య కాలంలో ఏలూరు మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు కమలమ్మ గారు. ఆ సమయంలో రాజకీయ పెదధోరణుల కల్లోలంలో కమలమ్మగార్ని కౌన్సిలర్ పదవికి రాజీనామా చేయమని ఒత్తిడి చేశారు. కాని కమలమ్మగారు "ప్రజలు నాకిచ్చిన బాధ్యతను తిరస్కరించే హక్కు నాకులేదు" అని కౌన్సిలర్‌గానే కొనసాగారు. నిబద్ధతతో కూడిన ఆమె వ్యక్తిత్వం, క్రమశిక్షణగల ఆమె నిశ్శబ్ద నిరాడంబర జీవనయానం భావితరాలకు ఆదర్శప్రాయం.

హైద్రాబాద్‌లో తన కొడుకు వద్దనే కమలగారి జీవిత చరమాంకం ముగిసింది. సహచరి కమలమ్మకు ఐద్వా రాష్ట్ర కమిటీ శ్రద్ధాంజలి ఘటిస్తోంది.

•

## నిశ్శబ్ద సేవకురాలు

### గారపాటి కమల

ఒద్దికైన మీ మాటతీరూ,
సన్నని, స్వచ్ఛమైన మీ చిరునవ్వును
చూస్తే అణుబాంబు కూడా
ఆవిరైపోతుంది.
చలిచీమలు కూడా పక్కకు తొలగిపోయే
సుతి మెత్తని నడక

డా॥టాన్యా,ఉషలకు అజ్ఞాతపు తల్లియై
ఆత్మీయతను పంచారు
బిడ్డలాంటి టాన్యా బాధను చూసిన
క్షణాన
మీ మనస్సులోని స్పందనని కవితల
వెల్లువగా
పలికిన మీ రచనా సామర్థ్యాన్ని చూసి
ఆనందపడ్డాము, అబ్బురపడ్డాము

నిండైన మీ రూపం
మాకు కనుమరుగైపోతోందంటే
మా మనస్సులు ఒప్పుకోవటం లేదు!
ప్రశాంతంగా నిద్రపోతున్న
పసి పాపాయిలా వున్నారు తప్ప
శాశ్వత నిద్రపోతున్నట్టు లేరు
కానీ నిజమని నమ్మమంటోంది
వాస్తవం!
మీ నడవడిలానే మీ మరణం కూడా
ఎంత నిశ్శబ్దం?

ఎవరినీ నొప్పించని మంచితనం
క్రమశిక్షణ కలిగిన మీ జీవితం
అన్నీ! అన్నీ!! మాకు ఆదర్శాలు,
అనుసరణీయాలే!!
అందుకే అందుకోండి కమలమ్మా!
ఇవే ఇవే మా విప్లవ జోహార్లు!!

(ఐద్వా సీనియర్ నాయకురాలు గారపాటి కమల గారు 14-3-2012 మరణించారు. ఈ సందర్భంగా ఐద్వా జోహార్లు అర్పిస్తోంది.)

- మనుశ్రీ

అంతర్జాతీయ

# కార్మిక గీతం

## (మేడే సందర్భంగా)



అవని పై శాపగ్రస్తుల్లారా!

ఆకలి బాధకు బంధీల్లారా!

లెండి, లెండి, లెండీ!

లేవండి, లెండి, లెండీ!

న్యాయం, తన అగ్ని శిఖరిలో ఉరుముతు ఉన్నది

పాతని అంతం చేసే ఉప్పద్రవమది

భుగ,భుగ, భుగ, భుగ పెల్లుబుకుతు ఉన్నది

పునీత మవుదాం మనం,

కళంక రహితం అవుదాం, అవుదాం!

బానిస చెరలో వాసము చేసే

సాధారణ వంచిత జనులారాక!

లెండి, లెండి, లెండీ!

లేవండి, లెండి, లెండీ!

లోకం తన మూలం మార్చుకు మనబోతున్నది

ఏమీకాని మనమంతా, అంతా....

అంతట మనమే అవుదాం!!

ఇది చిట్ట చివరి పోరాటం,

అందర మొకటై మమేకమవుదాం!

రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం,

కానున్నది అంతర్జాతీయం!



ఈశుదు కానీ... న్యాయాధీశుదు కానీ,...

సీజరు కానీ... సర్వాధీశుదు కాని,

ఉత్కృష్ట జగద్రక్షకు లెవరూ లేరు,

లేరూ, లేరూ, లేరూ, లేనేలేరు, లేరు,

నిర్మాతలం మనం, నిర్ణేతలం మనం

మనమే, మనమే-మనమే మనకు రక్ష

రక్ష, రక్ష, రక్ష

ఆత్మిక శక్తులు, చెరలను చీల్చుకు వచ్చేలా

దోపిడి దొంగల, సర్వం, అంతం చూసేలా

ఉమ్మడి విముక్తి తీర్పుగ ఇద్దాం

కొలిమిని మనమే రాజేద్దాం

కాలిన ఇనుము పై, దెబ్బ పై దెబ్బ,

దెబ్బ పై దెబ్బ, దెబ్బ పై దెబ్బ,

దెబ్బ పై దెబ్బ, వేసేద్దాం!

ఇది చిట్ట చివరి పోరాటం,

అందర మొకటై మమేకమవుదాం!

రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం

కానున్నది అంతర్జాతీయం!



క్రూరంగా రాజ్యం హింసిస్తుందీ,

ఘోరంగా చట్టం వంచిస్తుంది

దౌర్భాగ్యులకే పన్నులపోటు,

పాటే లేని ఆ శ్రీమంతులకు ఉండనె ఉండదే ఆ వేటు!

నిరుపేదల హక్కులు అబద్ధం

మాటల మూటలకే అవి పరిమితం
నిర్బంధంలో కృశించుటిక చాలూ! చాలు; చాలు; చాలూ!
బాధ్యత లెరుగని ఆ మూఢులకు హక్కులు వద్దు
హక్కుల హరణం, శ్రామిక జీవన సూత్రం అయితే,
బరువులు, బాధ్యత లొద్దు, ఒద్దు, ఒద్దు, ఒద్దు!
బాధ్యతల్లేని హక్కులుండవు
హక్కుల్లేని బాధ్యతలుండవు
ఇది సమతా వాదం, ఇది సమాన న్యాయం!
ఇది చిట్ట చివరి పోరాటం
అందర మొకటై మమేకమవుదాం!
రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం
కానున్నది అంతర్జాతీయం!



గనులకు, వనులకు, రోడ్లకు, రైళ్ళకు దొరలు లే వారు!
వికృత్వమునకు అగ్రత్వము లే వారు!
శ్రమ దోపిడి ఒక్కటె చేసే వారూ...,
చొరబడి పనిలో కెన్నడు రారు.
ఏ కండ కరిగి సృజియించిన సంపద
మూల్గుతున్న దా మందల సందూకులలో?
ముందది ఇమ్మని శాశిస్తున్నారు,
అది మాదే మాదేనని జనులంటున్నారు
ఇది చిట్ట చివరి పోరాటం,
అందర మొకటై మమేకమవుదాం!
రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం
కానున్నది అంతర్జాతీయం!



ప్రభువుల కొరకై పోరాటం జరిపే
ఉన్మాదపు క్రోధాగ్ని మత్తులో మనలను ముంచెత్తారు
మనలో మనకీ శాంతీ, శాంతీ, శాంతన్నారు
ఈ నరభక్షకులు మనని శూరులు కమ్మని
సాటి నరులపై స్వైర విహారం చెయమని
నిర్దేశిస్తే, నిర్బంధిస్తే....,
సేనలన్నిటితోటి, మనం సమ్మె కడదాము
నిల్వ లన్నిటిని గాలి కెగురవేద్దాము
అంతస్తులను మనం కూలదోద్దాము
ఈ నరభక్షకులు మనని శూరులు కమ్మని,
సాటి నరులపై స్వైర విహారం చెయమని
నిర్దేశిస్తే, నిర్బంధిస్తే....,
సైన్యాధ్యక్షులపైనే మన
తూటా గురి అని గ్రహించగలరు.
ఇది చిట్ట చివరి పోరాటం
అందర మొకటై మమేకమవుదాం!
రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం
కానున్నది అంతర్జాతీయం!



కార్మికులారా! కర్షకులారా!
మనమంతా శ్రామిక జన సందోహం!
ఈ జన సందోహం, ఓ ఘన సందోహం!
శ్రామిక మానవ ఆవాసం ఈ మహి!
సోమరులకు ఆవాసము కారాదు ఇది!
మన మాంస మెంత మింగారో కద వారు మరి!
కానీ, ఈ నల్లని కాకులు, ప్రేతాలను తిని బ్రతికే రాబందులు
ఖాయంగా మాయం అయ్యే ఓరోజున,
కాంతిమయంగా అరుణ తేజమే ఎల్లవేళలా!
ఇది చిట్ట చివరి పోరాటం
అందర మొకటై మమేకమవుదాం!
రేపిక శ్రామిక మానవ జాతి సమస్తం
కానున్నది అంతర్జాతీయం!

(ఫ్రెంచ్ మూలం-యూజిన్ పాటియర్. "పారిస్ కమ్యూన్" విప్లవ కారుడైన ఫ్రాన్స్ దేశపు కార్మికుడు ఈయన)

(ఇంగ్లీషు నుండి తెలుగుకి గేయ అనువాదం)

-డా॥ డి.ఎల్.విద్య

# నక్షత్ర

- శాంతి శ్రీ




నక్షత్రను కాలేజీలో చేర్చారు... కొత్త కాలేజీ... కొత్త స్నేహితులు...వయస్సులో వచ్చే కొత్త మార్పులు...నక్షత్ర కొంచెం ధైర్యంగా ఉంటున్నందుకు ఇద్దరికీ హాయిగా ఉంది. చదువులో పడింది. డాక్టర్ కావాలన్న లక్ష్యంతో ఇష్టపడి బైపిసి గ్రూపు తీసుకుంది. కొద్ది రోజులు బాగానే గడిచిపోయాయి. ఈ మధ్య ఎందుకో నక్షత్రలో ఏదో మార్పు కనిపిస్తుంది. పలకరిస్తుంటే ఒక్కోసారి ఉలిక్కిపడుతుంది. బెదురు చూపులు చూస్తోంది. దిగులుగా కూడా ఉంటోంది...ఎందుకో శ్రావణి తల్లి మనస్సు కీడును శంకించింది. 'తనంతట తనే చెపుతుందేమో చూద్దాం..నేనెందుకు తొందరపడటం. మళ్ళీ అనుమానపడినట్లు నక్షత్ర ఫీలవ్వవచ్చు. 'వెయిట్ చేద్దాం'. అని మనస్సులో అనుకుంది. మరోపక్క నుండి ఈ ఆకర్షణవు, వ్యామోహాల ప్రపంచంలో...మోసప్రపంచంలో..మాయా ప్రపంచపు ఉచ్చులో పడిపోకుండా ఎలా బతకాలో...ఎప్పటికప్పుడు కూతురికి జాగ్రత్తలు చెపుతూనే ఉంది.

ఓ ఆదివారం టిఫిన్ చేద్దామని కూర్చున్నారు. ఎంతకీ నక్షత్ర టిఫిన్ తినటం ప్రారంభించటం లేదు. తల దించుకునే ఉంది. 'ఏంట్రా? టిఫిన్ తినూ...' అన్నాడు శరత్. బొటబొటా కన్నీళ్ళు కార్చేసింది నక్షత్ర. 'ఏమైందిరా? అంటూ శ్రావణి దగ్గరికెళ్ళి వెనకనుండి దగ్గరకు తీసుకుంది. వెంటనే కుర్చీలో నుండి లేచి శ్రావణిని హత్తుకుపోయింది నక్షత్ర. 'ఎందుకురా? అంత బేలగా, భయంగా ఉన్నావు?...సబ్జెక్ట్ అర్థం కావడటం లేదా? గ్రూపు మారిపోతావా? ఏంట్రా?' అంటూ లాలనగా అడిగింది శ్రావణి. వెంటనే తన చేతిలో సెల్ తీసి తల్లికిచ్చి 'మెసేజ్‌లు చూడమ్మా..' అంది నక్షత్ర. ఎప్పుడన్నా అవసరానికి ఉపయోగపడుతుందని ఇచ్చిన సెల్ నిండా 'ప్రేమించకపోతే ఊరుకోను...నువ్వైనా మిగలాలి...నేనైనా మిగలాలి...ఏంటే నీకంత పొగరు? నాకేం తక్కువైందే...? అన్న బెదిరింపు మెసేజ్‌లే..

'నా నెంబరు ఎలా తెలిసిందో నిజంగా నాకు తెలియదమ్మా..' ఏడుస్తుంది నక్షత్ర. ప్రతిరోజూ నాకు బెదిరింపు లెటర్స్...కాల్స్ వస్తూంటే కాలేజీకి వెళ్ళాలంటే భయమేస్తోందమ్మా...మరొకడు నేను ఈనెలల్లో నా నిర్ణయం చెప్పకపోతే యాసిడ్ పోస్తానంటున్నాడమ్మా...నిజంగా నన్నేదైనా చేసేస్తాడేమోనని భయమేస్తోందమ్మా.. అబ్బాయిలూ వయస్సులో ఉన్నారు కదా? వారినెవరూ వేధించడం లేదుగా...మరి అమ్మాయిలికే ఈ పరిస్థితి ఏంటమ్మా? అప్పుడు కుక్కలు పడుతున్నాయంటే ఎవరికో చెప్పి వాటి బాధ లేకుండా చేశారు...ఇప్పుడూ అలాగే ఏదో ఒకటి చేసి, నేను ప్రశాంతంగా కాలేజీకి వెళ్ళేలా చూడండి...నువ్వూ నాన్నా ఏదో ఒకటి చేయండంటూ' ఒణికిపోతూ శ్రావణిని అల్లుకుపోయి వెక్కి వెక్కి ఏడుస్తోంది నక్షత్ర.

ఆ మాటలకు శ్రావణి వెన్నులో వణుకులాగా వచ్చింది. మరోపక్క దుఃఖం ఆగడం లేదు. కళ్ళెత్తి శరత్‌వైపు చూసింది. అతని మొహంలో ఆవేశం..ఆందోళన కనిపిస్తున్నాయి. నక్షత్రకు తన కన్నీరు కనవడకుండా చెంగుతో కళ్ళు తుడుచుకుని..'అలాగేలేరా..ఏదో ఒకటి చేద్దాం...ప్రతి సమస్యలకూ ఒక పరిష్కారముంటుంది... మాకు చెప్పేశావు కదా..ఇక నువ్వు నిశ్చింతగా ఉండు..నువ్వు రిలాక్స్ అవ్వు..' అంటూ కూతురి కళ్లు తుడిచి టిఫిన్ తినిపించింది.

'శరత్! నేవ్వేమీ కంగారు పడకు..నిదానంగా ఆలోచిద్దాం...ఇది మన ఒక్కరి సమస్యే కాదు..నేడు సమాజంలో ఎందరో అమ్మాయిలు, వారి తల్లిదండ్రులు ఎదుర్కొంటున్న సమస్య....ముందు టిఫిన్ చెయ్యి....' అంది శ్రావణి.

అప్పటి నుండి శ్రావణి, శరత్ తమ తమ స్నేహితులతో ఈ సమస్య గురించి చర్చిస్తూనే ఉన్నారు. కొందరు 'ఇక ఆడపిల్లల్ని చదివించలేమంటూ' నిరుత్సాహపరిస్తే..' కాలం మీద వదిలేయాలి. ఎలా రాసి పెట్టి ఉంటే అలా జరుగుతుందంటూ' మరికొందరు మెట్ట

**నక్షత్రకు తన కన్నీరు కనపడకుండా చెంగుతో కళ్ళు తుడుచుకుని..'అలాగేలేరా..ఏదో ఒకటి చేద్దాం...ప్రతి సమస్యలకూ ఒక పరిష్కారముంటుంది... మాకు చెప్పేశావు కదా..ఇక నువ్వు నిశ్చింతగా ఉండు..నువ్వు రిలాక్స్ అవ్వు..' అంటూ కూతురి కళ్లు తుడిచి టిఫిన్ తినిపించింది.**

వేదాంతం చెప్పారు. ఇంకొందరు 'ధైర్యంగా ముందుకు వెళ్ళడమే...మీరే భయపడుతూ కూర్చుంటే ఎలా? పాపకు ధైర్యంగా ఉండమని చెప్పండి' మేమందరం లేమా అంటూ భరోసా ఇచ్చారు.

శ్రావణికి, శరత్‌కు ఏం చేయాలో పాలుపోవడం లేదు. సంక్రాంతి శెలవులు వచ్చాయి.

నక్షత్రను తీసుకుని విజయవాడకు బయలుదేరారు.

తర్వాతి రోజు ఉదయమే శ్రావణి తనకు ఎప్పుడూ సలహాలు ఇచ్చే మూర్తి బాబాయ్‌ని కలిసేందుకు బయల్దేరింది. ఆయన గొప్ప రచయిత కూడా.

ఇంట్లోకి అడుగు పెట్టగానే ..."ఏమ్మా శ్రావణీ బాగున్నావా? ఏంటి సంగతులు? పండక్కి వచ్చారా? ఎప్పటివరకూ ఉంటారు?" అంటూ ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించారు మూర్తి.

"అవును బాబాయ్..పండుగ వరకూ ఉంటాం...' అంటూ వెళ్ళి ఆయనకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది. ఆయన గదిలో చుట్టూతా పుస్తకాలే. ఒక్కసారి చుట్టూ పరికిస్తే పుస్తకాల ప్రపంచంలో ఉన్నట్లుంది శ్రావణికి.

"ఏంటమ్మా ఒంట్లో బాగోలేదా?...అంత ఉత్సాహంగా లేనట్లున్నావు...' అన్నాడు మూర్తి.

'కనిపెట్టేశాడు బాబాయ్..ఈయన ముందు నా భావాలు అసలు దాచలేనో...లేక ఆయనే కనిపెట్టేస్తారో అర్థం కాదు' అనుకుంది శ్రావణి.

"అవును బాబాయ్...!మాపాప నక్షత్ర ఇప్పుడు కాలేజీకి వచ్చింది. ఇంటర్ ఫస్టియర్ చదువుతోంది...అంటూ విషయమంతా వివరించింది. ఏం చేయాలో పాలుపోవడం లేదు బాబాయ్...అసలు ఇలా జరగటానికి కారణాలు ఏంటో ఎంత ఆలోచించినా అంతుపట్టటం లేదు?"

'చూడమ్మా శ్రావణీ! ఇప్పటి చదువులు వారికి లోకజ్ఞానం ఇవ్వడం లేదు. పోటీ చదువులు. ర్యాంకుల మీద ధ్యాస. ఆ తర్వాత ఎక్కువ డబ్బు వచ్చే ఉద్యోగాలు. ఇలాంటివాటిమీద తప్ప. చుట్టూ ఉన్న సమాజాన్ని అర్థం చేసుకునే స్పృహలో వాళ్ళు లేరు. పెద్దలైన మనమూ లేము. మన పిల్లల్ని కూడా ఈ పోటీ ప్రపంచంలోకి అనివార్యంగా నెట్టేస్తున్నాం. చుట్టూ సమాజం గురించి ఇంట్లో చెప్పడానికి తీరికలేని తల్లిదండ్రులు. పోనీ స్కూల్లో అన్నా చెపుతారా? అంటే అక్కడా సిలబస్ పూర్తిచేసి, తమ స్కూలుకే ర్యాంకు రప్పించాలనే తపన తప్ప వేరే ధ్యాసలేని టీచర్లు. వాళ్ళనీ అనుకోవడానికి లేదులే. ర్యాంకు వేరే స్కూలుకు వెళ్ళితే ఉద్యోగం ఊడిపోతుందేమోనన్న అభద్రతలో కొట్టుమిట్టాడుతున్నారు వాళ్ళు. ఇంట్లో పెద్దవాళ్ళన్నా ఉంటే చెబుతారనుకుంటే వారికి టైమ్ కేటాయించలేని నిస్సహాయస్థితిలో వృద్ధాశ్రమాలకు పంపేస్తున్నారు. వాళ్ళలా వాటిల్లో మగ్గిపోతున్నారు. ఇక ఈ పిల్లలకు సమాజం, మానవ సంబంధాల గురించి చెప్పేదెవరు? ఈ ప్రపంచీకరణలో అందరూ పడి కొట్టుకుపోతున్నారు. మానవ సంబందాలు మృగ్యమైపోతున్నాయి. వీటి నుండి బయటపడాలంటే మనం పిల్లలకు కొంత సమయం కేటాయించాలి. వారికి విషయాలు చెప్పాలి. పుస్తకాలు చదివించాలి. పాఠ్యపుస్తకాలు తప్ప వేరే సాహిత్యం చదివే తీరిక నేటి తరం పిల్లలకు ఎక్కడిది? మాతరం వారు చాలా వరకూ ఇంట్లో పెద్దలు కొన్ని చెప్పితే...చాలా వరకూ సాహిత్యం చదివే తెలుసుకున్నాం. ఈ విధమైన మార్పు ముందు మనలో రావాలి. ఆ తర్వాత సమాజంలో రావాలి. ఇదో దీర్ఘకాల పరిష్కారం. అంత తొందరగా రాదు మార్పు" ఆపి మంచినీళ్ళు తాగాడు మూర్తి.

"ఇప్పుడు నేనేం చెయ్యాలి బాబాయ్?' ఆందోళనగా అడిగింది శ్రావణి.

"ప్రస్తుతానికి ముందు నువ్వు ధైర్యంగా ఉండు. మీ అమ్మాయినీ ధైర్యంగా ఉండమను. ఇదేమీ ఒక్క మీ నక్షత్ర సమస్య కాదు. ఆమె వయస్సులోని ప్రతి ఆడపిల్లకూ ఎదురయ్యే సమస్యే. తనని ఒంటరిగా కాకుండా, ఎప్పుడూ స్నేహితులతో కలిసిమెలిసి ఉండమను. విషయాలను స్నేహితులతో పంచుకోమను. సమస్య వచ్చినప్పుడు అందరూ కలిసి ఆలోచించి, దాన్ని పరిష్కరించుకునేలా ఉండమను. ఎవరైనా దాడి చేస్తే అందరూ కలిసి ఎదుర్కొనేలా ఉండమను....' అన్నాడు మూర్తి.

"నిజమే బాబాయ్! నువ్వు చెప్పింది నిజం. జీవితం మానవ సంబంధాలతో నిమిత్తం లేకుండా యాంత్రికంగా సాగిపోతుంది. అవసరాల కోసం డబ్బు..డబ్బు గురించి అవసరాలు పెంచుకుంటూ నేటి మానవుడు జీవించేస్తున్నాడు. మానవ సంబంధాలు తిరిగి చిగురులు వేసేలా మనమందరం కృషి చేయాలి" అంది శ్రావణి.

"అవునమ్మా ..అంతే! నేడు ఆడపిల్లలు" మగపిల్లలూ పోటీపడి చదువుతున్నారు. అన్ని రంగాల్లో దూసుకువెళుతున్నారు. ఆర్థిక సమస్యలనూ అధిగమిస్తున్నారు. కానీ కొత్తగా వచ్చే ఇలాంటి సమస్యల్ని ఎలా ఎదుర్కోవాలో అర్థం కావడంలేదు. మగ పిల్లలు వస్తువును సొంతం చేసుకున్నట్లే ఆడపిల్లలను సొంతం చేసుకోవాలనుకుంటున్నారు. ఆమెకూ శరీరమే కాకుండా మనస్సూ ఉంటుందన్న ఆలోచనలేదు. మార్క్స్ అప్పుడే చెప్పాడమ్మా 'ఈ పెట్టుబడిదారీ సమాజంలో మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలని...' ఈ సమాజం మారాలి. ఈ విషయాలు వారికి అర్థం చేయించగలిగితే పెద్ద విజయం సాధించినట్లే. నువ్వేమీ ఆందోళన పడమాకు. ఆందోళనతో ఏమీ సాధించలేం..' అన్నాడు మూర్తి.

'అలాగే బాబాయ్.. నాకు ధైర్యమిచ్చారు.. ఈ విషయాలన్నీ శరత్‌తో చెప్పాలి. అసలు శరత్‌ను కూడా నాతో రమ్మన్నా. తనకేదో పని ఉందంటూ వెళ్లాడు. మీ ఫోను నెంబరు ఉంది కదా! అస్సలు ఇన్ని రోజులు ఫోను చేయాలన్న ఆలోచన కూడా రాకుండా అయిపోయింది నా బుర్ర. ఇప్పుడు మీ మాటలతో ఫుల్ చార్జి అయింది బాబాయ్. ఉంటాను మరి..' అంటూ ఉత్సాహంగా లేచింది.

వచ్చేటప్పటికన్నా ఇప్పుడు ఎంతో ధైర్యంతో అడుగులేస్తూ ముందుకు కదిలింది శ్రావణి.

శ్రావణికి ఈ సంక్రాంతి కొత్త కాంతినిచ్చింది.

– సమాప్తం

# "ఆహార భద్రతా బిల్లు - 2011" పై ఐద్వా వ్యాఖ్యలు

**దాదాపు సగం మందికిపైగా భారతీయ మహిళలు, ముప్పాతిక మంది పిల్లలు రక్తహీనతతో ఉన్నట్లు జాతీయ కుటుంబ, ఆరోగ్య సర్వే-3 సూచించింది. గత అనేక సంవత్సరాలుగా పెరుగుతున్న ధరలు ముఖ్యంగా ఆహార వస్తువుల ధరలు పెరుగుతున్నందున దేశంలోని పౌరులందరికీ ఆహార భద్రత చర్యలను పటిష్టపరచాల్సిన అవసరముంది.**

నేడు మనదేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యల్లో ఆహార భద్రత కూడా ఉంది. ప్రపంచ ఆకలి సూచి(జిహెచ్ఐ) లెక్కింపులో 88 వర్ధమాన దేశాల్లో భారత్ 66వ స్థానంలో ఉన్నట్లు అంతర్జాతీయ ఆహార విధాన పరిశోధనా సంస్థ (ఐఎఫ్‌పిఆర్ఐ) వివరించింది. మనదేశంలో ఆకలి స్థాయిలు 'ఆందోళన' కల్గించేస్థాయిలో ఉన్నాయని కూడా సూచించింది. దేశ జనాభాలో 76శాతం మంది సరిపడా కేలరీలు, ఆహార వినియోగం లేక బాధపడుతున్నారు. గ్రామీణ ప్రాంతంలో 80శాతం మంది, పట్టణ ప్రాంత జనాభాలో 64 శాతం ఈ పరిస్థితిని ఎదుర్కొంటున్నారు. మనదేశం ప్రపంచంలోనే అత్యధికంగా అన్నార్తులున్న దేశంగా ఉంది. ప్రపంచంలో ఆకలిగొన్న ప్రజల్లో 25 శాతం మంది భారతదేశంలో ఉన్నట్లు ఐక్య రాజ్య సమితి ప్రపంచ ఆహార కార్యక్రమం వెల్లడించింది. దాదాపు సగం మందికిపైగా భారతీయ మహిళలు, ముప్పాతిక మంది పిల్లలు రక్తహీనతతో ఉన్నట్లు జాతీయ కుటుంబ, ఆరోగ్య సర్వే-3 సూచించింది. గత అనేక సంవత్సరాలుగా పెరుగుతున్న ధరలు ముఖ్యంగా ఆహార వస్తువుల ధరలు పెరుగుతున్నందున దేశంలోని పౌరులందరికీ ఆహార భద్రత చర్యలను పటిష్టపరచాల్సిన అవసరముంది. మన దేశ జనాభాలోని విస్తారమైన సెక్షన్లు ఎదుర్కొంటున్న ఆహార అభద్రతా సవాలును ఎదుర్కొనే విధంగా ఆ చర్యలు ఉండాల్సిన ఆవశ్యకత ఉంది.

ప్రస్తుతమున్న హక్కులను విస్తరించడానికి బదులు ప్రభుత్వం తెచ్చిన 'జాతీయ ఆహార భద్రతా బిల్లు, 2011' మరిన్ని కోతలు, నిబంధనలను ప్రతిపాదించడం దురదృష్టకరం. ఈ బిల్లు కింద హక్కులను విస్తరిస్తూ సార్వజనీన కవరేజి ఇస్తూ ప్రాథమిక సవరణలు చేపట్టకపోతే ఐద్వా ఆ బిల్లును వ్యతిరేకిస్తుంది. ఆహార భద్రత పేరిట ప్రస్తుతం ఈ కొత్త బిల్లు ఈ దిగువ కారణాలవల్ల ఆహారానికి సంబంధించి అభద్రతను మరింత పెంచే విధంగా ఉంది.

ఎ. 1997 నుంచి 'లక్షిత' పిడిఎస్‌లో అన్ని రకాలుగా దారుణంగా విఫలమైనప్పటికీ బిపిఎల్, ఇతర కేటగిరీల లబ్దిదారులను గుర్తించేందుకు ఒక సరైన, సుస్థిరమైన ప్రమాణాల్ని ప్రభుత్వం రూపొందించ లేకపోయింది. అమలుకు సంబంధించిన లోపాలను తగ్గించలేక పోయింది. ఈ ప్రతిపాదిత బిల్లు లబ్దిదారుల్లో ప్రాధాన్యతా కుటుంబాలు (బిపిఎల్), సాధారణ కుటుంబాలు(ఎపిఎల్) మినహాయించిన కుటుంబాలు వంటి పేర్లతో అలాంటివే మరికొన్ని కేటగిరీలు, విభజనలు ప్రవేశపెట్టాలనుకుంటోంది. మొదటి రెండు కేటగిరీల కిందికి వచ్చే కుటుంబాలను తగ్గించాలని ప్రతిపాదిస్తోంది. నేడు దేశంలోని వాస్తవ బిపిఎల్ లబ్దిదారులు 56 శాతం మందిని 'ప్రాధాన్యత' సెక్షన్ల లబ్దిదారులకు మాత్రమే కవరేజి ఇవ్వాలని ప్రతిపాదిస్తోంది. నేడు బిపిఎల్, ఎపిఎల్ రెండు కేటగిరీలు కలిపి 82 శాతం కుటుంబాలు లబ్ధిపొందుతుండగా దానికి గ్రామీణ ప్రాంతాల్లో 75 శాతానికి, పట్టణ ప్రాంతాల్లో 50 శాతానికి తగ్గించాలని ఈ కొత్త బిల్లు ప్రతిపాదిస్తోంది. కాబట్టి ప్రభుత్వ బిల్లు పిడిఎస్‌ను బాగా కోత పెట్టేందుకు చేసిన ప్రతిపాదనే. తక్కువలో తక్కువగా గ్రామీణ జనాభాలో 25 శాతం, పట్టణ జనాభాలో 50 శాతం ఈ బిల్లు పరిధిలోకి రాకుండా చేయాలని ప్రస్తుత బిల్లు భావిస్తోంది.

బి. ఈ బిల్లు కింద లభించే హక్కును ప్రణాళికా సంఘం చేసిన తప్పుడు పేదరిక అంచనాలతో ప్రతిపాదిత బిల్లు ముడిపెడుతుంది. పేదరికం తగ్గినట్లు చూపుతున్న తన తప్పుడు పథకాలు, తగ్గిస్తున్న సబ్సిడీల మూలంగా పేదలను గుర్తించేందుకు ప్రణాళికా సంఘం తన లక్ష్యాలను మార్చుకుంటోంది. దాని ఫలితంగా వాస్తవాలు, స్పష్టతపై ఆధారపడి శాస్త్రీయ అంచనాలు వేయడానికి బదులు అసాధారణ అంకెలపై ఆధారపడుతోంది. ఇటీవల సుప్రీంకోర్టుకు సమర్పించిన అఫిడవిట్ (తరువాత దాన్ని మార్చుకుంది)లో ప్రణాళికా సంఘం గ్రామీణ ప్రాంతాల్లో రూ.25, పట్టణ ప్రాంతాల్లో రోజుకు రూ.32 కంటే తక్కువ వచ్చే వారే దారిద్ర్య రేఖకు దిగువన ఉండేలా నిర్ధారించింది. ఈ బిల్లు అలాంటి వివాదాస్పద పేదరిక అంచనాలపై ఆధారపడి హక్కులు కల్పించాలని చూస్తోంది. ఇది ఆమోద యోగ్యం కాదు. గత కొద్ది సంవత్సరాలుగా దేశంలోని అత్యధిక భాగం రాష్ట్ర ప్రభుత్వాలు బిపిఎల్ జాబితాను, హక్కులనువిస్తరించే దిశగా కదులుతున్నాయి. కొన్ని సార్వత్రీకరించిన పిడిఎస్ దిశగా కూడా కదిలాయి. వాస్తవాలు ఈ విధంగా ఉన్నప్పటికీ ప్రభుత్వ బిల్లు సార్వత్రీకరించిన పిడిఎస్ దిశగా కదలడం లేదు.

సి. ఈ బిల్లు ప్రస్తుతం ఒక్కో కుటుంబానికి నెలకు ఇస్తున్న 35 కిలోల రేషన్ కోటాను తగ్గించింది. బిపిఎల్ కుటుంబాల్లో ఒక్కో వ్యక్తికి 7 కిలోలు, ఎపిఎల్ కుటుంబాల్లో తలసరిన 3 కిలోలకు తగ్గించింది. ఎన్ఎస్ఎస్ 61వ విడతలో భారతదేశంలో సగటు కుటుంబ పరిమాణాన్ని 4.5గా నిర్ధారించారు. కనుక ప్రభుత్వం తన నూతన విధానం ద్వారా నికర ఆహార ధాన్యాల కేటాయింపును తగ్గించాలనుకుంటోంది. ఈ విధానంవల్ల వ్యక్తిగత కుటుంబాలు ముఖ్యంగా చిన్న కుటుంబాలు నష్టపోవాల్సి ఉంటుంది. దీనివల్ల పౌష్టికాహార లోపం, పేదరికం, పెరుగుతుంది. ప్రభుత్వం కుటుంబానికి కనీసం 35 కిలోల ఆహార ధాన్యాలను ఖచ్చితంగా అందించాలి.

డి. ఈ బిల్లు ఆహార పదార్థాల ధరలు, కొనుగోలు చేసే సామర్థ్యంలో కూడా

మార్పులు చేస్తోంది. బిపిఎల్ 1 ప్రాధాన్యతా సెక్షన్లకు బియ్యం కిలోకు రూ.3, గోధుమలు రూ.2, తృణధాన్యాలు కిలోకు 1 రూపాయిగా ప్రతిపాదిత ధరలున్నాయి. దీనివల్ల ప్రస్తుతం కిలో రెండు రూపాయలకు బియ్యం అందిస్తున్న (తమిళనాడులో కిలో రూపాయి) పది రాష్ట్రాల్లో బియ్యం ధర పెరుగుతుంది. మారుతున్న ధరలకనుగుణంగా ఎపిఎల్ కేటగిరీకి అందించే వస్తువుల ధరలు ఉంటాయి. అది రైతులకిచ్చే కనీస మద్దతుధర(ఎంఎస్‌పి)లో 50 శాతం వరకూ కూడా ఉంటుంది. ఎంఎస్‌పి పెంచాలనే రైతుల డిమాండ్ న్యాయమైంది గనుక ఎంఎస్‌పి పెరుగుదలతోపాటు ఎపిఎల్ ధరలు కూడా పెరుగుతాయి. ఇది వినియోగదారులు, రైతుల మధ్య చీలికలు, తగాదాలు సృష్టిస్తుంది.

2. ఆహార భద్రతను పటిష్టపరిచే ఉద్దేశంతో పలు రాష్ట్ర ప్రభుత్వాలు పిడిఎస్ కింద వంటనూనె, పప్పు ధాన్యాలు వంటి మరిన్ని వస్తువులను కూడా అందించే దిశగా చర్యలు తీసుకున్నాయి. ప్రస్తుత బిల్లులో పెంచిన ఆహార పదార్థాల సంఖ్యను ప్రతిపాదిత బిల్లులో కూడా కచ్చితంగా చేర్చాలి.

ఎఫ్. ప్రపంచ బ్యాంకు ఆదేశిత విధానాలకు అనుగుణంగా ఆహార పదార్థాలకు బదులు నగదు బదిలీని చేపట్టాలని ప్రతిపాదిత బిల్లు చూస్తోంది. దేనికోసమైతే డబ్బు చెల్లిస్తారో అదే వస్తువు కొనుగోలుకు ఉపయోగిస్తారనే గ్యారంటీ నగదు బదిలీలోలేదు. ప్రస్తుత పితృస్వామిక సమాజంలో అలా అందించే డబ్బును ఇతర పనులకు ఉపయోగించే అవకాశముంది. పిడిఎస్ కోసం మహిళను ఇంటి యజమానిగా పరిగణించాలనే ప్రతిపాదన సానుకూలమైన అడుగే. కానీ అదే పరిష్కారం కాబోదు. మన దేశంలో శ్రామిక మహిళల్లో అత్యధిక భాగం తమ ఆదాయాన్ని తమ ఇష్టానుసారం ఖర్చు పెట్టుకునే పరిస్థితి లేదు. 37 శాతం కంటే తక్కువ మంది మాత్రమే గృహ నిర్ణయాల్లో భాగస్వాములవుతున్నారు. అందువల్ల ప్రత్యక్ష నగదు బదిలీ వల్ల మహిళలు, పిల్లల ఆహార లభ్యత ప్రమాదంలో పడుతుంది.

3. ఆహార ధాన్యాలు అందించడానికి పర్యవేక్షించేందుకు లీకేజిలను తొలగించేందుకు ఒక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలని ఈ బిల్లు గరిష్టంగా ప్రయత్నిస్తుంది. అయితే లక్షిత వ్యవస్థను అమలు చేసిన కాలంలో పిడిఎస్‌లో లీకేజిలు రెట్టింపు అయినట్లు ప్రణాళికా సంఘం రూపొందించిన 11 వ పంచ వర్ష ప్రణాళికా పత్రం వెల్లడించింది. 1993-94లో సార్వజనీన పిడిఎస్ కింద బియ్యం విషయంలో 19 శాతంగా లీకేజీలు ఉండగా అది 2004-05(ఎన్ఎస్ఎస్ గణాంకాలు)లో లక్షిత పిడిఎస్ కింద 40 శాతం లోపుకు పెరిగింది. గోధుమ విషయంలో అది 1993-94లోని 41శాతం నుంచి 2004-05లో 73 శాతానికి పెరిగింది. సార్వజనీన లేదా లక్షిత పిడిఎస్ కంటే ఎక్కువ కవరేజి ఉన్న రాష్ట్రాలలో అతి తక్కువ లీకేజి ఉన్నట్లు వెల్లడైంది. అందువల్ల ఆహార ధాన్యాలను అందించేందుకు సార్వజనీన పిడిఎస్ ఒక్కటే ఉత్తమ మార్గం.

4. నగదు బదిలీ లీకేజీలు, అపహరణలు వంటివి లేకుండా ఉంటుందనే గ్యారంటీ లేదు. బ్యాంకు ఖాతాలకు నగదు బదిలీ చేయడంపై ఆధారపడి పనిచేస్తున్న ఎన్ఆర్ఇజిఎ, వృద్ధాప్య పింఛన్లు, వితంతు పింఛన్లు వంటి పథకాల అమలులో అవినీతి సమస్యలు, అనవసర జాప్యాలు కొనసాగుతూనే ఉన్నాయి. పై పెచ్చు బ్రెజిల్‌లోని షెమిలిమీ లేదా బీహార్‌లోని విద్యార్థినులకు సైకిల్ పథకంవంటి సాపేక్షంగా విజయవంతంగా నగదు బదిలీ జరుగుతున్న పథకాలలో పిడిఎస్ నగదు బదిలీ పథకాన్ని పోల్చలేము. అదేవిధంగా బీహార్‌లో సైకిల్ పథకం అనేది నగదు ప్రోత్సాహక పథకం. అంటే ఒక బాలిక పాఠశాలకు వెళ్తే ప్రభుత్వం అదనపు ప్రోత్సాహంగా ఒక సైకిల్‌ను అందజేస్తుంది. ఈ నగదు బదిలీ పథకం నెలవారీగా రేషన్ దుకాణం నుంచి ఆహార పదార్థాలు తీసుకునే కుటుంబాలు కూరగాయలు పాలు, పండ్లు వంటి వస్తువులు కొనుగోలు చేసుకునేందుకు అదనంగా చెల్లించే డబ్బు.

బీహార్‌లో సైకిల్ పథకం అనేది నగదు ప్రోత్సాహక పథకం. అంటే ఒక బాలిక పాఠశాలకు వెళ్తే ప్రభుత్వం అదనపు ప్రోత్సాహంగా ఒక సైకిల్‌ను అందజేస్తుంది. ఈ నగదు బదిలీ పథకం నెలవారీగా రేషన్ దుకాణం నుంచి ఆహార పదార్థాలు తీసుకునే కుటుంబాలు కూరగాయలు పాలు, పండ్లు వంటి వస్తువులు కొనుగోలు చేసుకునేందుకు అదనంగా చెల్లించే డబ్బు.

5. ఈ బిల్లు కింద లక్ష్యంగా పెట్టుకునేందుకు ఆధార్/యుఐడి కోసం సేకరించిన బయోమెట్రిక్ సమాచారాన్ని కూడా ఈ బిల్లు ముడిబెడుతోంది. అయితే పిడిఎస్ కింద ఇక్కడ ప్రధాన సమస్య మరో వ్యక్తిగా అనుకరించి మోసం చేయడం కాదు. దేశంలో కేటాయించిన ఆహార పదార్థాల్లో దాదాపు 58 శాతం వరకూ ప్రయివేటు వ్యాపారులకు దారిమళ్ళడం, లీకేజిలదే సమస్య. ఈ రకంగా దారిమళ్ళడాన్ని అడ్డుకోవడంలో యుఐడి ఏ విధంగానూ సహాయపడదు. పై పెచ్చు ఆధార్/యుఐడి గురించి పార్లమెంటు చర్చించడానికి ముందు యుఐడి కార్డు ఉంటేనే పిడిఎస్ ద్వారా ఆహార ధాన్యాలు పొందే హక్కు ఉంటుందని ఈ బిల్లు షరతు పెట్టాలని చూస్తోంది. ఇది పూర్తిగా చట్టవిరుద్ధం. బయోమెట్రిక్ సమాచారం కచ్చితత్వంపై తీవ్ర ప్రశ్నలు తలెత్తిన సందర్భంలో ఈ బిల్లులో దానికి సంబంధించి ఎలాంటి నిబంధనలూ లేవు.

6. ఆహార భద్రతకు సంబంధించిన అన్ని ప్రధాన నిర్ణయాలు, విధాన నిర్ణయ హక్కులను కేంద్ర ప్రభుత్వం వద్దే కేంద్రీకృతమై ఉండాలని కూడా ఈ బిల్లు భావిస్తోంది. అన్ని హక్కులనూ కేంద్రం వద్ద పెట్టుకోవడం ద్వారా రాష్ట్ర ప్రభుత్వాలపై స్వారీ చేయాలని చూస్తోంది. ఈ బిల్లు గనుక ఆమోదం పొందితే తన ప్రజలకు ఆహార భద్రతను కల్పించేందుకు రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యామ్నాయ విధానాలు అనుసరించే అవకాశం కూడా ఉండదు. అందులోని సానుకూల చర్యలైన ఉచిత మధ్యాహ్న భోజన పథకం, గర్భిణీలు, పాలిచ్చే తల్లులకు ఆరు మాసాల పాటు వండిన ఆహారం పెట్టడం, నిరాధారంగా ఉన్న వ్యక్తులు, వలస కార్మికులు, ఆకలిగొన్న వారికి కమ్యూనిటీ కిచెన్లు వంటి వాటికయ్యే ఖర్చును కూడా రాష్ట్ర ప్రభుత్వాలపై రుద్దాలని ఈ బిల్లు చూస్తోంది. అందువల్ల ఈ ప్రతిపాదిత ఆహార భద్రతా బిల్లు అనేక విధాలుగా తిరోగామిగా ఉంది. ఇప్పటికే కోతలతో ఉన్న పిడిఎస్‌లో అది మరిన్ని కోతలు విధించే దిశగా ఉంది. సార్వత్రిక కవరేజి, తగ్గింపు ధరలు ఉండేలా, ఈ బిల్లు కింద లభించే ఆహార వస్తువుల సంఖ్యను పెంచుతూ బిల్లుకు ప్రాథమిక సవరణలు చేయాలని ఐద్వా డిమాండ్ చేస్తోంది.

*

# శ్రీమతి ఆరుట్ల కమలాదేవి

- డా॥వకుళాభరణం లలిత



కమలాదేవి అనగానే మనకు గుర్తుకు వచ్చేది కమలాదేవి ఛటోపాధ్యాయ. ఆమె ఒక ఆదర్శ మహిళ. తమ భార్యలనో, బిడ్డలనో కమలాదేవి లాగా దేశం కోసం తీర్చిదిద్దుకోవాలనే ఆసక్తి ఉన్న కొందరు కమలాదేవి పేరు పెట్టుకోవటం సహజమే.

కమలాదేవి అనే పేరు గల రుక్మిణి 1920లో నల్గొండ జిల్లా ఆలేరు మండలం మంతపరి గ్రామంలో పుట్టింది. ఎల్లారెడ్డి, లక్ష్మీనరసమ్మ దంపతులకు పుట్టిన రుక్మిణి ఆరుట్ల కమలాదేవిగా మారుతుందని ఎవ్వరూ ఊహించరు.

ఆరోజుల్లో చదువుకోవటానికి పాఠశాలలు లేవు. అందులోనూ ఆడపిల్లలు చదువుకునే అవకాశమే లేదు. అమ్మ దగ్గర ఇంటి పనులు నేర్చుకునే వయసులోనే మేనమామ కొడుకు ఆరుట్ల రామచంద్రారెడ్డితో వివాహం జరిగింది. భార్య కమలా దేవి విద్యావంతురాలు కావాలని పట్టుబట్టి విద్యావంతురాలిగానే గాక, నాయకురాలిగా తీర్చిదిద్దారు రామచంద్రారెడ్డి.

కమలాదేవి అత్తగారిది కొలనుపాక గ్రామం. మగపిల్లలకు మాత్రమే ఒక పాఠశాల ఉండేది. ఆడపిల్లలకు పాఠశాల లేకపోవటంతో, పాఠశాల నెలకొల్పటం తక్షణ కర్తవ్యంగా భావించి పదివేల విరాళంతో ఆడపిల్లలకు పాఠశాల ఏర్పడ్డా, నైజాం పాలనలో పాఠశాలలు, గ్రంధాలయాలు, పఠనాలయాలకు తావులేదు. రాజకీయ సమావేశాలను బహిరంగంగా జరుపుకునే అవకాశమేలేదు. ఫలితంగా ఆ పాఠశాలను, గ్రంథాలయాన్ని స్వాధీనపరచుకుంది నైజాం ప్రభుత్వం.

మనసుంటే మార్గం దొరక్కపోదు అన్న ధీమాతో జైనమందిరంలోనే విద్యను బోధించటం మొదలుపెట్టింది కమలాదేవి. తాను మూడోక్లాసులో చేరి 1939లో మెట్రిక్యులేషన్ పూర్తిచేసి, తాను నేర్చుకున్న విద్యను తోటి స్త్రీలకు నేర్పటం ప్రారంభించింది ఆమె.

ఆ విధంగా పాఠశాల నిరాటంకంగా సాగింది.

చదువుకునే రోజుల్లోనే నిజామాబాద్, షాద్‌నగర్, మల్కాపురం, చిలుకూరు, ఖమ్మం మొదలైన ప్రాంతాల్లో జరిగిన నిజాం రాష్ట్ర ఆంధ్రమహిళా సభల్లో వాలంటీరుగా పనిచేసి తన నిర్వహణాశక్తిని చాటుకోవటమే గాక, నిజాం రాష్ట్ర మహిళా సంఘానికి మూడు సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేశారు.

అవి రెండో ప్రపంచ యుద్ధరోజులు. శత్రువులు దాడి జరిపితే పిల్లలకు, స్త్రీలకు హాని కలిగే పరిస్థితులు అవి. తమ మాన ప్రాణ రక్షణ కోసం శిక్షణ పొందాల్సిన అవసరం ఏర్పడింది. అప్పటికే డాక్టరు శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబ, కమ్యూనిస్టు పార్టీ అధ్వర్యంలో శిక్షణా శిబిరాలను నిర్వహించేవారు. ఆయుధ ధారణ నేర్పేవారు. కమలాదేవి 1943లో కమ్యూనిస్టు పార్టీలో చేరటంతో శిక్షణలో చేరి క్షుణ్ణంగా నేర్చుకోవటమేగాక గ్రామగ్రామాల్లో తిరిగి ఆత్మ రక్షణ విద్యను నేర్పారుకూడా. తోటి మహిళలను విద్యావంతులుగా చేయటానికి ఆమె పడ్డ తపన వర్ణనాతీతం. వయోజనులైన స్త్రీలకు పాఠశాలలు ఏర్పరచి స్త్రీవిద్య కోసం కృషి చేశారు.

ఆనాడు గ్రంథాలయాన్ని మరోపేరుతో 'వంటశాల' అని సంభోదించేవారు. అది 'వంటశాల' కాదు గ్రంథాలయమనీ, పాఠశాల అనీ గుర్తించారు నిజాం జాగిరుదారులు. నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వెట్టిచాకిరికి వ్యతిరేకంగా పోరాటం కొనసాగింది. అంతవరకు జాగ్దీరుదారులు, వాటిని కూడా మట్టుపెట్టారు. నాడు పోలీసుపటేళ్ళు, రెవెన్యూ అధికారులు పేద ప్రజానీకం చేత వెట్టిచాకిరి చేయించుకునే వారు. వెట్టిచాకిరి మూర్తయితేనే తమ సొంత పనులు చేసుకోగలిగేవారు. భర్తతోను మరియు రావి

**చదువుకునే రోజుల్లోనే నిజామాబాద్, షాద్‌నగర్, మల్కాపురం, చిలుకూరు, ఖమ్మం మొదలైన ప్రాంతాల్లో జరిగిన నిజాం రాష్ట్ర ఆంధ్రమహిళా సభల్లో వాలంటీరుగా పనిచేసి తన నిర్వహణాశక్తిని చాటుకోవటమే గాక, నిజాం రాష్ట్ర మహిళా సంఘానికి మూడు సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేశారు.**

నారాయణరెడ్డిగారితోను కలిసి వెట్టిచాకిరి రద్దు విషయంలో కమలాదేవి తీవ్రంగా కృషి సల్పింది. కొలనుపాకలో ప్రారంభమైన ఈ ఉద్యమం తెలంగాణా ప్రాంతమంతా పాకింది. కమలాదేవి విశ్రాంతి లేకుండా ఊరూరా తిరుగుతూ ప్రజల్లో చైతన్యాన్ని కలిగిస్తూ ప్రచారం చేయటం సామాన్యవిషయం కాదు. వినునూరి రామచంద్రారెడ్డి వంటి నిరంకుశుల దౌర్జన్యకాండనుంచి ప్రజలను తప్పించగలగటం, ఆ ఉద్యమ తీవ్రతను స్పష్టం చేస్తుంది. దేవరుప్ప, కడివెండిలాంటి గ్రామాల్లో నెలకొల్పిన శిబిరాలు ఆ ఉద్యమ పటుత్వానికి మచ్చుతునకలు.

దేశానికి స్వాతంత్ర్యం సంప్రాప్తమైనా, తెలంగాణాలో ఆవరించిన చీకటి అంతం కాలేదు. పాలకులు రజాకార్లు, రిజర్వు పోలీసులతో చేసిన దమనకాండ వర్ణింపనలవికానిది. ప్రజల ధన, మాన, ప్రాణ రక్షణ లేకుండాపోయింది. ఈ పాలకుల నిరంకుశత్వమే తిరుగుబాటుకు అంకురార్పణ చేసింది. ఉద్యమ అవసరాలు, పరిస్థితులనుబట్టీ, వారు నిర్వహించే గెరిల్లా దళంలో కమలాదేవి ప్రవేశించారు. ఆయుధాలు ధరించి నల్గొండ, వరంగల్లు, కరీంనగర్ జిల్లాల్లో అధికారుల కళ్ళు కప్పి, మెరుపు దాడులను ప్రారంభించారు. భువనగిరిలో గెరిల్లా పోరాటాన్ని కొనసాగిస్తూ నిజాంకు, జాగీరుదారులకు, భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడారు. వాళ్ళ స్వాధీనంలో ఉన్న భూములను హస్తగతం చేసుకుని దాన్ని పేద ప్రజలకు పంచారు. రైతాంగ ఉద్యమంలో ఇది ఒక చరిత్రాత్మకమైన ఘటన.

ఈ సాయుధ పోరాట ఉద్యమంలో వేలాది మంది మరణించారు. కొందరు అడవుల్లో తలదాచుకున్నారు. కమలాదేవి, రామచంద్రారెడ్డి భువనగిరి ప్రాంతంలో ఉండిపోయారు. అడవుల్లో ఎవ్వరికీ కన్పించకుండా దాక్కున్న సైన్యం వారిని చుట్టుముట్టింది. తరుణోపాయం లేక ఎవరిపాటికి వారు విడిపోయి ఇద్దరూ

**చివరకు 1949లో బహదూర్‌పేట శివార్లలో కమలాదేవి అరెస్టుకాక తప్పలేదు. నల్గొండ జైలులో 6 నెలలు, వరంగల్ జైలులో 6 నెలలు, ఔరంగాబాద్ జైలులో సంవత్సరం, సికింద్రాబాద్ జైల్లో 6 నెలలు, మొత్తం రెండున్నర సంవత్సరాలు జైలు జీవితాన్ని గడిపారు.**

తప్పించుకున్నారు.

1944లో మగబిడ్డ పుట్టాడు. 'విప్లవ్' అనే పేరుపెట్టారు. ఆ బాబుని అత్తగారివద్దా, బంధువుల దగ్గరా వదిలిపెట్టి ఉద్యమంలో పనిచేశారు. రామచంద్రారెడ్డికి తుపాకీ దెబ్బ తగిలిందని తెలిసి హైద్రాబాద్ వచ్చారు కమలాదేవి.

చివరకు 1949లో బహదూర్‌పేట శివార్లలో కమలాదేవి అరెస్టుకాక తప్పలేదు. నల్గొండ జైలులో 6 నెలలు, వరంగల్ జైలులో 6 నెలలు, ఔరంగాబాద్ జైలులో సంవత్సరం, సికింద్రాబాద్ జైల్లో 6 నెలలు, మొత్తం రెండున్నర సంవత్సరాలు జైలు జీవితాన్ని గడిపారు. జైళ్ళు అధ్వాన్న పరిస్థితుల్లో ఉండేవి. ఉదయం జొన్న సంకటి. రాత్రి జొన్న రొట్టెలు ఆహారం. అందులో రాళ్ళు, పురుగులు ఉన్నా అవి తినటం తప్పలేదు. జైలు అధికారులు ఇవ్వాల్సిన రేషను ఇస్తే, తామే ఆహారాన్ని తయారుచేసుకుంటామని చెప్పినా, అధికారులు ఇచ్చేవారు కాదు. జైలుశిక్ష అనుభవిస్తున్న స్త్రీలు, వాళ్ళ పిల్లలు నానా యాతనలు పడేవారు. భరించలేక చివరకు ఒకనాడు వృద్ధులు, యువతులనే తేడా లేక నిరసన వ్రతం పూనుకున్నారు. దాన్ని సహించలేని జైలు అధికారులు కమలాదేవిని ఔరంగాబాదు తరలించారు. సరైన ఆధారాలు దొరక్కపోవటంతో ఆమెపై కేసును కొట్టివేశారు.

అప్పటికి నైజాం ప్రభుత్వాన్ని తన అధీనంలోకి తెచ్చుకునేందుకు 1948 సెప్టెంబరు 13వ తేదీన భారత ప్రభుత్వం సైన్యాన్ని దింపారు. ఐదు రోజుల ప్రతిఘటనలో నైజాం రాష్ట్రం స్వతంత్ర భారతదేశంలో ఐక్యమైంది. అనేక చర్చోపచర్చలనంతరం కొండల్లో, కోనల్లో తల దాచుకున్న నాయకులు, ప్రాణాలకు తెగించి పోరాడిన ప్రజలు, సాయుధ పోరాటాన్ని విరమించి, స్వతంత్ర భారతావనిలో పౌరులైనారు. ఉద్యమం ఇంకా కొంతకాలం కొనసాగించాల్సిన పరిస్థితి ఉందని నాయకులు భావించారు.

నైజాం పాలన ఉన్న జైళ్ళ ప్రతిరూపాలే స్వాతంత్ర భారతావనిలో ఉన్న జైళ్ళు. ఆనాటి పరిస్థితులను ఆకళింపు చేసుకోవటానికి కొంతకాలం వేచి ఉండాల్సిన పరిస్థితి ఏర్పడింది. చిట్టచివరకు 1951 జైలు నుండి విడుదలయ్యారు.

జైలు నుండి విడుదల కాగానే ఎన్నికల పర్వం ప్రారంభమైంది. 1952 ఎన్నికల్లో భువనగిరి నుంచి శాసనసభకు ఎన్నికయ్యారు. కమలాదేవి. తర్వాత 1967 వరకు ఎం.ఎల్.ఏగా కొనసాగుతూ సుందరయ్యగారు ప్రతిపక్ష నాయకులుగా పనిచేసినప్పుడు, తాను డిప్యూటీ నాయకురాలిగా పనిచేయటం, ఆయన చికిత్సకు మాస్కో వెళ్ళినప్పుడు ప్రతిపక్ష నాయకురాలిగా ఎంతో సమర్థవంతంగా పనిచేశారు. నల్గొండ జిల్లా సమితి, రాష్ట్ర సమితుల్లో సభ్యురాలిగా పనిచేశారు. 1966లో రాష్ట్ర మహిళా సంఘ ప్రధాన కార్యదర్శి ఉండగా బల్గేరియా, చెకోస్లోవేకియా, జిడిఆర్, ఆస్ట్రియా, సోవియట్ యూనియన్ తదితర దేశాలు పర్యటించారు.

మద్యపాన నిషేదానికి తన వంతు కృషి చేశారు. తోటి మహిళలతో కలిసి ఊరేగింపులు, ప్రదర్శనలు, సభలు, నిర్వహించారు.

ఆరుట్ల కమలాదేవి శాంతి కాముకురాలు. ధనప్రాణ నష్టాన్ని ఆమె హర్షించలేదు. పీడిత ప్రజల విముక్తం చేయటానికి అవిరళ కృషి సల్పారు. స్వాతంత్ర సమరయోధులకు ప్రతినిధి ఆరుట్ల కమలాదేవి.

*



# "శాపేలు దాగితే సెరువెండుద్దా...సారూ?"

– విద్యాసాగర్

సోమవారం ప్రజా విజ్ఞప్తుల దినం. ఐడిటిఎ కార్యాలయం, పాలవంచ.

–"అమరారవు నాయకపోళ్ళకు బూమిచ్చిండ్రంట గదా" అంది కొంచెం పొట్టిగా, నల్లగా ఉన్న నలభై, నలభై అయిదేళ్ళ వయసున్న ఓ కోయ స్త్రీ.

ఆమె ఒక్కతే రాలేదు. ఆ వెనక కనీసం ఇంకో ఇరవై మంది స్త్రీలున్నారు. వీళ్ళందర్నీ చూస్తే ఓ పది రోజుల కిందట అమరారం, కోమట్లగూడెం నుండి కట్టుగా వచ్చిన పదిహేను మంది స్త్రీలు గుర్తొచ్చారు. వాళ్ళ పట్టుదల మెచ్చుకోదగింది. గ్రామాల్లో ఉండేవాళ్ళకు విషయాలు తెలీవనుకుంటాం గానీ, వాళ్ళు తెలుసుకోదగిన విషయాలు తొందరగానే తెలుసుకుంటారు. మనకులా ఊసుపోక చెప్పుకునే కబుర్లు మాత్రమే పెద్దగా పట్టించుకోరువాళ్ళు.

–" ఒక్క అమరారపు వాళ్ళకే గాదు, కోమట్లగూడెం వాళ్ళకు కూడా ఇచ్చారు సరే, మీ ఊళ్ళో కూడా మిగులు భూమి ఉందా?" అని అడిగాను నేను.

– మావూరి దగ్గర కూడా ఐదొందల ఎకరాల బూవుంది గానీ ముప్పై ఏండ్ల నుంచి ఫారెన్నట్ట సార్లతో కొట్లాడి కొట్లాడి అలిసిపోయినం. దాని గురించి మాట్లాడితే ఏం లాభం? ఇప్పుడు అందుకు రాలే" అంటూ ముందుకొచ్చింది గుంపులో ఎక్కడో మధ్యలో ఉన్న ముసలమ్మ. పొడుగ్గా, చామనఛాయలో ఉంది. విశాలమైన నుదురుతో, ఉత్సాహం నిండిన కళ్ళతో ఉన్న ఆమెను చూడగానే చక్కని తల్లి అనే భావం కలిగింది నాకు. ఆమె వయసు ఏభై–ఏభైఐదేళ్ళ మధ్య ఉండొచ్చు. ఆమె పేరు సాయం పున్నమ్మ.

– "మరెందుకొచ్చారమ్మా"? అన్నాను.

–"మేమందరం దొర్ల మామిడి తోటల్లో పనిజేస్తం. ఎల్లకాలముండదు గదా పని. అందుకని ఇంకేదన్న పని చేసుకుంటె బాగుంటుందని అనుకున్నం. మొన్న కోమట్ల గూడెపు ఆడమనుసులకు పట్టలిచ్చినరంట గదా. అట్లనే మా ఊరి మనుసులగ్గూడ అందరికి కలిపి ఏదైనా ఇస్తే బాగుంటది. పొయిన వారమెచ్చినంగానీ నువ్వప్పుడె బద్రచలం బొయినవంట" అంది పున్నమ్మ.

–"మీకేం కావాలో మీరే చెప్తే మంచిది గదమ్మా."

–"ఇంటికి రెండు బర్లు ఇయ్యండి. మామిడి తోటల్లో గడ్డి దొరుకుతది. మీరిస్తే మేంగూడ సెట్లు బెంచుతం. ఇంకొకరి తోటలో గడ్డి కోసం ఎన్ని రోజులు బోతం".

–అక్కడొకరికి, అక్కడొకరికి బర్రెలు ఇవ్వడం జరిగింది గానీ, వాటిని సక్రమంగా పోషించుకుని బాగుపడిన వాళ్లు చాలా తక్కువమందమ్మా. భద్రాచలం మండలంలో ఈ మధ్యనే అన్ని ఏర్పాట్లు చేసి పక్కపక్కనే ఉండే ఓ ఐదు గ్రామాల వారికి బర్రెలు ఇచ్చాం. అదెట్లా ఉంటుందో చూశాక గానీ మళ్ళీ వేరే గ్రామాలకు ఇవ్వదలచుకోలేదు.

–"మరి వాళ్ళు పాలెక్కడ అమ్ముతారు"

–"భద్రాచలం గురుకుల పాఠశాలకు."

–"మేం పాల్లెక్కిన్కు సార్లకమ్ముతం. నువ్వవుననంటె"

–"ఇంతమంది పాలమ్మితే కొనేవాళ్ళుండాల గదా".

–"బూర్గంపాడు దగ్గరెకద. కొంతమంది అడికిబొయి అమ్ముకుంటం. భద్రాచలం దార్లో లారీలాగే మలుపులో హోటల్లున్నయి గద. వాళ్ళకూడ బోస్తం" అంది తెలివిగా పున్నమ్మ.

తమకేది అనుకూలమో, దాన్ని ఎలా నిర్వహించుకోవాలో, ఏమైనా ఇబ్బందులొస్తే

వాటినెలా ఎదుర్కోవాలో ఇంత జాగ్రత్తగా ఆలోచించుకుని అది ఇస్తే మేము ఖచ్చితంగా ఏదో సాధిస్తామంటూ తామంతా కలిసి ఏదో ఒక పనిచేయదలుచుకున్న ఈ కోయ మహిళ ఉత్సాహాన్ని ఇంకా పరీక్షించడం అనవసరం అనిపించింది. పది రోజుల తరువాత కన్పించండి అని చెప్పి పంపాను.

పది రోజులు గడిచాయి. ఆ గ్రామ వివరాలు తెలుసుకున్నాం. వేరే పనిమీద ఆ గ్రామం మీదుగానే వెళ్ళాం కానీ మేం వాళ్ళను పలకరించలేదు.

పదిహేనురోజుల తరువాత ఓరోజు క్యాంపు నుంచి కొంచెం తొందరగా తిరిగి వచ్చాను. ఇంటికి వచ్చిన గంటలోపుల అటెండరు భూషయ్య వచ్చి- 'అయ్యా టేకుచెట్ల అరుగుల మీద కూర్చుని ఉన్నారు లక్ష్మీపురం వాళ్ళు ఇరవై మంది పైన ఉంటారు పిలవాల్నా?' అన్నాడు.

-"పిలువు"అన్నాను.

దాదాపు పోయినసారి వచ్చిన వాళ్ళంతా వచ్చారు. మరో ఐదారుగురు ఎక్కువే వచ్చినట్టున్నారు. గుంపులోంచి ఆ పొడుగ్గా, చామన ఛాయలో ఉన్న ముసలమ్మే ముందుకు వచ్చి-

-అయ్యా నీ జీపు జూసిండంట మా రాంబాబు. వచ్చి చెప్పిండు. అందుకనె ఇప్పటికిప్పుడె రావాలనుకున్నం. వచ్చినం".

-అందరూ ఎక్కడికి పోకుండా ఊళ్ళోనే ఉన్నారా?"

-"అనుకొని ఉన్నం. పొద్దున్నె రావాలనుకున్నం. నువు బయలెల్లినవంట. అందుకని ఇంగ సాయంత్రం వద్దమను కున్నం. ఇంతలోపల రాంబాబు జెప్పిండు. నీ జీపు ఇప్పుడె పాలంచబొయిందని".

-"నేనెక్కడికైనా మళ్ళీ వెళ్లిపోయి ఉంటే?".

-సోమవారం నీకు కుదర్దయ్యా మాట్లాడ్డానికి. మామాట ఇవరంగా ఇనాలెనువు. అందుకే ఈరోజొచ్చినం" అంది పున్నమ్మ.

-"సరేనమ్మా మంచిదే. మరి మీరు పాతికమంది దాకా ఉన్నట్టున్నారు గదా. ఇంతమందికి పశువులిస్తే అందరూ వాటిని సరిగ్గా పోషించలేకపోవచ్చు. ఎంత వద్దని చెప్పినా మీరు పశువులే కావాలంటున్నారే" అన్నాను.

-అయ్యా పసువులెందుగ్గావాలంట మంటే సెప్పమంటారా? వానాకాలంల అవేడ దిరిగినా మేత దొరుకుద్ది. ఎండకాలంల అడివి దగ్గరుంది కాబట్టి అయ్యే పోయి తిరిగొస్తయి. ఇంక వొరుపుకాలంల మా తిప్పలు మేం బడతాం. మామిడి తోటల్ల ఎంతో కొంత గడ్డిగాదం దొరుకుద్ది. మా వనులు వేం జూనుకుంటనే వాటిని సాక్కుంటాం". అని మళ్లీ తనే అంది పున్నమ్మ.

-"నువ్వు జెప్పింది కూడా రైటేనయ్య.యింత మంది కొక్కసారిగ అదీ అందరి కొకటే ఎందుకియ్యాల. కొంతమంది సరిగ్గ జూసుకుంటారు కొంతమంది సరిగ్గ జూసుకోలేరు. -"అట్టయితే ఒక పన్జేస్తం. మాలో ఎవురెవరికేది బాగుంటదో మేమే మాట్లాడుకున్నం. సెప్పమంటావా?"

-"అలాగే చెప్పమ్మా".

-"యిదో యీ నర్సమ్ముండదే ఆమె కొడుక్కే మొన్న నువు కోడిపిల్లలిచ్చింది. మల్ల అదె యింట్లో యింకొకరికి కెందుకనుకుంటే నాకొద్దులే అంటుండదామె. యింగ యీ మల్లమ్మకూ, బిచ్చమ్మకూ, గౌరమ్మకూ, సీటెమ్మకూ,పాపమ్మకూ ఎంతో కొంత బూవుండది తలా రెండెకరాలకు పైన. యీళ్ళకు మొదాలె సెట్లియ్యండి. దేశమంత సెట్లిన్నుండది ఐటిడిఎ. మా వూర్లో దొర్లుబెట్టింద్రు గద అండ్ల పన్జేస్తం గద. మాకంత దెలుసు. అట్ల యీల్లగ్గూడ సెట్లిస్తే అండ్ల బెరిగిన గడ్డి మేం గోసుకుంటాం. ఏమమ్మా పాపమ్మ నువ్వేమంటావు?" అంటూ ఆగిపోయింది పున్నమ్మ.

-"న్వు జెప్పినట్టేలే అత్తా" అంది పాపమ్మ.

-" మరి యింకా పందొమ్మిది మంది ఉన్నారుగదా బర్లకోసమే"? అన్నాను పున్నమ్మ నాయకురాలితనాన్ని లోలోపులే మెచ్చుకుంటూ.

-"యింకా పందొమ్మిది మందుండారు? అసలెంతమందికి బర్లిస్తవో నువు జెప్పయ్యా? మల్లవేం మాట్లాడుకుంటాం."

-"పది మందికైతే సరిగా ఉంటుంది" అన్నాను.

-"నాయన్నాయన, బూవిలేనోళ్లమే పదిమందిపై నుండాం. మరి పదిమందికే యిస్తే ఎట్టా?".

-"అసలు భూమిలేని వాళ్ళకు పశువులివ్వడం మంచిది గాదు. సొంత భూమి లేకుంటే రోజూ పచ్చిమేత ఎక్కడ్నుంచి వస్తుంది? పచ్చిమేత కోసం మీరు యిబ్బంది పడతారు. ఈ లోపు పశువు పాలివ్వడం మానేస్తుంది. దూడలు ఒక్కోసారి చచ్చిపోతాయి." అంటుండగా మధ్యలోనే అందుకుని పున్నమ్మ.

-"నాయన్నాయన నువ్వట్టంటే ఎట్ల. సరే పచ్చిమేత లేదన్నవుగద. మరైతే ఒక ముప్పై ఎకరాల భూమి ఫారెస్టోళ్లు వాళ్ళదంటున్నరు. దాన్నెట్టయిన మేం జేస్తం. మాగ్గూడ మొక్కలియ్యండ్రి మొక్కలొచ్చిన కాడ గడ్డి మెలుస్తది గద."

-"అంతగా అయితే కొంత భూమిలో గడ్డి కూడా పెంచొచ్చు గదమ్మా"

-"అదే నాయన. నువవునంటె గవర్మెంటు సల్లగుంటె అన్ని వస్తయి. మరి పది మందికి పైన బర్లు యిస్తవుగద."

-"సరె యింకొక ఐదు మందిగ్గూడ యిస్తాం. అంటే పదిహేనుమందికి. అయినా యింకా నలుగురు మిగిలున్నారు గదా" అన్నాను.

కాని నా మనసులో మాత్రం అసంతృప్తిగానే ఉంది. నోటిమాటతో పదిని, పదిహేను చేయడానికి నేనెవడ్ని? అన్పించింది.

-"గవర్మెంటుకు మా మీద శర్దొచ్చింది సారూ. ఆ నలుగురికి మేకలియ్యండ్రి సారు. గొర్లొద్దులె. అడివుండది గద, అయ్యే పోయి మేసొస్తయి."

-"ఫారెస్టు సార్లు మేకలిస్తె ఒప్పుకోరు గదమ్మా. మేకల వల్ల అడివి తరిగిపోతుందట తొందరగా."

–"బాగా సెప్పినవుసారు. ఫారెస్టు సార్లొచ్చింతరవాత బుట్టినాయి మేకలు? తాతల ముత్తాతల నాట్నుంచి మేకల్లేవు? అయి అడిడవిలో మేస్తలేవు? యిప్పుడు ఫారెస్టు సార్లు మేకలు మేస్తే అడివిదరుగుద్దంటె శాపలు దాగి సెరువెండిందన్నట్టున్నది నాయనా. అయినా సార్ల మీద కోప్పడితె మంచిది గాదు. మరెట్ట నాయనా. యింగ యీ నలుగురికేమిస్తవో నేవ్వె జెప్పు" అంది పున్నమ్మ.

పున్నమ్మ వాదనా పటిమ అమోఘం. తను సమంజసమనుకున్నదాన్ని ఎంత చక్కగా చెప్పింది పున్నమ్మ! ఫారెస్టు వాళ్లు ఒప్పుకుంటారా లేదా అనే సందేహం కన్నా తామేది చేయగలమో కారణాలతో సహా పున్నమ్మ చెప్పిందానికి తిరుగులేదనిపించింది.

"సరేనమ్మా యీ నలుగురికి మేకలు యిద్దాం" అన్నాను చివరికి.

–"యింగ జూడండి సారు. నువ్వు వారానికొకసారి మా వూరు రావాలె. నువ్వు రాకపోతే నువ్వు బద్రశలం బొయ్యేటప్పుడు దార్లో నీ ఎర్రజీపుపాపుతం. మా వూరు దీసకపోతం. నువు మెచ్చాలె. మా వూరోళ్లం మారాలె". అంది ద్విగుణీకృతమైన ఉత్సాహంతో పున్నమ్మ.

ఆ ఉత్సాహాన్ని నీరు గార్చడం హాస్యాస్పదమే అన్పించింది.

పున్నమ్మ నాయకత్వానికి మెచ్చీ. వూళ్ళో అందర్నీ కూడగట్టుకోవడం చూసి ప్రాజెక్టు పశు సంవర్ధక అధికార్లు నరసయ్యగారూ, రాఘవేంద్రగారు దాదాపు లక్ష్మీపురంలో మకాం వేశారు. రెండ్రోజులకోసారి లక్ష్మీపురం మా చర్చల్లోకి వచ్చేది.

"సమగ్ర గ్రామాభివృద్ధికిది గుర్తు కావాలి సార్" అంటూ ఉద్యాన శాఖాధికారి మురళీధరరావుగారు ఓ ముప్పై ఎకరాల్లో జీడి, మామిడి, జామ మొక్కలు నాటించేశారు. బైట నుంచి ఎవరొచ్చినా ఐటిడిఏ అభివృద్ధి కార్యక్రమాలు చూపించడానికి లక్ష్మీపురమే సరిపోయేది. మేమేదో చేశామని గొప్పలు చెప్పుకోవడానికి సూక్ష్మంలో మోక్షంలా తయారైందీ లక్ష్మీపురం. పున్నమ్మపురమంటే బాగుంటుందేమో! కానీ యిప్పుడెలావుందో పున్నమ్మ. ఆమె ఊరు?............?

**("భద్రాచలం మన్నెం కతలు" నుండి)**

•

# అమ్మ కడుపులో ఆడపిల్ల

**(ఓ ఆదివాసీ తండ్రి అంతర్మధనానికి ప్రతిధ్వని ఈ కవితా రవళి)**

– పొన్నాడ కుమార్

1. ఓ గర్భస్థ శిశువా! ఏమి తపంబొనర్చి జనియించిన వారమో
ఈ గహనాంతర సీమల శ్రమించు మాకు నీ తలిదండ్రుల మవ
దగు భాగ్యము కల్గెనిపుడు। నేను నీ అయ్యను, మీ యమ్మ ఒడిలో నేతలదా
ల్చగా నీ రోదన వినంబడె; అమ్మ కడుపులో నీవు కదలాడగన్।

2 .ఓ గర్భస్థ శిశువా! నువ్వొక ఆడపిల్లవని ముందు తెల్పె డాక్టరమ్మ స్కానింగు చేసి,
మగువను మైనస్ అననేల? మగ గుంటడు ప్లస్సా? ఈ మానవ జీవిత
గణితమ్మున 'ప్లస్సు–మైనస్సు'ల విలువొకటేనని గ్రహించరేల మూర్ఖాళి?
గగనమ్మునకెగురు నెత్తురు గద్దవు। యోగమాయవు।నీకు వెరుపా? ఏల ఏడ్చెదో?।

3. ఓ గర్భస్థ శిశువా।ఏడువకమ్మ।। ఏడువకు।। భయపడకమ్మ తల్లీ।।।
నాగరికులవోలె భ్రూణహత్య చేయగజాల! 'కేర్‌కేర్'అనుచు
పుట్టగ (వంటకై తెచ్చిన') వండ్ల గింజలు నీ నోటగుప్పి నిను చం
పగజాల। చెత్తకుండీల నిను పాల్జేయగజాల।। నిన్నాకటికిన్ గొనిపోయి, అల్లకర్కో
ట, కిరాత, కీచక 'గల్ఫుకంత్రీల' కమ్మగజాల। అపాత్రులకు కన్యాదన మి
వ్వగజాల। నమ్ము। హర్యానాలో ఆడపిల్ల కరువేనట; ఆంధ్రాలో ఆడపిల్ల బరు
వా? కాదు।కాదు।। కాకూడదు।।। ఆడపిల్లగానె పుట్టి, జాతి రత్నంబొకటి మే
నం గట్టుకొని మేలిమి బంగరు బిడ్డలనిమ్ము। మాతృశ్రీవై పుత్రికా।।

4. జగద్విఖ్యాత ("కామాక్షీ తాయి'గ) దుర్గమ్మగా నీకు పేరెట్టి తిమమ్మ ముందుగ;
అమ్మ కడుపులో నుండగ। ఇకపుట్టుమమ్మ। పుత్రికా।
ముగ్గురమ్మల మూలపుటమ్మ చాలా పెద్దమ్మ నిను రక్షించుగాక! సదా బ్రోచుగాక
ఈ గణనీయ అధునాతన వైద్యశాస్త్ర సాంకేతిక పరిజ్ఞాన
మీ గర్భస్థ శిశు సంక్షేమ ప్రయోజనమునకె గాని, క్రూర
ముగ అమ్మ కడుపులోని ఆడపిల్ల హత్యకు కాదని చాటి చెప్పవమ్మ పుత్రికా।।
ప్రాజ్ఞవగుచు

**(మార్చి8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా విశాఖ ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో జరిగిన కవితాగోష్టి కార్యక్రమంలో చదివి వినిపించిన గద్యపద్య కవిత)**

★

# వేదాలు, పంచాంగాలు ఎవరికోసం?

-బి. హైమావతి

శ్రీనివాస గార్గేయ రాసిన 2012 సంవత్సర పంచాంగం పెద్ద చర్చనీయాంశంగా మారడం మనం చూసాం. ఆయన స్త్రీల శరీరంలో వచ్చే సహజమైన మార్పయిన రజస్వల గురించి ఎంత అసభ్యంగా రాశాడో. అది చదివిన ఏ స్త్రీ అయినా చలించకుండా ఉండగలదా? అందుకే ఐద్వా రాష్ట్ర కమిటీ స్పందించి పంచాంగంలో ఈ పేజీని తొలగించాలని, శ్రీనివాస గార్గేయపై చర్య తీసుకోవాలని డిమాండ్ చేసింది. కొందరు ఆడపిల్లల తల్లిదండ్రులు కూడా పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. ఐద్వా, ఇతర మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యంలో డి.జి.పికి, మానవహక్కుల కమిషన్‌కు ఫిర్యాదు చేశాం. మీడియా దృష్టికి తీసుకెళ్ళిన ఫలితంగా కొంత చర్చ జరిగింది. దీని ఫలితంగా తప్పుడు రాతలు రాసిన శ్రీనివాస గార్గేయపై ఐపిసి 292, 509 సెక్షన్స్ కింద కేసు నమోదు అయింది. ఉగాదినాడు గార్గేయను ఎవరూ పంచాంగం చదవడానికి పిలవకూడదని చేసిన డిమాండ్‌తో ప్రభుత్వంగానీ, ఏ రాజకీయ పార్టీగానీ అతనిని పిలవటానికి సాహసించలేదు. ఆ రకంగా శ్రీనివాస గార్గేయను నిరోధించటంలోనూ ఇటువంటి అశాస్త్రీయమైన అంశాలు రాస్తే మహిళలు సహించరు అనే అంశాన్ని బహిర్గతం చేశాము.

అయితే ఈ చర్చలో రకరకాల అంశాలు ముందుకొచ్చాయి. 'పంచాంగాలు ఇప్పుడే పుట్టలేదు. నేను ఒక్కడినే కాదు, ఇతర పండితులు కూడా వ్రాశారు. నేను భారత ప్రభుత్వంచే గుర్తింపు పొందిన మహాపండితుడ్ని, నా పాండిత్యానికి తిరుగులేదు" అని ఆయన వాదించడం కూడా చేశారు.

అసలు ఈ పంచాంగా ఎప్పుడు ఎలా పుట్టాయి? ఎవరికోసం పుట్టాయనేది మనం కూడా పరిశీలించాలి. ముఖ్యంగా స్త్రీలు, అభ్యుదయ వాదులు మరింత అధ్యయనం చేయాలి.

సమాజం తొలిదశలో మానవులకు చదువులేదు. జీవిత అనుభవాల నుండే ప్రకృతిని ఎలా ఎదుర్కోవాలో నేర్చుకున్నారు. కొన్ని లక్షల సంవత్సరాలు సాగిన ఆదిమ సమాజంలో కులాలు, మతాలు, వర్గాలు లేవు. స్త్రీ పురుష అసమానత ఏమాత్రం లేదు. పైగా స్త్రీయే గుంపుకు నాయకురాలిగా, మానవ పునరుత్పత్తికి మూలకారకురాలిగా గుర్తింపబడింది. నమాజ గౌరవాన్ని పొందింది. దేవతలుగా పూజింపబడ్డారు. సమాజ మార్పులో వచ్చిన రాచరిక వ్యవస్థ రాజులు ప్రభువులుగాను ప్రజలందరికీ వారే దేవుళ్ళుగాను ప్రకటించుకున్నారు. ఈ ప్రకటనను ప్రచారం చేయడానికి పండితులు పుట్టుకొచ్చారు. వేదాలు రాశారు. ప్రభువుల్ని ఎంతబాగా పొగిడితే వ్రాతలు వ్రాసే పండితులకు అంత మంచి బహుమతులు, భూములు, బంగారు నాణేలు ఇచ్చేవారు. ఈ కాలంలోనే వచ్చిన చాతుర్వర్ణ వ్యవస్థ ప్రజలను విడదీసింది. ముఖ్యంగా స్త్రీలను మైల మనుషులుగాను, నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి, పురుషులకు ఏమాత్రం సమానులు కాదు. పైగా ప్రభువులంతా పురుషజాతి కదా! అందుకోసం ప్రభువులుకు మొత్తం పురుషజాతికి స్త్రీ లొంగి బ్రతకాల్సిందే అనే సాంప్రదాయాన్ని ముందుకు తెచ్చారు. పండితులు సీత, సావిత్రి, అనసూయ, సతీ సుమతి లాంటి స్త్రీలు భర్తలకు ( స్త్రీలకు భర్తలు, ఆనాటి రాజులు దైవసమానులు) ఎదురు చెప్పకుండా ఎన్ని బాధలైనా భరించారు. కాబట్టే వారిని పతివ్రతలుగా ఈ పండితులు ప్రచారం చేశారు. వందల సంవత్సరాలు స్త్రీ జాతిపై చెరగని ముద్రవేసి ఆ రాతలురాసి రాజుల మన్ననలు పొందారు. అంతటితో కూడా పోరు ఆగలేదు. స్త్రీజాతిని అణచివేయటానికి. చులకనచేసే రచనలు ఈ కాలంలో చాలా వచ్చాయి. మగవాళ్లు చనిపోతే దేవుళ్ళుగా వెలుస్తారు. ఆడవాళ్ళు చనిపోతే దెయ్యాలవుతారని ప్రచారంలో పెట్టారు. ఇప్పుడు చూడండి ఎవర్ని దెయ్యం పట్టినా ఆడదెయ్యం పేరే చెబుతారు. సినిమాల్లో కూడా మగదెయ్యాలు అస్సలు ఉండవు. ఆదిమ సమాజంలో స్త్రీజాతి పొందిన గౌరవాన్ని, ఆమె నమాజానికి నాయకత్వం వహించి నడిపించడాన్ని భరించలేకపోయింది. రాచరిక వ్యవస్థ తరువాత వచ్చిన అన్ని వ్యవస్థలూ కూడా దుష్ప్రచారంలో భాగమే గార్గేయ పంచాంగం. రజస్వల అయిన బాలికలపై వచ్చిన కథనాలు పంచాంగమంటే కాలాన్ని గ్రహాల కదలికల్ని తెలియజేసే ఒక క్యాలండర్. భూగోళం, సూర్యగోళం, చంద్రగోళం, ఇవి కాలక్రమంలో ఒకదాని చాటుకు ఒకటి వచ్చినప్పుడు చంద్రుడు పూర్తిగా కనిపించకపోతే వచ్చే చీకటిని అమావాస్యని, పూర్తి చంద్రుడు కనిపిస్తే పౌర్ణమి అని అన్నారు. ప్రతి 15 రోజులకోసారి ఇవి సంభవిస్తాయి. మధ్యలో వచ్చే పదిహేను రోజులను తిథులు అని పేర్లు పెట్టారు మన పండితులు. పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్థశి, గ్రహాలు, గోళాల పరిభ్రమణానికి మానవుల పుట్టుక, చావులు లేదా స్త్రీలు రజస్వల కావడానికి పురుషులకు గడ్డాలు, మీసాలు మొలవడానికి ఎటువంటి సంబంధం లేదు. దున్నపోతు ఈనిందని ఒకరంటే దూడను కట్టేయ్యండని (పాలు తాగేస్తుందని) ఒకరన్నారట. ఇది పండితులకు సరిగ్గా సరిపోతుంది. దున్నపోతుకు దూడను ఈనే అవకాశమున్నదా లేదా అనే సైన్సుతో వీరికి పనిలేదు. అశాస్త్రీయ పాండిత్యాన్నిచదివి యువతరం ఏమైపోయినా మన పాలకులుకూ పట్టదు. ముఖ్యంగా అనేక ప్రమాదకరమైన ప్రచారాల మధ్య జీవిస్తున్న మహిళా జాతి మేల్కొనాలి. ఏ వ్యాఖ్యలు ఎవరి ప్రయోజనాల కోసం వచ్చాయనే చరిత్రను అధ్యయనం చేయాలి. సర్టిఫికెట్లు పొందే చదువు ఒకటే సరిపోదు, మనల్ని మనం రక్షించుకునే అధ్యయనం ప్రతీ స్త్రీ చేయాలి. ఇటువంటి వ్యాఖ్యలు ఎవరి దృష్టికి వచ్చినా ఖండించగలిగి ఉంటే స్త్రీ శక్తిని, గౌరవాన్ని కాపాడుకోగలం. ●

**స్త్రీజాతిని అణచివేయటానికి. చులకనచేసే రచనలు ఈ కాలంలో చాలా వచ్చాయి. మగవాళ్లు చనిపోతే దేవుళ్ళుగా వెలుస్తారు. ఆడవాళ్ళు చనిపోతే దెయ్యాలవుతారని ప్రచారంలో పెట్టారు. ఇప్పుడు చూడండి ఎవర్ని దెయ్యం పట్టినా ఆడదెయ్యం పేరే చెబుతారు. సినిమాలోకూడా మగదెయ్యాలు అస్సలు ఉండవు.**

## చరమదశ (వృద్ధాప్యం)

# శాపం కారాదు



- ఎన్.ఎస్. లక్ష్మిదేవమ్మ

ఈ రోజుల్లో పిల్లలు యాంత్రిక జీవనానికి అలవాటుపడుతున్నారు. తమకున్న సమయంలోనే కొద్దిపాటి సమయాన్ని తల్లితండ్రులతో గడిపేది ఎందరు? గడపకున్నా పోయింది. తిన్నారా? రాత్రుళ్ళు నిద్రపట్టిందా? మందులు వేసుకున్నారా? ఈ రెండు మాటలు వాళ్ళకెంత ఓదార్పు! తమ పిల్లలకు తమపై ప్రేమ తగ్గలేదని తమను నిర్లక్ష్యం చేస్తలేరని, ఎంతో తృప్తిగా ఫీలవుతారు. ఈ మాత్రం తృప్తిని మనం మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు ఇవ్వలేమా?

చిన్నప్పుడు తల్లిదండ్రుల గుండెలపై తన్నుతూ (ఆడుతూ) పెరిగిన వీళ్ళకు పెరిగి పెద్దైన తర్వాత తల్లిదండ్రులు బరువవుతారా? ఒక్క పలకరింపు చాలు గుండె బరువు తగ్గించుకోవడానికి.

చిన్నప్పుడు అమ్మ కొంగు పట్టుకుని అమ్మా! అమ్మా! అంటూ తిరుగాడే పిల్లలే పెద్దయ్యాక అమ్మా నాన్నలతో 5 నిమిషాలు గడపటానికి, మాట్లాడటానికి సమయం దొరకదు. కానీ దురదృష్టమేమిటంటే అదే కరువు చేస్తారు కనికరం లేని పిల్లలు.

ఇంటిల్లిపాది తిన్నాక మిగిలితే తినడం, లేకపోతే పస్తులతో పడుకోవడం అమ్మలకే అలవాటే! పిల్లలు తింటే చాలు తన కడుపు నిండినంత ఆనందం అమ్మకు. ఇక్కడ నేనెక్కడో చదివిన చిన్న గేయం గుర్తొస్తుంది. ఇక్కడ ఒక పిల్లవాడు వాళ్ళ అమ్మను అడుగుతాడు ఆకలిగొని.

పిల్లవాడు: నాకు ఆకలి వేస్తోంది అమ్మ.

అమ్మ: నాకూ ఆకలి వేస్తుంది

పిల్లవాడు: నీ ఆకలి నా ఆకలి ఒకటేనా అమ్మా! అంటాడు.

అమ్మ: నాకు రెండు ఆకళ్లు బాబు ఒకటి నీది రెండోది నాది అంటుంది. అలా ఉంటుంది అమ్మ మనసు.

కూలీ నాలీ చేసుకునే కుటుంబాలలో ముసలివాళ్ళ పరిస్థితి ఘోరం. కరువు

వృద్ధాప్యం శాపం కారాదు. నిజమే! ప్రతివాళ్ళు కోరుకునేది ఇదే. కానీ ఎంతమందికి ఈ కోరిక తీరుతుంది?

అడ్డాల నాడు బిడ్డలు గానీ గడ్డాల నాడు కాదని పెద్దలు ఏనాడో చెప్పారు. ఇది ఎంత కాచివడబోసిన సత్యం! జీవిత అనుభవం!!

ప్రతి తల్లిదండ్రులు తమ పిల్లలు జీవితంలో పైకిరావాలని ప్రేమతో, తపనతో తమ శక్తిని ధారపోసి పెంచుతారు. ఆ బిడ్డల గురించి బంగారు కలలు కంటారు.

కొంతమంది పిల్లలు చదువు కోసమో, సంపాదించుకోవడం కోసమో విదేశాలకు వెళ్తుంటారు. ముఖ్యంగా అమెరికాకు వెళ్తుంటారు. వెళ్ళిన పని కాగానే తిరిగి వస్తామనుకుంటారు. ఆ జీవితానికి అలవాటు పడతారో ఏమో అసలు రారు. అమెరికా అంటేనే అది స్వర్ణ పిశాచి నగరం. దానిని వదిలిరాలేరు.

మా పిల్లలు స్టేట్స్‌లో ఉన్నారు అని గొప్పలు చెప్పుకోవడం తప్ప ఆ తల్లిదండ్రుల పరిస్థితి దయనీయంగా ఉంటుంది. ఉండడానికి పెద్ద పెద్ద భవంతులు. చేతినిండా డబ్బులు. కానీ తోడు లేక కుక్కలను కాపలాపెట్టుకుని ఆ భవనాలలో బిక్కు బిక్కుమంటూ కాలం గడుపుతారు. చాలామటుకు అమెరికాకు వెళ్ళి సెటిల్ అయినవాళ్ళ (ఎన్ఆర్ఐ) కుటుంబాల పరిస్థితి ఇదే!

ఇక మధ్య తరగతి, క్రింది స్థాయి కుటుంబాల పరిస్థితి ఇంకోరకంగా ఉంటుంది. చాలీ చాలని జీతాలు, చేతిలో చాలినంత డబ్బు ఉండదు. ఉన్న డబ్బుతో పిల్లలను చదివించుకోవాలి. కుటుంబాలను పోషించుకోవాలి. ఇంకోవైపు వినిమయ ప్రపంచ ప్రభావం వల్ల వీళ్ళకు ముసలివాళ్ళు భారమైపోతుంటారు. వీళ్ళు నిర్లక్ష్యానికి గురి అవుతుంటారు.

పిల్లలు బాల్యం, కౌమార దశలు తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యాలతో పెరిగి పెద్దవారై రెక్కలొచ్చిన పక్షుల్లా ఎగిరిపోతారు. జీవితంలో స్థిరపడతారు.

ఇంకోవైపు అమ్మ, నాన్నలు రెక్కలుడిగిన పక్షుల్లా వృద్ధాప్యంలో జీవిస్తుంటారు.

వచ్చినప్పుడు వలసలు వెళ్ళినప్పుడు ముసలివాళ్ళు బజారులో పడాల్సిందే! పిల్లలు పొట్ట చేతపట్టుకుని వలసలు పోతుంటే వీళ్ళు చిప్పలో, బొచ్చెలో పట్టుకుని రోడ్డున పడాల్సిందే! సిటీలలో చౌరస్తాలలో రోజు రోజుకూ పెరిగిపోతున్న ముసలివాళ్ళు అడుక్కు తినడం చూస్తున్నాం. ఇది చాలా ఘోరమైన పరిస్థితి. వీళ్ళలో చాలామంది ముష్టివాళ్ళు కాదు పిల్లల అలసత్వానికి, నిర్లక్ష్యానికి , నిరాదరణకు గురయినవాళ్ళు.

పూర్వం ఉమ్మడి కుటుంబాలు ఉండేవి. ఆ కుటుంబాలలో వృద్ధులు నిశ్చింతగా ఉండేవారు. సమిష్టి కృషి సమిష్టి ఆదాయం, సమిష్టి బాధ్యతలుండేవి. పిల్లలు ప్రేమానురాగాలతో పెరిగేవారు. సంకుచితత్వం అనే మాటలకు అర్థమే తెలిసేది కాదు.

మనస్సాక్షి ఉన్న పిల్లలున్నంత వరకూ తల్లిదండ్రులకు ఏ ఢోకా లేదు. ఏం ఫర్వాలేదు. ఎటొచ్చీ మనస్సాక్షి లేని పిల్లల వల్లే వచ్చిన చిక్కంతా. వాళ్లు ఒక్కసారి వెనక్కి చూసుకోరు. తల్లిదండ్రులు ఎంతకష్టపడి వాళ్ళను పైకి తెచ్చారు. ఈరోజు మా జీవితాలు ఇలా ఉండటానికి తల్లిదండ్రులే కారణం కదా! అని ఆలోచించరు. ఈ ప్రపంచంలోని సుఖాలన్నీ ఎలా స్వంతం చేసుకోవాలి అన్న ఆలోచనలు తప్ప వారికేం పట్టదు. సంపాదించుకోవచ్చు కానీ అత్యాశ, దురాశలుండగూడదు. బాధ్యతలు మరువకూడదు.

ఏనుగంత నాన్న లేకపోయినా, ఎకులబుట్టంత తల్లి ఉండాలన్నారు పెద్దలు.

నాకు తెలిసిన ఒక తల్లి తన పిల్లల భవిష్యత్తు కొరకు ఉన్న ఊరుని, కన్నవారిని, తోడబుట్టిన వారిని, బంధువులను, స్నేహితులను వదిలి జనారణ్యమైన పట్నానికి వచ్చింది. ఊరుగాని ఊరొచ్చి సమస్యలను ఛేదించుకుని పిల్లల బంగారు భవిష్యత్తుకు బాటలు వేసింది. పిల్లలు పెద్ద వాళ్ళయ్యారు. పెద్ద చదువులు చదివారు. ఆమె అనుకున్నది సాధించింది.

పిల్లలు రెక్కలొచ్చి ఎగిరిపోయారు. ఆమె రెక్కలు ఉడిగిపోయింది. రోగాల పాలైంది.

ఎవరి భవిష్యత్తు కోసం ఊరు వదిలిందో ఆ కొడుకు స్వార్థపరుడయ్యాడు. అల్లారు ముద్దుగా పెంచిన తన కొడుకేనా ఇలా మారిపోయాడు. ఇంత స్వార్థపరుడి కోసమేనా అయినవాళ్ళను వదులుకుని ఊరు వదిలివచ్చింది? ఐదు నిమిషాలు గడుపడే! ఏలా ఉన్నావని అడగడే!? చిన్నప్పుడు అమ్మా!అమ్మా! అంటూ ఒక్కక్షణం వీడకుండా తిరిగిన కొడుకేనా? ఇలా మారిపోయాడు? కంటికి దూరమయ్యాడు, మనస్సుకు దూరమయ్యాడు అని ఆమె మౌనంగా రోదిస్తుంటే దుఃఖమాపుకోలేకపోయాను.

సుతులుండేది గతులకోసమే (చూసుకోవడం కోసమే) అనేది ఒక నానుడి. కానీ ఇప్పుడు గతిలేకపోతే (డబ్బు లేకపోతే) దగ్గరికి కూడా రానివ్వరు. కాలమెంత మారిపోయింది!? సరళీకరణ విధానాలు అంతటా (మానవ సంబంధాలు తుంచివేస్తున్నాయి) ప్రభావం చూపుతున్నాయి. ఈ విధానాలకు తట్టుకుని నీతి, నిజాయితీలను పణంగా పెట్టకుండా నిలబడ్డవాడే ధన్యుడు!!.

## కేస్‌స్టడీ:

మహాలక్ష్మి తనకు ఇంక ఎవరు సహాయం చెయ్యరని, చెయ్యలేరనీ ఒక నిశ్చయానికి వచ్చేసింది. పుట్టింటికి వెళ్ళిపోవడానికి సిద్ధపడింది. ఎక్కడో అక్కడ తను ఇక్కడ చేసే పనే ఎక్కడైన చేసి పొట్టపోసుకోలనని, ఎలాగో ఒకలా ప్రశాంతంగా బ్రతుకుతాను గానీ, ఈ సంసారం తను చెయ్యలేనని నిశ్చయించుకుంది. కానీ ఐద్వా ఆఫీసులోగల కౌన్సిలింగ్ సెంటరులో తన సమస్యకి పరిష్కారం సూచిస్తారని బలవంతంగా పొరుగువారెవరో తీసుకుని వస్తే వచ్చిందిగానీ తనకి ఇక ఈ పంచాయితీలు, పెద్ద మనుషులు అవసరం లేదంటూంది. నీ సమస్య చెప్పు అన్నప్పుడు కూడా ఇంక అనవసరం. తొమ్మిది సంవత్సరాలుగా ఇవన్నీ జరుగుతూనే ఉన్నాయి. ఒక సమస్య తీరితే ఒక సమస్య. భర్తే సరిగాలేనప్పుడు ఎవరిని నిందించి ఏమిటి లాభం? నేను ఇక్కడ ఉండను వెళ్ళిపోతానంది. చివరికి ఎలాగోలా తన సమస్య గొంతులో దుఃఖం పేరుకుపోగా మెల్లిగా తెలియచేసింది. భర్త కొట్టే దెబ్బలు భరించలేనని, అతడెందుకు కొడతాడంటే అత్తామామల చెప్పుడు మాటలు విని తనను అనవసరంగా కొట్టి హింసిస్తాడని, వాళ్ళ నుండి వేరుగా ఉండి ఎవరి వంటలు వాళ్లు చేసుకుని ఉంటారా? అని అడిగాం. ఎవరి ఇళ్లు, ఎవరి సంపాదన వాళ్ళదే అన్నీ వేరే అయినప్పటికీ వాళ్ళ తిట్లు వినలేకపోతున్నానంది.

చివరికి మహాలక్ష్మి అత్తమామలను భర్తనూ పిలిపించాం. మహాలక్ష్మికి నిండా 25 ఏళ్ళకూడా ఉండవేమో. తొమ్మిదేళ్ళ సంసారం జీవితం ఆమెతో పోరాట పటిమను పెంచినట్లుగా ఆమె మాటలు చాలా స్థిరంగా, స్పష్టంగా ఉన్నాయి. చాలా విషయాలు మాట్లాడగా చివరికి దుఃఖం ఉపశమనం కలిగింది. తను ఇళ్ళల్లో పనులు చేసి ఆ డబ్బుని కూడా మొత్తం భర్త చేతిలో ఇస్తుందట. భర్త తనకి వచ్చే జీతంలో కొంత ఇంటి ఖర్చులు పెట్టినా మరికొంత అనవసర ఖర్చులు చేస్తాడు. చివరికి తల్లి అంటే మహాలక్ష్మి అత్తగార్ని కొంత డబ్బు/ వస్తువులు అప్పు అడుగుతాడు. పైగా ఇంటికి పెద్ద కొడుకుగా బాధ్యతలు సరిగా నిర్వర్తించలేదనీ అన్నీ కలిసి కొడుకులేనపుడు కోడలిని తిట్టి కొడుకుతో మరికొన్ని చాడీలు చెప్తూ ఉంటుంది. అయినా ఈ కొడుకు తల్లిదండ్రుల దగ్గర గొప్పలకుపోయి భార్యని హింసించి తల్లిదండ్రులను ప్రసన్నం చుసుకోవాలనుకుంటాడు. అత్తమామలు వయసులో పెద్దవారే అయినా వారి తిట్లకు వారు వాడే భాషకు అడ్డుకట్టవేయడం కష్టం అని అర్థం అయింది. ఆ భర్తలోనే తప్పు ఉందని మాకు అర్థం అయింది. అంతేకాదు అతడు తేల్చిన సారాంశమూ అదే. ఈయన భార్యలో తప్పులేమీ లేనప్పటికీ వాళ్ళ అమ్మ సంతోషం కోసం మాత్రమే కాక అతడి స్వార్థంతో, అహంకారంతో భార్యని కొట్టి హింసిస్తూ ఉన్నాడు. ఇరుగుపొరుగు వారు భార్యని ఎందుకు హింసిస్తున్నావని అడిగితే వాడి అహం దెబ్బతిని వాళ్ళమీద ఎదురు తిరుగుతాడు. ఆ పరిస్థితుల్లో ఉన్న వారివురికీ కౌన్సిలింగ్ ఇచ్చాము. నీవు భార్య పట్ల ఆ విధంగా ప్రవర్తించడం తగదనీ, అతని తప్పులు అతనికి అర్థం అయ్యేట్లు వివరించి ఆలోచించుకోమన్నాం. అతని తల్లిదండ్రులకు కోడలిని హింసిస్తే ఊరుకునేది లేదని గట్టిగా చెప్పాము.

భార్యను హింసిస్తే నేరమనీ, మళ్ళీ రెండు వారాల తరువాత ఇద్దరినీ కలిసి రమ్మని పంపించాము. మహాలక్ష్మి ఇప్పుడు భర్తతో కలిసి ఉండడానికి ఒప్పుకుంది. తనను కొట్టకుండా ఉంటే చాలనీ,ఇక ఎటువంటి కష్టాలయినా తాను భరిచగలననీ చెప్పింది. ఎంతయినా క్షమాగుణం, సహనగుణం కలిగిన సగటు స్త్రీకదా!

– దుర్గాప్రసన్న



# స్టైల్ అంటే తాగడమా?

-కె. అరుణ

ఈ మధ్య మంచి సినిమాలేమైనా చూశారా? మామూలుగానే సినిమాల జోలికి పోవడంలేదు. దానికి 'మంచి' అనే విశేషణం తగిలిస్తే ఇక మేం చెప్పడానికి సినిమాలేం మిగిలాయి చెప్పండి అంటారా? అదీ నిజమేలెండి. కథ అనే దినుసు ఉన్నదనే విశేషం నేటి సినిమాలు ఏనాడో మరిచాయి. 'హీరో'గారు ఇమేజ్ నటుడని భస్తే అనరెందుకో! ఓ రకంగా ఇదే కరక్టేమో! ఎందుకంటే, నటనంటూ వచ్చి ఏడిస్తేకదా నటుడనాలి. అలా కాకుండా, నాన్న దర్శకుడనో, తాత పాత తరం కథానాయకుడనో, మేనమామకు మేటలకొద్దీ ఆస్తుందనో అడ్డమైనవాళ్లు హీరో'లు అయిపోతుంటే.... ఇకవారు నటనలో ఓనమాలు నేర్చుకోవటం కూడానా?! తత్ఫలితంగా, మీసమైనా రాని జీరోలే హీరోలుగా సినిమాలు వచ్చేస్తున్నాయి. అవి ఆడనీ ఆడకపోనీ...సినిమా తీయాల్సిందే! అదో మహాకావ్యమన్నంత బిల్డప్ ఇస్తూ మనపైకి వదలాల్సిందే!

ఇదంతా ఎందుకు చెప్పాల్సొస్తుందంటే...ఇప్పుడు మనం ఒక సినిమా గురించి మాట్లాడుకోబోతున్నాం. కనుక! ఆ సినిమా పేరే అనవసరం. ఎందుకంటే దాదాపు అన్ని సినిమాల సన్నివేశాలు ఒకేలా ఉంటాయికదా! టూకీగా చెప్పాలంటే...ఓ నూనూగు మీసాల అందగాడు చదువు సంధ్యలు, అడ్డూ అదుపు లేకుండా పోరంబోకులా తిరగటం, అల్లరిమూకను పోగేసి లెక్చరర్లను టీజ్ చేయటం వంటి చిలిపి పనులతో టైమ్ పాస్ చేయటం, తండ్రిని దోమకన్నా దారుణంగా విదిలించేయటం, విరిసీ విరియని పూబాలను పడేయటం (దాన్నే 'ప్రేమ' అంటారట!) ఇక బక్కప్రాణి ఒంటిచేత్తో కండల వీరుడ్ని తుక్కుకింద కొట్టేయటం, అడ్డొచ్చినవారిని ఉఫ్ అని ఊదేయటం, ఆ పిచ్చిమారాజులంతా ఇందుకోసమే ఎదురుచూస్తున్నట్లుగా గాలిలోకి ఎగిరి అవతల పడటం నాయిక తండ్రి (కూతుర్ని కన్నాక విలన్ కాక తప్పదు) మన హీరో ఎత్తుగడలన్నీ వెర్రివెంగళప్పలా నమ్మి డూడూ బసవన్నలా తలూపడం, నాలుగు డ్యూయెట్లు, ఒక ఐటెమ్ సాంగ్‌ల రూపంలో అందాల ఆరబోతలు......ఎక్స్‌ట్రా ఎక్స్‌ట్రా...ఇవేగా సగటు సినిమాల్లో కనిపించే దృశ్యాలు!

ఇంకేమైనా మిస్సయ్యామా?! ఉంటే అవీ కలిపేసుకోండి!

ఈ వ్యవహారం అంతటితో మనకెలాంటి అబ్జెక్షన్ లేదు. వాళ్ళని తైతక్కలాడితే మనదేం పోయింది చెప్పండి?! కానీ వారి ధోరణి మనకు నష్టం కలిగించినప్పుడు మాత్రం దాని గురించి మాట్లాడుకోవాలి. ఆపై అప్రమత్తం కావాలి. ఇంతకీ మనకు అభ్యంతరం కలిగేది ఎక్కడంటే.....సదరు హీరోలు సంతోషం వచ్చినా, బాధ వచ్చినా జులాయి వెధవలను వెంటేసుకుని బాటిళ్ళకు బాటిళ్లు మందు కొట్టడం! దాని వల్ల వాళ్ళకు కిక్ ఎక్కడమోగాని..ఆ సన్నివేశాలు చూస్తున్న తల్లిదండ్రులకు కోపం నషాళానికి ఎక్కేమాట వాస్తవం. అవునంటారా? కాదంటారా?! సరదా అయినా, సందర్భం ఏదయినా... టీనేజర్లు నమ్మేంతగా ఈ వెర్రిపోకడలు తయారయ్యాయి! నలుగురు కలిసారంటే తాగితీరాలని స్లోపాయిజన్‌లా యువరక్తంలో ఇంజెక్ట్ చేయటమే కదా ఇదంతా! పైగా ఆ హీరోగారు మాట్లాడితే చాలు ఆసువుగా అబద్ధాలు ఆడేస్తుంటాడు. అమ్మాయి నడుము చూడటం కోసం ఎంతకైనా తెగిస్తాడు. ఉ అంటే రింగులు రింగులుగా సిగరెట్ పొగలు వదులుతుంటాడు. ఇక ఖుషీ చేసుకోవాలంటే తప్పనిసరిగా పబ్‌ని సందర్శించి తాగితూగాల్సిందే! వెర్రెత్తినట్లు చిందులేయాల్సిందే! ఇవన్నీ చూసే మనకు ఏమిటీ ఘోరం? ఏమిటీ సంస్కృతి? దీనికిలేదా నిష్కృతి?...లాంటి ప్రశ్నలు మదిలో సుడిగాలిలా చెలరేగక మానవు.

నిజానికి వారు చూపించే అలవాట్లు వ్యవహారాలేవీ సాధారణ ప్రజానీకానికి లేవు. దేశంలో అత్యధిక భాగమున్న సాధారణ యువతకు ప్రస్తుతం కెరీరే అసలు సమస్య. చదువుకోవాలి, ఉద్యోగం వెతుక్కోవాలి. తమ కాళ్ళమీద తాము నిలబడాలి.....వీటిపైన వారి నిరంతర వందనం. విచిత్రంగా నేడు వచ్చే యూత్ సినిమాల్లో ఈ టాపిక్కులేవీలేవు. ఉండవు. ఎందుకంటే సాధారణ ప్రజానీకం వారికి కాసులు రాల్చే కథావస్తువు కాదుకనుక! ఇకపోతే, వారి దృష్టి అంతా ఉన్నత (ఏ రకంగానో ఆలోచించాలి!) వర్గం పైనే ! ఆ యువతకంటే, కాదనకుండా కట్టలందించే కన్నవారున్నారు. రేపెలా గడుస్తుందనే దిగులు కలలో కూడా లేదు. ఇక మిగిలేది కాలక్షేపం పేరిట విశృంఖలంగా కాలం గడపటమేగా! నిజానికి, ఈ విషయాల గురించి మనం బాధపడాల్సిన అవసరం లేగ- కందకు లేని దురద కత్తిపీటకు ఎందుకు?! కానీ, ఆ వర్గానికి చెందిన అలవాట్లు, సరదాలు అన్యాయంగా అన్ని వర్గాలకు ఆపాదిస్తున్నారే... దానికే చిర్రెత్తుకొస్తోంది. యువత అన్న తరువాత ఇవన్నీ చేసి తీరాల్సిందే అన్నట్లుగా ప్రేరేపిస్తున్న, ప్రోత్సహిస్తున్న, ప్రోద్బలిస్తున్న విషయాన్ని మాత్రం పట్టించుకోవాలి. తప్పదు! ఒక తరగతికి చెందిన అలవాట్లను మళ్ళీ మాట్లాడితే దురలవాట్లను అందరికీ ఆపాదించి యువతపై రుద్దే అధికారం వీరికి ఎవరిచ్చారు? లాభాల కోసం ఎంతకైనా తెగిస్తారా?

ఒకప్పటి సినీ కథానాయకుడు సకల గుణాభిరాముడే. వాళ్ళు స్త్రీలను గౌరవించేవారు. తల్లిదండ్రులకు విలువనిచ్చేవారు. ఎన్నో విలువలను నేర్పడం మాత్రమే కాదు, ఆనాటి సినిమాల కథా,

కథనం సంగీతం ప్రేక్షకుల హృదయాలను స్పృశించేవి. అందుకే నేటికీ మనం వాటిని మరువలేం. కానీ నేటి కథానాయకుడు ఇమేజ్ చట్రంలో బిగుసుకుపోయిన త్రిశంకువాసి. వాడెంత పనికిమాలినవాడైతే అంత గొప్ప. ఎవరినీ లెక్కచేయకుండా, ఏదీ పట్టకుండా ఎంతగా తిరిగితే అంత పే...ద్ద హీరో. తెలిసీ తెలియని యవ్వన దశలో ఉండే సాధారణ ప్రేక్షకులు వీటిని చూసి తప్పుడు మార్గం పట్టకుండా ఉంటారా? విలాసాలు, వికృతాలు చేయడానికి డబ్బుకోసం తల్లిదండ్రులను వేడించకుండా ఉంటారా? అందాకా ఎందుకు...? నేడు పోలీసులకు దొరుకుతున్న అనేకమంది దొంగలు యువకులే! వారు పోలీసులకు చెప్పే కారణమేంటో తెలుసా?! విలాసాల కోసం దొంగతనాలు చేస్తున్నామని! దీని వెనుక ప్రేరణ ఎవరు? విచ్చలవిడితనానికి పరోక్షంగా పురికొలుపుతున్న సినిమాలు కాదంటారా?! బాధ కలిగేది ఎక్కడంటే దీనికి మినహాయింపు కాకపోవటం! ఇండ్రస్టీలో ఉన్నత భావాలు కల వ్యక్తిగా చెప్పుకునే ఆయన "త్రీ ఇడియట్స్"తో తాగుడు యువత సహజ లక్షణం అని చెప్పడం ఎందరో అభిమానులను నొప్పించింది.

అన్నట్లు చావకింద నీరులా వ్యసనాలను వ్యవస్థలో పాకించే ఈ పుణ్యాత్ములు కింద చిన్నగా తాగుడు మంచిది కాదని వేస్తారు. చేయాల్సిందంతా చేస్తూ కనీ కనిపించనట్లు నీతివాక్యాలు రాసినంత మాత్రాన అంతా సరైపోతుందా? ఇది సిగరెట్ పెట్టెమీద సిగరెట్ తాగటం ఆరోగ్యానికి హానికరం అని రాయడంలాంటిదే! దీనివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు సరికదా అది ఓ జోకులా, వెక్కిరింతలా మారిపోవడం మనకు తెలీదూ?!

ఏతావాతా చెప్పొచ్చేదేమంటే ... వీరెవరూ మనకు విలువలు నేర్పాల్సిన పనిలేదు. మనకంత ఆశకూడా లేదు. కానీ, తప్పుడు తోవలు చూడచక్కగా ఉపదేశించే హక్కు వీరికి లేదు. వీరికెలాగూ అంతటి విచక్షణ లేదని తేలిపోయింది. వీరి ఎత్తుగడలను ఇట్టే కనిపెట్టగల మనం, ఈ పనికిమాలిన సినిమాలను ఆదరించటం ఎంతవరకూ సమంజసం? సమాజంలో పెరుగుతున్న కుళ్లుకు కారణం అర్థం చేసుకోగలిగినప్పుడు....దాన్ని అరికట్టే బాధ్యత మాత్రం ఎందుకు తీసుకోలేం? భవిష్యత్ తరాల బంగారు బాటను బీటలు బార్చే వైఖరి ఇది! మనం తలచుకోవాలే కానీ, ఈ ధోరణికి ఆనకట్ట నిర్మించడం ఏమంత కష్టమని?

# సమరాజ్యం అతని స్వప్నం



బహుజన హితాన్ని కోరి 'స్వేచ్ఛ-సమానత్వం' బోధించిన బుద్ధుడు, పూలే, కబీరు ఆయన ఎంతగానో ఇష్టపడే ముగ్గురు గురువులు. 'బోధించు-సమీకరించు-సాధించు' అన్న మూడు నినాదాలను దేశవ్యాప్తంగా నిమ్న కులాల గుండెలనిండా నింపిన మహోన్నతుడాన. తాను అనుభవించిన కష్టాలు, తనజాతి జనం అనుభవించకూడదని తపించిన బహుజన హితైషి. 'మను' రాజ్యాన్ని నిరసించి 'సమరాజ్యాన్ని కాంక్షించిన క్రాంతదర్శి. ఆయనే...డాక్టర్ భీమ్‌రావ్ రాంజీ అంబేదర్. 1891 ఏప్రిల్ 14న నాటి బ్రిటిష్ సెంట్రల్ ప్రావిన్స్‌లోని కంటోన్మెంట్ పట్టణమైన 'మైవా'లో మహర్ కులంలో జన్మించారు. మరాఠా ప్రాంతంలోని రత్నగిరిజిల్లా తన పూర్వీకులది. ప్రాథమిక విద్యను అభ్యసిస్తున్న దశలో భీమ్‌రావ్‌ను చూసి ముగ్ధుడైన ఉపాధ్యాయుడు, తన ఇంటిపేరైన 'అంబేద్కర్'ను భీమ్‌రావ్ పేరుకు ముందు చేర్చాడు. 1913లో బరోడా మహారాజు అందించిన ఆర్థిక సహాయంతో అమెరికాలో ఉన్నత విద్యను అభ్యసించారు. భారత సమాజంలో నెలకొన్ని సామాజిక అంతరాలను రూపుమాపడానికి అంబేద్కర్ తనదైన ఆలోచనా విధానాన్ని రూపొందించారు. హిందూ వ్యవస్థలోని లోపాలను లోతుగా వివరించి నిమ్న కులాలను చైతన్యపరచడం ఆయన ప్రధాన పోరాట రూపం. నిమ్నకులాలు ఎదుర్కొంటున్న సమస్యలను ప్రపంచానికి తెలియజెప్పడంలో అంబేద్కర్ కృషి అనన్యం. 1924లో హిందూ సంస్కర్తలతో కలిసి ఆయన స్థాపించిన 'బహిష్కృత హితకారిణీసభ'తో మొదలైన సామాజికోద్యమం ఎన్నో మజిలీలు దాటి భారతదేశం 'గణతంత్రత' రాజ్యంగా ఆవిర్భవించే వరకూ కొనసాగింది. బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ 1926లో 'చౌదర్ చెరువు' నీళ్ళను వినియోగించుకోవడానికి అన్నికులాలకు చెందిన ప్రజలూ అర్హులేన్న చట్టం రూపొందించడం అంబేతర్ పోరాట పటిమకు నిదర్శనంగా నిలిచింది. దక్షిణ భారతంలో నిజాం రాజ్యాంలో 'ఆదిహిందూ' సంస్థ ద్వారా మాదిరి భాగ్యరెడ్డివర్మ, రాజమండ్రిలో కుసుమ ధర్మన్న. కేరళ రాష్ట్రంలో కేలప్పన్ వంటివారు అంబేద్కర్ ఆలోచనలకు ఆచరణ రూపం కల్పించారు. అంబేద్కర్‌ను నిమ్నకులాల ప్రతినిధిగా గుర్తించిన బ్రిటిష్ ప్రభుత్వం 1932లో లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశానికి ఆహ్వానించడం, నిమ్న కులాలకు ప్రత్యేక 'నియోజక వర్గాలు' కావాలని అంబేద్కర్ పట్టుబట్టడం రాజకీయ ప్రాధాన్యతను సంతరించుకుంది. దీంతో గాంధీతో తీవ్ర స్థాయిలో ఘర్షణ పడక తప్పలేదు. ఇలాంటి ఘటనలే అంబేద్కర్‌ను సామాజికంగా తీవ్ర నిర్ణయాలకు పురికొల్పాయి. "పుట్టుక నాచేతిలో లేదు కాబట్టి హిందూ సమాజంలో అంటరానివాడిగా పుట్టాను..కానీ, హిందువుగా మాత్రం మరణించను" అని 1956లో లక్షలాది మంది అనుచరులతో 'బుద్ధిజం' వైపు పయనించిన అంబేద్కర్,1956 డిసెంబర్ 6న తుదిశ్వాస విడిచారు. హిందూ వ్యవస్థ మొదలు భారత జాతీయ కాంగ్రెస్ వరకూ ఎన్నో అడ్డంకులను దాటి 'భారత రాజ్యాంగ' రచనలో పీడిత కులాలకు రక్షణ కల్పించిన 'భారతరత్న', భవిష్యత్ తరాలకు స్ఫూర్తిగా నిలిచారు.

**ఏప్రిల్ 14 అంబేద్కర్ జయంతి సందర్భంగా**

అవగాహన సందర్భం:

# "మనసుతో మాట్లాడుకుందాం"

- డా॥ శిలాలోలిత

అద్భుతమైన కథారచయిత పెద్దింట అశోక్‌కుమార్ రాసిన 'జిగిరి' నవల చదివాను. మానవ సంబంధాలమీద, మానవత్వపు విలువల మీద రాశారు. ఎలుగుబంటిని అడవి నుంచి తెచ్చిన 'ఇమామ్' అనే పేద ముస్లిం జీవిత మందులో ఉంది. క్రూరమృగమైనా, 'షాదుల్' అని పేరు పెట్టుకున్న తర్వాత తన స్వభావాన్ని మర్చిపోయి, ప్రేమతత్వాన్ని పెంచుకుని సాధుజీవిలా మారిపోతుంది. 'ఇమామ్' కొడుకు క్రూరమృగ స్వభావాన్ని అలవర్చుకుని రెండెకరాల కోసం దుర్మార్గుడైపోతాడు,

ఇదంతా ఎందుకు మాట్లాడుకుంటున్నామంటే, ఆ నవల పూర్తయిన తర్వాత ఎనిమిది భాషల్లోకి ఎందుకు అనువాదమై, ప్రజాదరణ పొందిందో అర్థమైపోతుంది.

గ్లోబలైజేషన్ నేపథ్యంలో ఇరుకు మనసుల చీకటి గుహల ఇళ్ళల్లో మనం ఎలా కుంచించుకుపోయామో తెలుస్తుంది.

మనస్సులకు వైద్యం జరగాలిప్పుడు. ప్రతి ఒక్కరూ తమను తాము సరైన రీతిలో ఆలోచించడానికి, సరిచేసుకోవడానికి, సమస్య నుంచి బయటబడటానికి, నెగిటివ్ ఆలోచనల నుంచి పాజిటివ్ దృక్కోణాన్ని అలవర్చుకోవడానికి సైకాలజిస్టుల సాయం తప్పకుండా తీసుకోవాలి. ఇది అత్యవసరం. మనకు మనమే ఏమీ కాకుండా, మిగలకుండా, విలువలన్నీ ధ్వంసమైపోతుంటే అలా నిర్లిప్తంగా ఇంకెన్నాళ్ళు ఉండగలం.

ఉమ్మడి కుటుంబాలన్నీ గాలికెగిరిపోయి, వ్యక్తుల చుట్టూ కాకుండా, వ్యక్తే ప్రధానమనుకున్న ఆధునిక ధోరణిని గమనించకుంటే, ప్రేమలు, ఆప్యాయతలు, సహకారాలు, కలిసి జీవించడాలు ఎలా నేల మట్టం అయిపోయాయో కనిపిస్తాయి.

అన్నదమ్ముల మధ్య, అక్కచెల్లెళ్ళ మధ్య, తల్లిదండ్రులు పిల్లల మధ్య, భార్యాభర్తల మధ్య, స్నేహితుల మధ్య, ఇతర బంధుజనాల మధ్య, ఇరుగు పొరుగు మధ్య విధ్వంసమైపోయాయి నైతిక విలువలన్నీ. మళ్ళీ మనని మనం పరిశీలించుకోవడానికి, దోహదవడిందీరచన. ఎంతసేపూ ఎదుటివాళ్ళు నాకేం చేశారు అనే ఆరోపణలు, తాను ఎంతో చేశాననుకునే నమ్మకాలు, తను మాత్రమే కరెక్ట్ అనే ధోరణి, ఎదుటివారికీ మనసు, అనుభూతి, బాధ, చలనం, వివేకం, హృదయం ఉంటాయన్న చిన్న స్పృహ ఉన్నా సమస్యలు అంతం దూరాలు ప్రయాణమైపోవు.

సమాజం వగిలిపోవడాలు, కుటుంబాలు అతలాకుతలం కావడానికి, మానవ సంబంధాలన్నీ తారుమారు కావడానికి ప్రధాన కారణం మనసే అనిపిస్తోంది. అందరి మనసులకు జబ్బుచేసింది. మనం మొదట్నించి శరీరానికి గాయమైనా, జబ్బుచేసినా డాక్టర్ల దగ్గరకెళ్తాం. కానీ, మన మనసునసలు పట్టించుకోము.

అదే ఇప్పుడు అసలు సమస్యయి కూర్చుంది. మనస్సులకు వైద్యం జరగాలిప్పుడు. ప్రతి ఒక్కరూ తమను తాము సరైన రీతిలో ఆలోచించడానికి, సరిచేసుకోవడానికి, సమస్య నుంచి బయటబడటానికి, నెగిటివ్ ఆలోచనల నుంచి పాజిటివ్ దృక్కోణాన్ని అలవర్చుకోవడానికి సైకాలజిస్టుల సాయం తప్పకుండా తీసుకోవాలి. ఇది అత్యవసరం. మనకు మనవే ఏమీ కాకుండా, మిగలకుండా, విలువలన్నీ ధ్వంసమై పోతుంటే అలా నిర్లిప్తంగా ఇంకెన్నాళ్ళు ఉండగలం. మనిషితనాన్ని కోల్పోకుండా మానవహారం పరిమళ భరితమవ్వాలంటే మనని మనం సమీక్షించుకోకతప్పదుమరి.

కుల,మత, లింగ, ప్రాంత భేదాల్ని బట్టి, పెంపకాల్నిబట్టి, పరిసరాలు, పరిస్థితులు, ఆర్థికస్థితిగతులను బట్టి మనం తయారు చేయబడుతుంటాం. కొంత పరిణితి సాధించిన తర్వాత ఇప్పుడు పునర్మూల్యాంకనం చేసుకోవాల్సిన సందర్భంలో మనమేమిటి? మన ప్రవర్తన ఏమిటి? మనకున్న మానవతా విలువలేమిటి? అని పరీక్షించుకుంటే మనకి మనమే కొత్త అర్థంలో కన్పిస్తాం.

ఎంతో కష్టపడనక్కరలేదు. ప్రతీ రోజూ ఉదయం నుంచి రాత్రి పడుకోబోయేలోపు ఏం చేసాము అని చిన్న పరీక్ష చేసుకుంటే చాలు. మంచి చెడ్డలు తెలిసిపోతాయి. కొత్త ప్రతిపాదనలు, పునరాలోచనలతో రేపటి రోజు మళ్ళీ మొదలవుతుంది. 'రాజారామ్మోహన్‌రాయ్' చెప్పినట్లు 'వ్యక్తి సంస్కారవాదం'తో ఎటువంటి సమస్యనైనా ఎదుర్కోవచ్చు. మీరూ ప్రయత్నించి చూడండి.




జనవరి-మార్చి చైతన్య మానవి టైటిల్ పేజీ చూడగానే సంక్రాంతి ఉట్టి పడుతుండేలా, బ్యాక్ కవర్ అంతర్జాతీయ మహిళా దినోత్సవ స్ఫూర్తితో రావడం చాలా ఉత్తేజపరిచింది. ఇక పత్రికలోని అన్ని ఆర్టికల్స్ దేనికవే సాటిగా ఉన్నాయి.

స్త్రీ స్వాతంత్ర మర్త్వతి కథ, నేటి యువత ఎదుర్కొనే పరిస్థితికి అద్దం పడుతుంది. కథలో జావళి తన మనసులో మాటను వ్యక్తపరిచే పద్ధతి బావుండటంతోపాటు పెద్దయి కూడా ఏ పద్ధతుల్లో వ్యవహరించాలో అనేది ఆలోచింపజేసేట్టుగా ఉంది. "నక్షత్ర" కథ ద్వారా టీనేజ్ అమ్మాయిలు ఎదుర్కొనే సమస్యలు బయటకు చెప్పలేక మనసులో మధన పడుతున్న తీరును కళ్ళకు కట్టినట్టుగా నక్షత్ర పాత్ర ద్వారా చెప్పారు. సశేషం ఉండటంతో మళ్ళీ పత్రిక ఎప్పుడొస్తుందా అని ఎదురు చూడాల్సిన పరిస్థితి.

అవినీతిపై యుద్ధం వ్యాసం చాలా వివరాలతో కూడిన లెక్కలతో అవగాహన పెంపొందించేట్టుగా ఉంది. నాట్య మయూరి తుది నిర్ణయం కథలు బావున్నాయి. స్థానిక సంస్థల్లో మహిళలకు అంది వచ్చిన రిజర్వేషన్లు ఎట్లా ఉపయోగించుకోవాలో తుది నిర్ణయం కథ తెలియజేస్తుంది., ఆరోగ్యం, ప్రశ్నలు, జవాబులతో కూడిన శీర్షికగా కొనసాగిస్తే బావుంటుందని, అనేకమంది సందేహాలు నివృత్తి అవుతాయని నా అభిప్రాయం.

మొత్తంమీద ఈ సారి వచ్చిన మ్యాగ్‌జైన్ ఇతరులకు గిఫ్ట్‌గా కూడా ఇచ్చేలా అమ్మూల్యంగా ఉంది. నేనదేచేస్తాను. మానవిని భవిష్యత్తులో ఇదే పద్ధతిలో కొనసాగిస్తారని ఆశిస్తూ.........

– రాజ్యలక్ష్మి, ప్రగతినగర్

జనవరి-మార్చి చైతన్య మానవి చాలా చాలా బావుంది. పత్రికలోని అన్ని ఆర్టికల్స్, పాఠకులు చదివేందుకు ఆసక్తిని కలిగించడంతోపాటు నేటి మహిళల సమకాలీన సమస్యలకు దర్పణం పడుతోంది. ఒక చిన్న అంశం మీ దృష్టికి తేవాలనుకుంటున్నాను. బ్యాక్ కవర్‌పై 'మహిళా దినోత్సవ శుభాకాంక్షలు" మ్యాటర్‌లో "యజమానులు జరిపిన కాల్పుల్లో 146 మంది యువతులు నేలకొరిగారు" అని ఉంది. కానీ నాకు తెలిసిన వరకూ యజమానులు అవలంభించిన చీకటి గుహల్లాంటి ఇరుకైన గదుల్లో నిర్బంధించి వెట్టిచాకిరి చేయించుకునేవారు. ఆ సందర్భంలో జరిగిన అగ్ని ప్రమాదంలో అనేకమంది యువతులు మరణించారు. ఆ ఘటన యాజమాన్యంపై కసి పెంచడంతోపాటు, ప్రపంచ వ్యాప్తంగా మహిళా కార్మికుల్లో పోరాట పటిమ, ఐక్యతను పెంచడానికి దోహదపడింది. ఒకసారి మీరు కూడా గమనించగలరు.

– టి.మేఘన, బంజారాహిల్స్

గౌరవనీయులైన ఎడిటర్ గార్కి!

జనవరి-మార్చి పత్రికలో ప్రచురించిన గురజాడ అప్పారావుగారి దేశభక్తి కవితను ఆరోజుల్లో చాలా అర్థాలు వచ్చేటట్లు విశదీకరించారు. అటువంటి మహనీయులు జన్మించిన మన భరత ఖండం ధన్యమైంది. ఈతరం వారికి గురజాడ గురించి గుర్తు చేసిన చైతన్య మానవికి అభినందనలు. రైతుల కోసం పోరాడి ప్రాణాలర్పించిన వీరగున్నమ్మ మహిళలకు ఆదర్శమూర్తి. నక్షత్ర కథానికి వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. ఆడపిల్లలు బయటకు వెళ్తే తిరిగివచ్చేదాకా నమ్మకం లేదు. మానభంగాలు, హత్యలు ఎన్ని చట్టాలు వచ్చినా ప్రభుత్వాలు మారినా మనదేశంలో స్త్రీకి స్వాతంత్ర్యం ఎప్పుడు లేదు. " చైతన్య మానవి" పేరులోనే చైతన్యవంతం చేస్తుంది. మాలాంటివారికి చక్కని విషయాలు తెలియజేస్తున్నందుకు ఎడిటర్‌గారికి మరోసారి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

– సి.హెచ్.రమ, కుకట్‌పల్లి

## ఎన్నో మంచి విషయాలున్నాయి

"చైతన్య మానవి' పత్రికలోని కథలలో అందరూ చదివి తెలుసుకోవాల్సిన మంచి విషయాలు చాలా ఉన్నాయి. మనం చదవడమే కాకుండా మనకు తెలిసినవారితో చదివించినట్లయితే పుస్తకానికి సార్థకత.

"స్త్రీ స్వాతంత్ర్యమర్త్వాతి" కథలో జావళిలాగా ధైర్యంగా తన ఇష్టం, అభిప్రాయాలు చెప్పగలిగిన అవకాశం ఎంతమంది తల్లిదండ్రులు ఇస్తున్నారు? జావళి తండ్రి కూడా తన ఇష్టాన్ని దాచిపెట్టి పెళ్ళి చేయాలని చూస్తాడు. పెళ్లికొడుకు తల్లిదండ్రులు తమ అబ్బాయి తప్పు చేసినా పరవాలేదు, అమ్మాయి మటుకు చెడ్డది అనడం మగవాళ్లు ఏదయినా చేయవచ్చుని చెప్పడమే. కోమలిచేత "న్యాయం ఇద్దరికీ కావాల"ని అమ్మాజీగారు చెప్పించడం చాలా బాగుంది.

నూరేళ్ళ గురజాడ దేశభక్తి' గురించి ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారు వివరంగా రాశారు. ఈ నూరవ సంవత్సరంలో కూడా గురజాడ గురించి, దేశభక్తి గురించి చాలా ఎక్కువ ప్రచారం చేయవలసిన అవశ్యకత ఎంది. ఎందుకంటే డిగ్రీలు చదివిన వాళ్ళుకూడా దేశభక్తి అంటే ఏమిటి? అని అడుగుతున్నారు. దాని ఆవశ్యకత ఎంత ఉందో అర్థమవుతోంది. 'దీపధారి గురజాడ' వ్యాసాల నుంచి ప్రతిసారీ పత్రికలో వస్తే బాగుంటుంది.

'నక్షత్ర' కథలో శాంతిశ్రీ ఆడపిల్లలు ఇబ్బంది గురించి తెలియజేశారు. చిన్నపిల్లలని, పెద్దవాళ్ళని తేడా లేకుండి మగవాళ్ళు వేసే వెధవ వేషాలను ధైర్యంగా ఎదుర్కోలేనప్పుడు తెలివిగా తప్పుకోవడమే.

"టీఎం" కథలో సీతావసంత లక్ష్మిగారు టీవీల్లో వచ్చే యాడ్స్ గురించి రాశారు. జనానికి వస్తువుల పిచ్చి ఎక్కించడానికి వాళ్ళకి ఏకైక మార్గం టి.వి ఛానల్స్. యాడ్స్‌ని చూసి పనివాళ్లయినా వాళ్ళ స్థాయికి మించి ఖచ్చు చేస్తున్నారు. వీటిని నిషేధిస్తే కొంతయినా బాగుపడతారు.

– కె.శుభ, కుకట్‌పల్లి

# చిన్ని ఆతిథ్యం

-కె. అంజన

"ఫ్లాట్ నెం 204 ఇదే అనుకుంటానండి. అయితే ఇదే మన యమున వాళ్ల ఇల్లు....అబ్బ నాకు అంది చావదుగానీ కాలింగ్‌బెల్ నొక్కండి..." భర్త రామానికి ఆర్డర్ వేసేసి ఆపసోపాలు పడసాగింది రమణి.

కళ్లద్దాలు సవరించుకుంటూ కాలింగ్‌బెల్ నొక్కాడు రామం.

ఆ తర్వాత రెండు మూడు నిమిషాలకు కూడా తలుపు తెరుచుకుంటుందన్న ఆశ వారిద్దరిలోనూ పోయింది. కారణం ఇంటిలోపలి నుంచి పిల్లల నవ్వులు, అరుపులు పెద్దగా వినిపిస్తున్నాయి. వీటికితోడు నేనున్నానంటూ టీవీ ఒకటి మోగుతూనే ఉంది. ఆ గొడవలో కాలింగ్ బెల్ శబ్దం పిల్లల చెవులకు సోకిందో లేదో! అన్న అనుమానం వారిద్దరి మోముల్లోనూ స్పష్టంగా కనిపించసాగింది.

రామానికి రెండోసారి కూడా గంట మోగించక తప్పిందికాదు. ఈ దఫా మోగిన గంటకు  పిల్లలు అలెర్టయిపోయారు. పోటీపడి మరీ గబగబా వచ్చి తలుపు తీశారు.

రామం, రమణి నవ్వుతూ లోపలికి వెళ్ళారు. వారిని చూసేసరికి పిల్లలు సంతోషంతో గంతులు వేశారు. "ఓ.....ఊరినుండి అత్తయ్యా, మామయ్యా వచ్చారహో...." అంటూ పక్క ఫ్లాట్‌లోకి పరుగుతీశారు.

శెలవుల వాతావరణం యమున వాళ్ళ ఇంట్లో తొణికిసలాడుతోంది. యమున ఉద్యోగిని కావడంతో పిల్లలు మాత్రమే ఇంట్లో ఉంటారు. దాంతో వాళ్లిష్టం. ఆటలు, పాటలు, టీవీ, కంప్యూటర్ గేమ్స్, నేస్తాలతో ముచ్చట్లు, అలకలు, కొట్లాటలు...అన్నీ...అన్నీ ఉంటాయి.

సరిగ్గా  అప్పుడే రమణికి ఫోన్ చేసింది యమున. "ఇంటికి చేరారా' అంటూ ..ఫ్రిజ్జులో పాల ప్యాకెట్లు ....అల్మారాలో బిస్కెట్లు ఉన్నాయి. టీ పెట్టుకుని తాగండి....మీరొస్తారని అన్నం,కూర ఎక్కువే చేశాను. బద్ధకించకుండా తినేయండి. సాయంత్రం త్వరగా రావడానికి ప్రయత్నిస్తాను...ఇది సారాంశం. ఇద్దరూ యమున చెప్పినట్టే చేశారు.

కడుపులో ఇంత ముద్ద పడ్డాక సోఫాలో కూర్చుని ఆలోచనలో పడింది రమణి.

"ఏవండీ...మన యమునా వాళ్ల పిల్లలు మరీ ఇలా తయారయ్యారేంటీ! ఇంటికి గెస్టులొస్తే కనీస మర్యాదలు కూడా లేవు! పిల్ల ఏడేళ్ళదే అయినా...పిల్లాడు పెద్దాడేగా. పన్నెండేళ్ళు పైబడ్డాయి. వచ్చిన వాళ్ళకు మంచి మర్యాదా ఏమీ లేవు. ఇలాగైతే ఎలాగ..." అంది సాలోచనగా.

"ఏమోయ్! చూస్తున్నావ్‌గా యమున, యుగంధర్ ఇద్దరూ ఉద్యోగస్తులే. తెల్లారి లేచింది మొదలు ఉరుకులు, పరుగులు. ఇంక ఇవన్నీ నేర్పే తీరికెక్కడిది? పోనీలెద్దూ...అచ్చుమైన ఆడపడుచులా ఆలోచించకుండా కాసేపు విశ్రాంతి తీసుకో...తర్వాత మాట్లాడదాం" అని టీవీ ఆన్ చేశాడు రామం.

"ఆ...మీరన్నీ ఇలాగే తేలిగ్గా తీసుకుంటారు. నిన్న మనం వసుమతి ఇంటికెళ్లామా! వాళ్ళ పిల్లలు చూడండి ఎంత వైనంగా అతిథి మర్యాదలు చేశారో. " ఆంటీ కూర్చోండి మంచినీళ్ళు తీసుకుంటారా?" అని బాబు అంటే....'అంకుల్ కూర్చోండి. ఎండలో వచ్చారు మజ్జిగ తాగుతారా?" అని పాప.....ఎంత అభిమానంగా అడిగారు! నాకైతే ఎంత ముచ్చటేసిందో! వసుమతి, వాళ్ళాయన కూడా ఉద్యోగస్తులే. ఇద్దరి పిల్లల ప్రవర్తనలోనూ ఎంత తేడా ఉందో చూడండి. ఏదైనా నేర్పుకోవడంలో ఉంటుందండి....అయినా నాకెందుకులే ఈ బాధంతా. ఈ పెళ్ళి కార్డులేవో ఇచ్చేస్తే నా పనై పోతుంది" అంటూ కళ్ళు మూసుకుంది.

యమున, వసుమతి ఇద్దరూ ఉద్యోగినులే. ఇద్దరూ బయటికి వెళ్ళేవాళ్ళే. మరి పిల్లల ప్రవర్తనలో అంత తేడా ఎలా వచ్చింది? నేర్పుకోవడంలో జరిగిన లోపం వల్లే. మొక్కగా ఉన్నప్పుడే పందిరివేస్తే....మొక్క హాయిగా పందిరి చుట్టూ అల్లుకుంటుంది. కావాల్సినంత ఆలంబన, ఆదరవు ఉండడంతో బాగా ఎదుగుతుంది. పూలు, కాయలు సమృద్ధిగా ఇస్తుంది. అదే మొక్కను ఎటువంటి పందిరి లేకుండా వదిలేస్తే! నేలమీదే పడి దారిన వచ్చేపోయే వారి కాళ్ళ కింద పడి నలిగిపోవడం, పశువులకు మేత కావడం జరుగుతుంది. ఇంక ఫలసాయం సంగతి ఎక్కడ! పిల్లలు కూడా అంతే! చిన్నతనంలోనే వారికి మంచి చెడ్డలు  నేర్పించాలి. ఇంటికి వచ్చిన అతిథులను ఎలా గౌరవించాలో తెలియచెప్పాలి. అందునా ముక్కూ మొహం తెలీని వారితో ఎలాప్రవర్తించాలి? బంధువులు, స్నేహితులతో ఎలా మాట్లాడాలి? నేర్పాలి. కొత్తవారొస్తే ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో కూడా వివరించాలి. అదే సమయంలో గౌరవంగా సంభోదించడం,కూర్చోమని చెప్పడం, వారికి తాగడానికి, తినడానికి ఇవ్వడం...వారడిగిన ప్రశ్నలకు ముచ్చటగా సమాధానమివ్వటం.....అలవాటు చేయాలి. పిల్లలకు అల్లరీ ఉండాలి. అతిథులను గౌరవించడమూ తెలియాలి. అది పెద్దలుగా మనమే నేర్పాలి.

•

ఆణిముత్యాలు

## బేగం హజ్‌రత్ మహల్

బేగం హజ్‌రత్ మహల్ ఒక పేద కుటుంబంలో జన్మించారు. ఆమె నవాబ్ వజాద్ అలీషాహ్‌కు అమ్మివేయబడింది. ఎప్పుడయితే బ్రిటీష్ వారు తమ రాజ్యాన్ని ఆవద్ యొక్క రాజ్యానికి పొడిగించారో, అప్పుడు ఆమె మాత్రమే బ్రిటీష్ వారిని ఎదిరించి నిలిచింది. ఆమె యుద్ధంలో పాల్గొనటమే కాదు వ్యూహాలు, నీతులు, వ్యూహ రచనలు కూడా బ్రిటీషువారి ఎదురుగా చేసేది. ఆమె ఎప్పుడూ బ్రిటీషువారికి లొంగిపోలేదు. వారి నివేదనలను కూడా ఆమె తిరస్కరించేది. కాని ఆమె స్వయంగానే నేపాల్ దేశానికి వెళ్ళిపోయింది. అక్కడే ఆమె మరణించింది.

ఆరోగ్యం

# అరవై సంవత్సరాలు పైబడిన స్త్రీల ఆరోగ్యం

గత సంచిక తరువాయి

- చాగంటి కృష్ణ కుమారి

ఫోన్ మ్రోగుతుంది...

**సాంబ:** హలో లతా! ఎక్కడి నుండి?

**లత:** ఇంకో 20 నిముషాలలో అక్కడ ఉంటాను బావా. ఇప్పుడే నారాయణరావుగారితో మాట్లాడాను. అక్కది క్యాన్సర్ కాదు. బయాప్సీకి రొటీన్‌గా పంపుతారు. రిపోర్టులో బినైన్ అంప్ అనే వస్తుంది. మోహన్ చెప్పే ఉంటాడు. నేను వచ్చాక అక్కకి అన్ని జాగ్రర్తలూ, వివరాలు చెపుతాను.

**సాంబ:** సరేలతా!

**కాంతమ్మ:** ఎవరూ లతేనా! ఆ పిల్ల తలచుకుంటే కారేసుకుని క్షణంలో వచ్చేస్తుంది. ఆపిల్లకీ వృద్ధాప్యం తప్పదంటావా?

**మోహన్:** (నవ్వుతూ) ఎంతటివారికైనా తప్పదు బామ్మా!

**కాంతమ్మ:** మీ డాక్టర్లు మందులేమీ కనిపెట్టలేదా?

**మోహన్:** ముసలితనం రాకుండా ఆపలేము కానీ కొన్ని సూచనలిస్తాము. చూడు నీ కీళ్ళు అరిగి కండ బలం తగ్గి నడకలో తేడా వచ్చి పడిపోయే ప్రమాదముంది. పడిపోతే ఎముకలు విరిగిపోతాయి. జాగ్రత్తగా చూసుకుని నడవాలి. అందుకనే రాధా, నేను బాత్రూం ఎప్పుడూ పొడిగా ఉంచుతూంటాం. ఎండలో కూర్చోవద్దని, చర్మానికి నూనె రాసుకోవాలి. ఇటువంటి చిన్న చిన్న జాగ్రత్తలు చెప్పగలం కానీ ముసలితనం రాకుండా చేయడానికి మేము సృష్టికర్తలమా ? కాల చక్రాన్ని ఆపగలమా లేక దాని వేగాన్ని తగ్గించగలమా చెప్పుబామ్మా!

**బాబీ:** అదిగో లత బామ్మ వచ్చేసింది బామ్మా!

**లత:** ఏరా బాబిగా బాగా చదువుకుంటున్నావా? ఇవిగో నీకోసం ఐస్‌క్రీమ్‌లు తెచ్చాను వెంటనే ఫ్రీజర్‌లో పెట్టుకో.

**బాబి:** థాంక్స్ బామ్మా!

**మంగ:** ఏకంగా అన్ని తెచ్చావేమిటే?

**లత:** ఓ నాలుగు రోజులపాటు తింటాడు తిననీ ఇప్పుడు కాక ఎప్పుడు తింటాడు? మనం తినగలమా!

**సాంబ:** ఎందుకు తినలేము మీ అక్కకి ఇష్టం కూడాను.

**లత:** నా ఉద్దేశ్యం తినడం మంచిదికాదని. కొవ్వు పెరుగుతుందని. మనలాంటివాళ్ళం నోరు కట్టుకోవాలి బావా.

**కాంతమ్మ:** లతా, ఎండన పడి వచ్చావు ఈ మజ్జిగ తాగు అల్లం పచ్చి మిరపకాయల ముక్కలు వేసి నిమ్మరసం పిండి చేసాను.

**సాంబ:** ఎండా పొడా లత ఎసి కారులో వచ్చిందమ్మా! కాఫీ ఇమ్మంటావా లతా?

**కాంతమ్మ:** అయితే మాత్రం స్వంతంగా నడుపుకు వచ్చిందిగా!వెధవ కాఫీలు పైత్యం చేస్తాయి మజ్జిగ ఎంతమంచి చేస్తుందో నీ డాక్టరు కొడుకునడుగు.

**లత:** ఇటువంటి అత్తగారు దొరకటం మా అదృష్టం.

**కాంతమ్మ:** లతా ఈ ఆపరేషన్ వల్ల జుత్తు ఊడిపోతుందని మీ అక్క భయపడుతోంది.

**మంగ:** ముందే నాజుత్తు ఊడిపోతోంది ఈ ఆపరేషన్ వల్ల మరింతగా ఊడుతుందా లతా?

**లత:** ఆపరేషన్ వల్ల అంతగా ఊడదు. కీమోథెరపీ వల్ల జుట్టు రాలుతుంది నిజమే కానీ నీకు అ థెరపీ అవసరం లేదు. నిజానికి ముందులు కూడా అవసరం లేదు. ప్రొటీన్లు, పీచుపదార్థాలు ఉన్న కూరగాయలు, పళ్ళు తినాలి. ఆహారంలో మార్పులు అవసరం. అందునా వయస్సుతో జుత్తు ఊడటం సహజం.

కాంతమ్మం అలా చెప్పు నా కోడలికి. నాకు ఏ ఆపరేషన్లు అయ్యాయని నా జుత్తు ఊడిపోయి మాడు బైటికి కనిపిస్తుంది?

**సాంబ:** మా అమ్మకి ఒత్తుగా చాలా పెద్ద జడ ఉండేది. 60 ఏళ్ళు వచ్చినా కూడా జుత్తు బాగానే ఉండేది.

**లత:** స్త్రీలలోనూ, పురుషులలోను కూడా వయస వస్తున్నకొద్దీ జుత్తు ఊడిపోవటం సహజం. పురుషులకు బట్టతల రావడం వృద్ధాప్యం వచ్చిందనటానికి సూచనయితే ఆడవారికి జుత్తు పలచబడి మాడు పైకి కనిపిస్తుంది. ముఖం మీద బిరుసుగా వెంట్రుకలు ముఖ్యంగా గెడ్డం మీదా పెదవులకిరువైపులా వస్తాయి.

**బాబి:** అవ్వ మూతిమీద పిల్లికున్నట్లు వెంట్రుకలున్నాయో చూడండి. అందువల్లే నాకు అవ్వ ఎంతో ముద్దొస్తూంటుంది.

**కాంతమ్మ:** అబ్బా! నన్ను పట్టుకుని లాగకురా నా మెడ నెప్పెడుతుంది. చచ్చి నీ కడుపున పుడుపున పుడతాను. అప్పుడు ముద్దులాడుదువుగాని, ఇప్పుడు నన్ను పట్టుకుని ఊపేయకు. నీ ధాటీకీ చూడా నాకాలి గోరు ఊడి వచ్చిందో చూడు.

**లత:** ఆ నైల్ కట్టర్ ఇలా తేరా బాబీ! అత్తయ్య కాలిగోర్లు ట్రిం చేస్తా.

**మోహన్:** గోర్లు పెళుసుగా అవడం, కాంతి హీనంగా, పసుపచ్చగా మారిపోవడం కూడా వృద్ధాప్యపు లక్షణాలే బామ్మా!

**బాబి:** ఇన్ని ముసలి లక్షణాలు ఉన్న అవ్వని ముసలి అంటే ఉడుక్కుంటుంది చూడు. లత బామ్మా! అవ్వ దవడలు ఎలా వ్రేలాడిపోయాయో! కళ్ళకింద చర్మం ముడుతలు దేరిపోయింది. చెవులు పెద్దవిగా కనిపిస్తున్నాయి.

**లత:** కంటి గూడు లోని కొవ్వు తగ్గడం వల్ల కళ్ళు లోతుకుపోయి కళ్ళ కదలికలు తగ్గుతాయి. క్రింది రెప్పలు సంచీలా వదులుగా వ్రేలాడుతాయి. వృద్ధాప్యం వస్తున్నకొద్దీ ఈ మార్పులు వస్తాయి.

**మోహన్:** పళ్ళు ఊడిపోవటం, పంటి కుదుర్లు వెనక్కి పోయి దవడ ఎముకలలోని పదార్థం తగ్గి ముఖం కింది బాగం తగ్గుతుంది. అందుకే ముసలివారి ముక్కు, నోరు, నుదురు, చెవులు పెద్దవిగా కనిపిస్తాయి.

మంగ: లతా! నాకీమధ్యన మబ్బుపట్టినట్టుగా కనిపిస్తూ కళ్లు మసకబారినట్లు ఉంటోంది. ఇదీ వృద్ధాప్య లక్షణమేనంటావా?

లత: వయసు మీదికి వస్తున్న కొద్దీ కన్నీళ్ళు తగ్గుతాయి. కార్నియా సున్నితత్వాన్ని కోల్పోతుంది. 60 ఏళ్ళ వయసు వచ్చేసరికి కనుపాప 20 ఏళ్ళ వయసులో ఉన్న సైజుకి మూడోవంతు తగ్గిపోతుంది. కంటి కటకాలు పసుపుపచ్చనవుతాయి. అందుకే మసగ్గా ఉన్నట్టు కనిపిస్తుంది. కళ్ళను త్రిప్పటానికి కంటి కండరాలు బలాన్ని కోల్పోతాయి.

మంగ: అత్తయ్యగారిలా నాకూ శుక్లాలు రావుకదా?

లత: ప్రస్తుతానికి ఏమీ లేదులే. కళ్ళ వ్యాయామం చేస్తూ ఉండు. మెరుపులాంటి కాంతి చూడడానికి ఇబ్బంది అనిపించటం, కంటిలో ఏవో తేలుతున్నట్లు అనిపించినప్పుడు వాటి సంఖ్య పెరిగితే తప్పక డాక్టర్ని సంప్రదించాలి.

బాబి: కంటి శుక్లాలు అంటే కాటరాక్ట్ కదూ!

మోహన్: కంటిలో పొర ఏర్పడుతుంది. అది కూడా వృద్ధాప్య లక్షణమే.

మంగ: నీటి కాసులు అనే ఈ దృష్టి దోషం ప్రమాదమైనదంటారు.

లత: సరైన సమయంలో చికిత్స అందకపోతే గ్రుడ్డివారైపోతారు.

రాధ: అందుకే అరవై ఏళ్ళు పైబడిన వారు తరచుగా మెడికల్ చెకప్ చేయించుకుంటూండాలి.

లత: 60 ఏళ్ళ వరకూ నాలుగు రుచులూ తెలుస్తాయి. ఆపైబడినప్పటినుండీ రుచులను గుర్తించలేరు. ఎందుకంటే వారికి రుచి బొడిపెలు తగ్గిపోయి లాలాజలం తగ్గుతుంది, నోరు పొడిబారుతుంది, మింగటం కష్టమవుతుంది.

బాబి: ఓ అందుకేనా అవ్వ తాతను పట్టికబెల్లం తెమ్మని అడుగుతుంటూంది.

కాంతమ్మ: అవునురా నువ్వూ, నా కోడలూ వంతుకి వస్తూంటారుగా!

బాబి: అవ్వా నీకు నమలడం, మింగడం కష్టం కదూ! చపాతీని ముక్కలు చేసుకుని పాలలో నానబెట్టుకుని తింటావుగా అయినా నీకు అన్ని రుచులూ తెలుసునే. అమ్మ బామ్మల కంటే నువ్వే బాగా వండుతావుగా!

సాంబ: మా అమ్మ ఆరోగ్యవంతురాలు బాగా! జెనిటికల్‌గా వచ్చే కొన్ని లక్షణాల వల్ల మా అమ్మ 80 ఏళ్ళు పైబడినా ఆరోగ్యంగానే ఉంది. ముసలి లక్షణాలు అందరికీ ఒకేలా రావు. కొంత తేడాలలో రావొచ్చు.

లత: అలవాట్లని బట్టి కూడా ఉంటుంది బావా! పోషక విలువలు గల ఆహారాన్ని తీసుకుంటూ మనసు ప్రశాంతంగా ఉంచుకుంటూ శరీర కష్టం కూడా చేస్తూ ఉంటే వృద్ధాప్యం ఆలస్యంగా వచ్చే అవకాశం ఉంది.

సాంబ: ఆ సంగతి మీ అక్కకు బోధపరుచు.

మంగ: రాత్రిళ్ళు నిద్రపట్టదే. అందువల్ల పగటిపూట కాస్త డల్‌గా ఉంటాను.

లత: రాత్రిళ్ళు నీ వయసు వారికి మూడు నాలుగుసార్లు మెలకువ రావటం సహజమే! అయితే మొత్తం మీద 6,7 గంటలు నిద్ర ఉంటుంది అదిచాలు. మెలకువ వస్తే ఉండడం వల్ల తెలివిగా ఉన్నాం అనే స్పృహ వల్ల రాత్రి నిద్రపోలేదనిపిస్తుంది.

మంగ: ఎప్పుడూ ఏవో ఆలోచనలు ముంచెత్తుకొస్తాయి.

లత: అటువంటప్పుడు లేచి ఏదైనా పుస్తకం చదువుకోవడమో, చిన్నగా సంగీతం వినటమో చేస్తే అరగంటలో మళ్ళీ నిద్ర పడుతుంది. సంతోషంగా ఉండటానికి ప్రయత్నించాలి. చిన్న చిన్న ఇబ్బందులను తేలిగ్గా తీసుకోవాలి.

మంగ: రాత్రి అంతా అసలు మెలకువ రాకుండా ఉండటానికి ఏదైనా చిట్కా చెప్పవే.

లత: సాయంత్రం టీ, కాఫీలు తాగకు. ముఖ్యంగా పడుకోవడానికి 4-5 గంటముందు కోకోకోలా వంటివి అసలే పనికిరావు. వాటిని ఎప్పుడూ తాగకుండా ఉంటే మంచిది. నువ్వే కాదు ఎవ్వరూను. పగటిపూట నిద్రపోకు. రోజు ఉదయం సాయంత్రం రెండు కి.మీ నడుస్తూ ఉండు. ప్రతీరోజూ ఒకే సమయానికి నిద్రపోవాలి. పడుకోవడానికి తప్ప పడకగదిలోకి వెళ్ళకు. ఇలా చేస్తే నిద్ర బాగాపడుతుంది.

మంగ: రేపు బైయాప్సీ రిపోర్టు వస్తుందట ఏమని వస్తుందో?!

సాంబ: మీ అక్కకి ఈ దిగులు ఎక్కువగా ఉంది లతా!

కాంతమ్మ: అది ఈ మధ్య ఉదాసీనంగా ఉంటోంది. అందుకే నిన్ను పిలువమన్నాను.

లత: బయాప్సీ రొటీన్‌గా చేసేదే. నీది కాన్సర్ కాదక్కా! చెప్పాను కదా! స్త్రీలు 45-50 వయసుకి నెలసరి ఆగిపోయేదశకు చేరుతారు. కొంతమందికి 50-55 వరకూ ఆగకపోవచ్చు. అండాశయం నుండి అండం విడుదల ఆగిపోవడంతోనే నెలసరి ఆగిపోతుంది. యోనిగోడలు సాగే లక్షణాన్ని కోల్పోతాయి. పలుచగా మారతాయి. రసాలు ఊరడం తగ్గుతుంది. లైంగికపరమైన స్పందనలు తగ్గిపోతాయి. ఘన కండరాలు పట్టుతగ్గుతుంది. యోని స్థానం తప్పుతుంది. అంటే యోని, గర్భాశయం, మూత్రకోశం వాటి స్థానాలనుండి జరిగిపోతాయి. దీని ప్రభావం వల్ల మూత్రాన్ని ఆపుకోలేని స్థితి, కొంతమందిలో జననేంద్రియాల దగ్గర దురదలు, తరచూ మూత్ర విసర్జన, ఫలితంగా మూత్రకోశ వ్యాధులు రావొచ్చు. యోని గోడలు పలచబడిన కారణంగా కొంతమంది స్త్రీలకి సంయోగ క్రియ బాధకరం కావొచ్చు. మానసికమైన ఆందోళనలూ, తలనొప్పి, నిద్రలేమి వంటివి సహజంగా కనిపించే లక్షణాలు.

రాధ: ఈ విషయాల గురించిన అవగాహనా సదస్సులను మీరు నిర్వహించినట్టున్నారుగా అత్తయ్యా!

లత: అవును మళ్ళీ ఈ నెలాఖరున ఉన్నాయి. మా అక్క నువ్వు కలిసి రండి

సాంబ: 60 ఏళ్ళు పైబడిన స్త్రీలకు సాధారణంగా వచ్చే జబ్బులు ఏమిటి?

లత: కీళ్ళవాతం, క్యాన్సర్, గుండెపోటు, జారిపడటం వల్ల చేయి తుంటి ఎముకలు విరగటం, థైరాయిడ్, కంటిచూపు మందగించటం, పార్కిన్సన్ రోగం, రొమ్ము, గర్భాశయ, గర్భాశయద్వార, గర్భాశయ లోపలిపొర, ఊపిరి తిత్తులు, అండాశయ, చర్మ క్యాన్సర్‌లు రావచ్చు.

కాంతమ్మ: ఏ రోగాలూ లేకుండా చెట్టునుండి పండు రాలినట్టు రాలిపోవాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. •

# ఉద్యమ బాటలో

**"ఐ లవ్యు యు టీచర్" సినిమా టైటిల్ మరియు పోస్టర్ల పట్ల తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేస్తూ....**

సూర్యలోక్ ఫిలిమ్స్ ఫ్యామిలీ పతాకంపై నిర్మిస్తున్న **"ఐ లవ్యు యు టీచర్"** సినిమా టైటిల్‌ను మార్చమని డిమాండ్ చేయడంతోపాటు సినిమాకు సంబంధించిన పోస్టర్లు, మీడియో క్లిపింగ్స్‌పై ఐద్వా తీవ్రమైన అభ్యంతారాన్ని వ్యక్తం చేస్తూ ఉంది. గతంలో వచ్చిన గోల్కొండ హైస్కూల్, తారేజమీన్‌పర్ లాంటి చిత్రాలు సమాజానికి సందేశాన్ని ఇచ్చాయి. ప్రేక్షకులు బాగా ఆదరించారు. అటువంటి అభ్యుదయ సినిమాలను ఆదర్శంగా తీసుకోకుండా చౌకబారు టైటిల్స్‌తో అసభ్య, అశ్లీల పోస్టర్లతో మహిళల స్థాయిని దిగజార్చేవిధంగా, నైతికతను దెబ్బతీసేవిధంగా **"ఐ లవ్యు యు టీచర్"** లాంటి సినిమాలు తీయటం దురదృష్టకరం. గతంలో వచ్చిన ఆంటీ సినిమా సందర్భంగా కూడా మహిళలు అనేక రకాలుగా టీజింగ్‌కు గురయ్యారు. సినిమాల్లో



మహిళలను వ్యంగ్యంగా, కించపరిచేలా, హాస్యాస్పదంగా, అసభ్య, అశ్లీలంగా చూపించటం, చిత్రీకరించటం మానుకోవాలి. సమాజంలో నగభాగమైన మహిళలు నేటికి అడుగడుగునా వివక్షత, అనమానతతోపాటు రెండవ తరగతి పౌరులుగా వరిగణించబడతున్నారు. మహిళలు సామాజిక, ఆర్థిక, రాజకీయాభివృద్ధి చెంది, సాధికారత సాధించేందుకు తనవంతు సహకారాన్ని అందించాల్సిన బాధ్యత మీడియాపై ఉంది.

కావున మహిళల వ్యక్తిత్వాన్ని దిగజార్చే పద్ధతిలో ఉండటంతోపాటు టీచర్లు, మహిళలను టీజ్ చేసే విధంగా ఉన్న **"ఐ లవ్యు యు టీచర్"** సినిమా టైటిల్‌ను వెంటనే మార్చడంతోపాటు నిర్మాణాన్ని పునఃసమీక్షించాలని అసభ్య, అశ్లీల పోస్టర్లలను తొలగించాలని ఐద్వా రాష్ట్ర కమిటీ కోరుతోంది. మా విజ్ఞప్తిని విజ్ఞతతో పరిశీలించాలని కోరుతూ సెన్సార్‌బోర్డు ఆఫీసర్‌కి ఐద్వా మెమోరాండం సమర్పించింది.

ఇంటిపని వారి సమస్యలపై

ఇంటిపనివారల రాష్ట్ర సదస్సు సి. అరుణగారి అధ్యక్షతన సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగింది. రాష్ట్ర నలుమూల నుండి సదస్సుకు 600 మంది మహిళలు హాజరయ్యారు. సదస్సులో ముఖ్య



వక్తగా కార్మిక శాఖ ప్రిన్సిపల్ సెక్రటరి డి. శ్రీనివాసులుగారు హాజరై రాష్ట్రీయ స్వాస్థ్రీయ భీమా యోజన ఇంటిపనివారికి వర్తిస్తుందని, స్మార్ట్ కార్డులు మే 1 తరువాత ఇస్తామని, వేతనాలలో సవరణ చేస్తామని వాగ్దానం చేశారు. పెన్షను, ఇళ్ళ స్థలాలు,రేషన్ కార్డులు వంటి తదితర సమస్యలపై జిల్లా కలెక్టరు ద్వారా అమలు జరిగేలా చేస్తామని చెప్పారు. ఇంటిపనివారల సమస్యలపై ఇంటిపనివారల రాష్ట్ర కన్వీనరు టి. జ్యోతి తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. సభలో సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షురాలు వి.రోజా, ఐద్వా రాష్ట్ర కార్యాదర్శి కె.స్వరూపరాణి, రాష్ట్ర ఉపాధ్యక్షులు బి.హైమవతి, ఆశాలత తదితరులు పాల్గొన్నారు. సభలో జిల్లాల నుండి వచ్చిన రమణ, నిత, ఆశచ లక్ష్మి, తిరుమల, లక్ష్మమ్మ, కన్నమ్మ, సారమ్మ, సుభద్ర, కనకదుర్గ వారు ఎదుర్కొంటున్న సమస్యలపై మాట్లాడారు. స్నేహ ఇంటిపనివారల సంఘం రాష్ట్ర అధ్యక్షులుగా వినోద, కార్యదర్శిగా ఆశలత 47 మందితో కమిటీ ఏర్పడింది.



పెంచిన విద్యుత్ ఛార్జీలను వెంటనే ఉపసంహరించాలి

అసెంబ్లీ సమావేశాలు ముగిసిన వెంటనే దొడ్డిదారిని విద్యుత్ చార్జీలు భారీగా పెంచింది. ఆర్‌టిసి చార్జీలు, నీటిపన్నులు, ఆస్థిపన్నులు, పెట్రోల్ చార్జీలు నిరంతరం పెరుగుతున్నాయి. నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదలతో సామాన్య, మధ్యతరగతి ప్రజల జీవన పరిస్థితులు దిగజారుతున్నాయి. రాష్ట్రంలో వ్యవసాయం సంక్షోభంలో ఉంది. చిన్న పరిశ్రమలు విద్యుత్ సప్లై సక్రమంగా

లేక మూతపడుతున్నాయి. డిమాండ్‌కి తగ్గట్లుగా నాణ్యమైన విద్యుత్‌ను అందించటంలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది. 2000 సంవత్సరంలో ప్రపంచ బ్యాంకు సంస్కరణలో భాగంగా ఆనాటి ప్రభుత్వం విద్యుత్ చార్జీలు పెంచితే రాష్ట్రంలో పెద్ద ఎత్తున విద్యుత్ ఉద్యమాలు జరిగాయి. ఆనాడు కాంగ్రెసు పార్టీ కూడా ఆ ఉద్యమంలో పాల్గొంది. విద్యుత్ చార్జీలు పెంచనని వాగ్దానం చేసి అధికారం లోకి వచ్చిన కాంగ్రెసు 2010 గుట్టు చప్పుడు కాకుండా 1400 కోట్లు 2011లో 641 కోట్లు చార్జీలు పెంచింది. విద్యుత్ చార్జీలు పెంచటం వలన అన్ని రకాల వినియోగ వస్తువులు ధరల పెరుగుదలకు అవకాశాలున్నాయి. మహిళలకు, సామాన్యులకు ఇది మరింత భారం పడుతుంది. పెంచిన విద్యుత్ చార్జీలకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రజలు ఉద్యమించాలి పెంచిన విద్యుత్‌చార్జీలను వెంటనే ఉపసంహరించాలని డిమాండ్ చేస్తూ సుందరయ్య పార్కు వద్ద ప్రభుత్వ దిష్టిబొమ్మ దగ్ధం ఐద్వా రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో జరిగింది. జిల్లాలలో కూడా ఆందోళన, కరపత్ర ప్రచార కార్యక్రమం నిర్వహించారు.




### సమానత్వ ప్రాతిపదికనే విడాకుల సవరణలు చేయాలి

మోటూరు ఉదయం ట్రస్టు కుటుంబ న్యాయసలహా కేంద్రం ఆధ్వర్యంలో విడాకుల చట్టంలో ఇటీవల కేంద్ర కేబినెట్ ప్రతిపాదించిన సవరణలపై అవగాహనా సదస్సు జరిగింది. విడాకుల చట్టంలో సవరణలు వివాహ చట్టాలపై ఆధారపడి ఉండాలనీ, ఇది వ్యక్తి సమానత్వం ప్రాతిపదికన జరగాలనీ ప్రముఖ న్యాయ నిపుణులు మాడభూషి శ్రీధర్ అన్నారు. ఆర్థికంగా స్త్రీలకూ, పిల్లలకూ రక్షణ కల్పించిన తరువాత మాత్రమే విడాకులు సులభతరం చేయాలని, స్త్రీలకూ, పిల్లలకూ తప్పనిసరిగా నివాస హక్కు కల్పించాలని ఆయన



పేర్కొన్నారు. "సఖ్యతకు వీలుగాని దాంపత్యం" అనే కారణంతో విడాకులు మంజూరు చేసేటప్పుడు వివాహానంతర ఆర్జిత ఆస్తిలో స్త్రీలకు సమాన వాటా ఉండాలని, భరణం వారి వైవాహిక జీవన స్థాయిని నిలబెట్టడానికి సరిపడేంతగా ఉండాలని ఆయన నొక్కి చెప్పారు. అసలు మనదేశంలో భార్యకు వారసత్వ హక్కు లేదని భర్త మరణిస్తే గాని వాటా రాదని , విడిపోయినా, భర్త వదిలేసినా స్థిరాస్తి వారసత్వంగా రాదని, ఇది వివాహంలో అసమానతకు నిదర్శనం అని ఆయన విమర్శించారు. ఇంట్లో భార్య చేసే పనికి విలువ ఆ కుటుంబ ఆదాయం-ఆర్థిక స్థాయిని బట్టి నిర్ధారించాలనీ, అట్లాగే భార్యల ఇ మెయిల్‌లలో భర్తల జోక్యం నివారించాలని లేకుంటే అది సైబర్ నేరాలకు కారణం అవుతున్నదని ఆయన చెప్పారు. భర్త ఆస్థిలో ఎంత వాటా భార్యకు ఇవ్వాలో కోర్టులను నిర్ధారించమనడం అనేక అన్యాయాలకు, విపరీతమయిన జాప్యానికి కారణం అవుతుందని ఆయన విమర్శించారు. ఈ సమావేశంలో పాల్గొన్న మరో ప్రముఖ న్యాయవాది మూసా అహ్మద్ కుటుంబంలో విడాకుల్లో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను వివరించారు.

### మోటూరి ఉదయం 10వ వర్ధంతి సభ

ఐద్వా నిర్మాతల్లో ఒకరైన మోటూరు ఉదయం 10వ వర్ధంతి సభ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ట్రస్టు ఛైర్మన్ మల్లు స్వరాజ్యం అధ్యక్షతన జరిగింది.

ట్రస్టు సభ్యురాలు, ఐద్వా సీనియర్ నాయకురాలు అల్లూరి మన్మోహినిగారు ఉదయం చిత్రపటానికి పూలమాల వేసి జోహార్లర్పించి సభను ప్రారంభించారు. మోటూరి ఉదయం ట్రస్టు కార్యక్రమాల్లో ఒకటైన కుటుంబ న్యాయ సలహా కేంద్రాలు రాష్ట్రంలో 13 జిల్లాలలో, హైద్రాబాద్ నగరంలో మూడు కేంద్రాలలోను నడుస్తున్నాయి. ఈ



కార్యక్రమం ద్వారా ఎన్నో వందల కుటుంబాలలోని ఘర్షణలు, కలతలు పరిష్కారమవుతున్నాయి. ఇటువంటి న్యాయహాయ కేంద్రాలు ఇంకా ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. ఆడపిల్లల ఆత్మరక్షణ శిక్షణా కేంద్రాల కూడా ఏర్పాట్లు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని పుతుంబాక భారతి చెప్పారు.

### పుస్తకావిష్కరణ

ట్రస్టు కోశాధికారి మోటూరు టాన్యా 26-10-2011 తేదీన అనారోగ్యంతో మరణించారు. ఆమె జ్ఞాపకాలతో కూడిన "నిష్కళంక ప్రజాసేవకురాలు - డా॥టాన్యా" అనే పుస్తకాన్ని 31-3-2012 తేదీన ప్రముఖ చిన్న పిల్లల వైద్య నిపుణులు డా॥ శ్యామలాంబగారు ఆవిష్కరించారు. డా॥టాన్యాగారి భర్త అయిన ప్రముఖ వైద్యులు డా॥ రంగారావుగారు, కుమార్తె ఉదయిని, సోదరుడు



పూర్ణచంద్రరావుగారు పాల్గొని టాన్యాతో తమ అనుబంధాన్ని గుర్తుచేసుకున్నారు. ఈ పుస్తకంలో సహచరులు, స్నేహితులు, బంధువులు టాన్యాతో తమకున్న అనుబంధాన్ని పంచుకుంటూ అంజలి ఘటిస్తూ చేసిన రచనలు అందరి మనస్సులపై గాఢంగా ముద్రవేశాయి.

**ఐద్వా ఆధ్వర్యాన గోదాముల ముట్టడి**

ఆహార భద్రతా బిల్లును సవరించి, నగదు బదిలీని వెనక్కి



తీసుకోవాలని, ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్టపరచాలని కోరుతూ ఐద్వా ఆధ్వర్యాన 26-4-12తేదీన రాష్ట్రంలో పలుచోట్ల సివిల్ సప్లైస్ ఆఫీసుల ముందు ధర్నాలు, గోదాముల ముట్టడి జరిగింది. ప్రజాపంపిణీ వ్యవస్థను నిర్వీర్యం చేసే విధానాలను నిరసిస్తూ నినాదాలు చేశారు. రేషన్ షాపుల్లో 14 రకాల నిత్యావసర వస్తువులను ఇవ్వాలని, ఆధార్ కార్డుతో రేషన్‌కు లింక్ పెట్టకూడదని, ప్రతీ కుటుంబానికి 35 కిలోల బియ్యం ఇవ్వాలని ఈ సందర్భంగా డిమాండ్ చేశారు. కర్నూల్‌లో జరిగిన ముట్టడి కార్యక్రమంలో పోలీసులు విచక్షణారహితంగా మహిళలను ఈడ్చుకెళ్ళి అరెస్టు చేశారు. నల్గొండ, ఖమ్మం, ప్రకాశం జిల్లాలలో కూడా ఎఫ్.సి.ఐ గోడౌన్‌ల ముట్టడి జరిగింది. వరంగల్,అనంతపురంలలో పౌరసరఫరాల అధికారికి మెమోరాండం ఇచ్చారు. ఒంగోలు, పామూరు, విజయవాడ, కాకినాడ, కందుకూరు, విజయనగరం, విశాఖ, రంగారెడ్డి జిల్లా ఘట్‌కేశ్వర్‌లో ధర్నాలు జరిగాయి. హైద్రాబాద్‌లో రాష్ట్ర పౌరసరఫరాల కార్యాలయం ముందు ధర్నా చేసి కమిషనర్‌కు మెమోరాండం ఇవ్వగా కేంద్ర ప్రభుత్వం దృష్టికి అన్ని అంశాలను తీసుకెళతానని, ఫుడ్ అడ్వయిజరీ కమిటీల్లో ఐద్వా సభ్యులకు భాగస్వామ్యం కల్పిస్తామని, రేషన్ షాపుల్లో ఎదురవుతున్న సమస్యలు పరిష్కరించడానికి చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు.

•

# శభాష్ సూకీ!

మయన్మార్ పార్లమెంట్‌కు జరిగిన ఉప ఎన్నికల్లో ప్రజాస్వామిక ఉద్యమ నేత ఆంగ్‌సాన్ సూకీ ఘన విజయం సాధించడం హర్షణీయం. సుదీర్ఘకాలంగా ప్రజాస్వామ్యం కోసం పోరాటం సాగిస్తున్న ఈ అరవయ్యారేళ్ళ మహిళానేత, నోబెల్ శాంతి పురస్కార గ్రహీత పార్లమెంటులో తొలిసారి అడుగిడనున్నారు. మొత్తం 45 స్థానాలకు జరిగిన ఈ ఉప ఎన్నికల్లో దాదాపు 64 లక్షల మంది ఓటర్లు తమ ఓటుహక్కును వినియోగించుకున్నారు. దీర్ఘకాలిక విరామం అనంతరం పార్లమెంట్‌కు జరిగిన ఈ ఉప ఎన్నికల్లో తమ ఓటుహక్కును వినియోగించుకునేందుకు ఉత్సాహంగా బారులు తీరారు. ఈ ఎన్నికల ప్రక్రియ సజావుగా కొనసాగితే ఇప్పటి వరకూ తాము అమలు చేస్తున్న ఆంక్షలను సడలిస్తామని అమెరికా, ఐరోపా యూనియన్ మయన్మార్‌కు హామీ ఇచ్చాయి. మయన్మార్‌లో 2008 రాజ్యాంగం ప్రకారం ఇప్పుడు పరిపాలన కొనసాగిస్తున్న ప్రభుత్వంలో 25 శాతం స్థానాలు సైన్యం చేతిలో ఉండడమేగాక పార్లమెంటు చేసిన నిర్ణయాలను వీటోచేసే అధికారం కూడా సైన్యానికి ఉంది. 2010 తరువాత అనేకమంది రాజకీయ ఖైదీలకు ప్రభుత్వం స్వేచ్ఛ కల్పించింది. దీంతోపాటు దేశంలో మీడియా ప్రతినిధులకు కూడా పాక్షిక స్వేచ్ఛ లభించింది. దశాబ్దాలుగా గృహనిర్బంధంలో వున్న ఆంగ్‌సాన్ సూకీ, ఆమెనేతృత్వంలోని ఎన్ఎల్‌డి దేశ రాజకీయ ప్రక్రియలో భాగస్వాములయ్యేందుకు వీలేర్పడింది.

# అగ్నిశిఖ టెస్సీ థామస్

అవనిలో అతివ పాత్ర
అన్నం వండటానికే కాదు
క్షిపణుల తయారీలో కూడా
అనంతమని నిరూపించావు!
అణ్వస్త్రాల పేరుతో భయపెట్టాలని చూసే
అహంకారపు దేశాలకు
అగ్ని-5తో సవాలు విసిరావు
అమ్మగా ఇంటికే కాదు
అతివగా దేశానికే వన్నె తెచ్చావు
అస్త్రాల కోసం ఆరాటపడే
మాతృభూమికి ఆత్మవిశ్వాసాన్నిచ్చావు!
అంబరాన అగ్నిశిఖవైనావు!!

**(అణ్వస్త్ర సామర్థ్యమున్న ఖండాంతర బాలిస్టిక్ క్షిపణి అగ్ని-5ని విజయవంతంగా ప్రయోగించిన ప్రాజెక్టులో కీలపాత్ర పోషించిన టెస్సీ థామస్‌కు మానవి అభినందనలు తెలుపుతోంది.)**

- మానవి డెస్క్

## మార్చి 8, అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా వివిధ జిల్లాల్లో జరిగిన కార్యక్రమాల దృశ్యమాలిక



హైదరాబాద్



కృష్ణాజిల్లా



ఆదిలాబాద్


తూర్పుగోదావరి



నిజామాబాద్



కడప



CMV01A135

ఫించన్లు, డ్వాక్రా సంఘాలకు లోన్స్, రేషన్ కార్డులు, ఏరియా డెవలప్‌మెంట్స్,

అభివృద్ధి పథంలో 121వ డివిజన్



శ్రీ ఎన్. కిరణ్‌కుమార్‌రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి



శ్రీ బొత్స సత్యనారాయణ
పిసిసి ప్రెసిడెంట్



శ్రీ కొణిదెల చిరంజీవి
రాజ్యసభ సభ్యులు





శ్రీ సర్వే సత్యనారాయణ
ఎం.పి.



శ్రీ వద్దేపల్లి నర్సింగ్‌రావు
కాంగ్రెస్ పార్టీ ఇన్‌చార్జీ,
కూకట్‌పల్లి



# ముద్ద నర్సింహా యాదవ్

కార్పొరేటర్, 121వ డివిజన్

ఓల్డ్ బోయిన్‌పల్లి, కూకట్‌పల్లి, నియోజకవర్గం

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01 A 135 |
| పుస్తకం పేరు | చైతన్య వాహిని |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |